# చతుర

అక్టోబర్ 2002
రూ.7/-



## ఫ్యామిలీ హిస్టరీ కార్డ్

కోలపల్లి ఈశ్వర్

# చతుర కతలు

## లీటర్‌కి “ఎనభై కి.మీ”

ప్రొద్దున్నే ఈనాడు పేపర్ చూస్తున్నాడు లింగయ్య. ఏదో చప్పుడయితే తల తిప్పి చూశాడు.

అల్లుడు సుబ్బారావ్... కాళ్లు వంచి, చేతులు చాచి... ఓ భంగిమలో నిల్చు న్నాడు.

అల్లుడు అలా ఎందుకు చేస్తున్నాడో



లింగయ్యకు తెలుసు. ఆ భంగిమ చూసి తనకో స్కూటర్ కొనిపెడతాడని సుబ్బారావ్ చిన్ని ఆశ.

సుబ్బారావ్ నిరీక్షణ ఫలించి లింగయ్య తల తిప్పి “ఏమిటి అల్లుడూ... ఏదైనా కొత్త యోగాసనం ప్రాక్టీస్ చేస్తున్నావా?” అన్నాడు.

“ప్చ్. కాదు! మావయ్యా?”

“పోనీ ప్రొద్దున్నే మోషన్ సరిగ్గా కాలేదా? వేణ్ణీళ్లలో నిమ్మకాయ పిండి తాగా వంటే... హి... హి...”

“లేదు నాన్నా? మీ అల్లుడుగారికి స్కూటర్ కావాలట” చెప్పింది కూతురు. వెంటనే గుండెల్లో స్టోన్ పడింది... మళ్ళీ ముప్పైవేలు... ఆయనకు స్కూటర్ కనిపెట్టిన వాడిమీద తెగకోపం వచ్చింది.

“నాన్నా?... నేనూ స్కూటర్ వెనక కూర్చుని... ఇంచక్కా... వెళతాను?”

“ఊ... ఊహూ...”

“నువ్వు కాదంటే... మేమిద్దరం కంబైన్డ్‌గా ఏ “యాక్” టీవీ లోనో దరిద్రగొట్టు ఏడుపు సీరియల్ చూసి”

“అంతమాట ఎందుకులే అమ్మా? అల్లుడూ డబ్బు తీసుకెళ్లి... లీటర్‌కి ఎనభై కిలోమీటర్లు వచ్చే స్కూటర్ కొనుక్కో”

కట్ చేస్తే...

★ ★ ★

ఓ షోరూమ్ దగ్గర స్కూటర్ల సముద్రం లోంచి ఓ స్కూటర్ సెలక్ట్ చేశాడు సు

బ్బారావు స్కూటర్ ఎనభై కి.మీ. వస్తే పెట్రోలు ఎంత ఆదా? రోజూ పెళ్లానికి మల్లెపూలు కొనుక్కుపోవచ్చు.

ధడ్‌మని స్కూటర్ స్టార్ట్‌చేసి రయ్‌మని హేపీగా డ్రైవ్‌చేస్తున్నాడు.

'ఓహో పావురమా! విన్నావా? నా స్కూటర్ ఎనభై పోతుందీ... రివ్వుమని పిట్టలాగా పోతున్నదీ... పోతున్నదీ... దీ... దీ... దీ...

నలభయ్యో కి.మీ. రాయి దగ్గర ఆగింది స్కూటర్.

తిట్టుకుంటూ, తోసుకుంటూ మళ్లీ షోరూం దగ్గరికి తీసుకువెళ్ళాడు.

"కెన్ ఐ హెల్ప్ యూ సర్?" మేనేజర్ వినయంగా అడిగాడు.

"దేంట్లోనూ స్కూటర్ తోయడంలోనా? ఏవయ్యా? లీటర్‌కి ఎనభై వస్తుందన్నావ్? ఏదీ... నలభైయ్యే వచ్చిందేం?" అరిచాడు.

"నలభై... మామూలుగా వస్తుందిసార్!! మిగతా నలభై మనం తోయాల్సి వుంటుంది. అంటే లీటర్‌కి ఎనభై..." అన్నాడు కిచకిచా నవ్వుతూ.

– డా. కె. శివ సుబ్బారావు

## 'బందు బందయ్యింది బాబోయ్'

"సుప్రభాతం దేవిగారూ... మీ ఆజ్ఞప్రకారం ఎనిమిదింటివరకూ, మీ ఛాయలకు కూడా రాలేదీ భా...వి...(భార్యా విధేయుడు) టింగ్...టింగ్ సమయం సరిగ్గా ఎనిమిది గంటలు... యింకలేస్తారా..." అంటూ పలికిన శ్రీవారి సుప్రభాతంతో కళ్ళు తెరిచింది భారతి.

"అబ్బా... అప్పుడే ఎనిమిదయిందా? అయినా ఈవేళ ఊరికే ఆఫీసుకు వెళ్ళి వచ్చెయ్యడమేగా. ఎలాగూ జనం వచ్చి బంద్ చేయిస్తారుగా. అసలే మా ఆఫీసు మెయిన్ రోడ్డు మీద ఉంది. సో... ఇప్పుడు హేపీగా, సింపుల్‌గా ఇడ్లీ చేసేస్తాను. వంట వచ్చింతరువాత... అన్నట్లు ఈ బడుద్ధాయిలు ఏరీ... ఇంకా లేవలేదా?" అడిగింది.

"వాళ్ళు నీ పిల్లలు తల్లీ, కుంభకర్ణుని అంశవాళ్ళు. అందులోనూ నిన్నరాత్రి నువ్వు వాళ్లను ముందే బ్రీఫ్ చేసి వదిలావు. 'రేపు 'బందు' మీకు స్కూలుండదు. ఎంచక్కా... నాకూ, నాన్నకూ ఆఫీసుండదూ' అంటూ. అది సరేకానీ పూర్తిగా కళ్ళు తెరిచావా... నీకో గుడ్‌న్యూస్ చెబుతా" అల్లరిగా అంటున్న శ్రీవారిని అనుమానంగా చూసింది భారతి.

"కొంపదీసి బందుకానీ లేదా ఏమిటీ..." అంటూ

"యస్... ఎవరికొంపా తీయలేదు కానీ బందు బందయ్యింది భార్యామణీ. ఇంక లేచి... కాస్త త్వరగా తెమిలితే ఆఫీసుకు వెళ్ళొచ్చు" చిలిపిగా అంటున్న శ్రీహరిని చూస్తే భారతికి కోపం నషాళానికి అంటింది.

"మీకసలు బుద్ధుందా, బంద్ లేకపోతే ఇంతవరకూ లేపకపోతే ఎప్పుడు తయారయి ఎప్పుడెళ్ళాలి... ఇంకా ఈ అడ్డగాడిదలు నిద్ర లేవలేదా" కోపంగా అంటున్న భారతితో...

"వాళ్ళు నీ పిల్లలూ" అన్నాడు సాగదీస్తూ అర్థవంతంగా.

మరొకప్పుడయితే నే అడ్డగాడిదనా అంటూ దెబ్బలాటకు దిగేదేకానీ ఆఫీసు టైమూ... చెయ్యవలసిన పనులూ గుర్తొచ్చి

"ఛ...ఛ... ఏం పనండీ... కొంచెం ముందు లేపచ్చుగా" అంది కోపంగా.

"ఎనిమిదింటివరకూ లేపావో ఖబడ్దార్ అన్నావుగా మరీ... దేవిగారి ఆజ్ఞ... మజా కానా" అన్నాడు శ్రీహరి.

"బుద్ధి గడ్డితిని అన్నానులెండి... మీరొక

చెయ్యేస్తే కానీ ఈరోజు సమయానికి తెమి లివెళ్ళం" అంటూనే పిల్లలను దబదబా బాది లేపేసింది భారతి.

"పోనిద్దూ వాళ్ళు ఒక్కరోజు స్కూలు మానేస్తే కొంపలేమీ మునగవు... వాళ్ళు ఇంట్లో ఉంటారు. పాపం వాళ్ళని అదరగొ ట్టకు" అంటున్న శ్రీహరిని

"చేసిన నిర్వాకం చాలు కానీ కాసేపు మీరూరుకుంటారా? ఇలా చీటికీ మాటికీ స్కూలు మానేస్తే అదే అలవాటయి కూర్చుంటుంది. ఇంక మీరు వీళ్ళపని చూసుకోండి. నేను గబగబా వంటపని చూస్తా" అంటూనే ఫ్రెషయి వచ్చేసింది.

"అబ్బ... ఏం స్పీడో మహాతల్లి... కాళ్ళకు చక్రాలున్నట్లు తిరుగుతుంది ఒక్క రోజు కూడా బద్ధకించదుకదా" ప్రేమగా అనుకున్నాడు శ్రీహరి.

వంటింట్లో అడుగుపెట్టిన భారతికి ఆశ్చ ర్యానందాలు ఒక్కసారిగా పెల్లుబికేయి. శ్రీహరిమీద ప్రేమ పొంగిపోయింది.

ఘుఘుమలాడే కాఫీ కప్పులలో పోస్తు న్నాడు ఫ్లాస్కులోంచి.

కూరగాయలు తరిగి నీటుగా పెట్టాడు. కుక్కరు దించడం ఆసరికే అయిపోయింది. "సారీ అండీ అనవసరంగా మీమీద కోప్ప డ్డాను. మా ఆయన బంగారం" అంటూ మురిపెంగా కాఫీ కప్పు అందుకుంది భారతి.

తను ఇడ్లీ కుక్కరు పెట్టేసి కూర చేసే లోపు పిల్లలస్నానాలు, డ్రస్సింగ్ అన్నీ కానిచ్చి రెడీ చేసేశాడు.

రోజూకంటే పదినిముషాలు ముందుగా తెమిలి డైనింగ్‌టేబిల్ దగ్గర చేరారంతా. గబగబా... టిఫిన్ చేసి పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయారు. స్కూలు రిక్షాలో పిల్లలకు కారియర్స్... తనకూ శ్రీహరికీ బాక్సులు రెడీ చేసి "రెడీ సార్" అంటూ తొమ్మిదిం పావుకల్లా ట్రిమ్‌గా వచ్చింది భారతి.

స్కూటరు ఎక్కి కూర్చుని "ఏమండీ ఇలా రోజూ బంద్ బందయితే బాగుండును కదూ..." అంటున్న భారతితో

"అబ్బా... ఆశ... దోసె... అప్పడం వడేంకాదూ... రోజూ నాచేత వెట్టిచాకిరీ చేయించాలనా? ఏదో ఒక్కరోజుకదా... అదీ 'బందు' ఆశపెట్టి బంద్ అయింది. ఏడుస్తావ్ పాపం అని చేశా" నవ్వుతూ అన్నాడు శ్రీహరి.

"మరే... మగమహారాజులు రోజూ కొంచెం సాయంచేస్తే దర్జా తరిగిపోతుంది కాబోలు" విసుక్కుంది భారతి.

భారతిని బ్యాంక్ దగ్గర దింపి, "పాపం... ఆశా... నిరాశేనా మిగిలింది బ్యాంకేనా..." అంటూ వెక్కిరించి వెళ్ళిపోయాడు శ్రీహరి.

రోజూకంటే రష్‌గా ఉంది బ్యాంక్. క్యాషి యరు భజగోవిందంగారు ఇంకా రాలేదు. ఈ మహానుభావుడికి బంద్ బంద్ అయిన వార్త తెలియలేదు కాబోలు అనుకుంది భారతి.

రిటైర్‌మెంట్ దగ్గరగా ఉన్న సీనియర్ క్యాషియర్ పావుగంట ఆలస్యంగా వచ్చాడు.

"ఛ...ఛ... వెధవబంద్ ఉందనుకుని లేటుగా లేచి చచ్చా... నిన్న మా ఫ్రెండొ కడు 'అర్జంటుగా ఊరికెళ్ళి చావాలి. నా స్కూటర్ పాడయిచచ్చింది. నీ స్కూటర్ ఇచ్చి చావరా. మళ్ళీ రేపు రాత్రికి ఇచ్చి ఛస్తా' అని అడిగి ఛస్తే... ఇచ్చిచచ్చా...

పొద్దుట తీరిగ్గా ఏండింటికి లేచిచచ్చా తీరుబడిగా పేపరు తియ్యగానే ఇంకేముందీ 'రైట్ రైట్' అంటూ కనబడిచచ్చింది. ఇదిగో సైకిలెక్కి వచ్చి చచ్చేసరికి లేట్ అయిచచ్చింది" సేఫ్ ఓపెన్ చేస్తూ పావు గంట ఆలస్యానికి పావుగంట వివరణ ఇచ్చాడు భజగోవిందం.

'ఆయనకు చిన్నప్పుడు వాళ్ళ తెలుగుమా స్టారు 'చ' గుణింతం ఎక్కువసార్లు రాయిం చారేమో. ప్రతి మాటలోనూ 'చ' వచ్చి చచ్చాల్సిందే. ఛ... ఛ... ఇదేమిటి నాక్కూడా అంటుకుంది' అని నవ్వుకుంటూ కౌంటర్ ఓపెన్ చేసింది భారతి.



"సార్ బ్యాంక్ నడుస్తుందా... లేక బందా" అడిగాడో అనుమానపు పక్షి.

అది విన్న భజగోవిందం"బాబూ బ్యాంక్ నడవదు. ఎక్కడకూ వెళ్ళదు. ఇక్కడే ఉంటుంది. బందా... నా బొందా... అనవసరంగా జరగబోయే బంద్‌మీద ఆశపెట్టుకున్నాను. ఈవేళ అది నాచేత సర్కస్ ఫీట్స్ చేయించి చచ్చింది"అంటూ మళ్ళీ నిట్టూర్చాడు.

"మగమహారాజులు మీకేం ఫీట్సుండీ బాబూ... అసలు పాట్లూ, ఫీట్స్... అన్నీ మావి. ఫాస్ట్ ఫార్వర్డ్ చేసిన మూవీలా ఒకటే స్పీడ్... మూవ్ అవలేక చచ్చాం పొద్దుటే" అంది ఆయాసపడుతూ అంబుజాక్షి. ఆవిడ రోజూ ఆలస్యమే మరి ఏం ఫీట్స్ చేసివస్తుందో కానీ...

ఊళ్ళో ఉద్యోగాలైతే అదోదారి... మరింక పొరుగూరు వెళ్ళి రావాల్సిన వారి పాట్లు వర్ణనాతీతం. ఇదండీ ఓ బంద్ బంద్ అయిన వైనం. ఇంచుమించుగా అందరి పరిస్థితీ ఇంతేనేమో కదూ.

– మీనాక్షీ శ్రీనివాస్

---

## అన్నీ లాభాలే!

"ఏమేవ్... కాస్త ఆ అగ్గిపెట్టి ఇలా ఇస్తావూ!" హుషారుగా భార్యను పిలిచాడు శివరావ్.

"అబ్బబ్బా... పొద్దున్నే మొదలైందీ గోల" అంటూ వంటగదిలోంచి సాధింపు సాగదీసింది సుబ్బలక్ష్మి.

శివరావ్, సుబ్బలక్ష్మిలకు రోజూ ఏదో సందర్భంలో గొడవ అవుతూనే వుంటుంది. అది సుబ్బలక్ష్మికి కావాల్సిన నగల గురించి కాదు, పట్టుచీరల గురించి అంతకన్నా కాదు. శివరావ్‌కున్న ఒకే ఒక్క అలవాటు అదే సిగరెట్ కాల్చడం. అలవాటంటే అలాంటిలాంటి అలవాటు కాదు. నిద్రలేచింది మొదలు నిద్రపోయేవరకూ స్నానం చేసేటపుడు, భోజనం చేసేటప్పుడు తప్ప ఎప్పుడూ నోట్లోంచి అలా సిగరెట్ పొగలు ఉంగరాల్లా తిరుగుతూనే వుంటాయి.

భారీ ఎత్తున డబ్బులు ఖర్చు అవడమే గాక బంగారంలాంటి ఆరోగ్యం కాస్తా పాడైపోతుందని భార్య ఎంత చెప్పినా శివరావ్ ససేమిరా వినేవాడు కాదు. సరికదా ఆ అలవాటుండి తనకు తెలిసినవాళ్ళు ఎంత ఆరోగ్యంగా వున్నారో వాళ్ల వయసులతో సహా

లెక్కలు కట్టి చెబుతుంటాడు. సుబ్బలక్ష్మికి మాత్రం భర్త ఆరోగ్యం మీద చెప్పలేని బెంగ, భయం పట్టుకున్నాయి. భర్తకు ఎలా చెప్పాలో అర్థంగాక ఒకటే దిగులుగా వుంది. అంత దిగులులోనూ ధీమాగా ఒక నిర్ణయానికొచ్చేసింది ఆ నిర్ణయమే భర్తతో చెప్పింది.

"చూడండీ... ఇవ్వాళనుంచి మీరు ఆ పాడు అలవాటు మానతారా లేదా? ఒక్క సారి డాక్టర్ దగ్గరకెళ్లి పరీక్ష అయినా చేయించుకోండి. ఆయనే చెబుతారు" అంది వేడుకోలుగా.

"చూడు సుబ్బూ... ఒక పూట భోజనం అయినా మానుకుంటానుగాని ఈ అలవాటు మాత్రం మానలేను. కాల్చకుండా వుండలేను. ఇక డాక్టర్ దగ్గరకంటావా. లేనిపోని పరీక్షలన్నీ చేసి బండెడు మందులు రాసిస్తారు. లేనిపోని జబ్బులున్నాయని చెప్పి అది మానెయ్యి ఇది మానెయ్యి అంటారు. దాంతో లేని జబ్బులు నిజంగానే వస్తాయి. అయినా ఇప్పుడు నాకేమైందనీ" బుజ్జగింపుగా అన్నాడు.

"మీకు చెప్పడం దండగ నా దారి నేను చూసుకుంటాను. ఇప్పుడే మా పుట్టింటికి బయలుదేరతా. ఆనక తీరుబడిగా ఒక్కరే కూర్చుని ఇష్టమొచ్చినట్లు కాల్చుకోవచ్చు" అంటూ రయ్యిన గదిలోకి సుడిగాలిలా దూరింది సుబ్బలక్ష్మి.

ఇల్లాలులేని ఇల్లు... ఆ హోటల్ తిళ్లు అన్నీ శివరావ్ కళ్లముందు గిరగిరా తిరిగాయ్. "అమ్మో సుబ్బు... అన్నంత పని చేసేలావుంది" అంటూ తనూ గదిలోకి బుజ్జగించడానికి బుల్లిబుల్లి అడుగులు వేస్తూ వెళ్లాడు.

అన్నివిధాలా ఇరుపక్షాల మధ్య భారీ స్థాయిలో గంటపాటు జరిగిన బుజ్జగింపు చర్చల అనంతరం ఎట్టకేలకు శివరావ్ ఆరోజు డాక్టర్ వద్దకు వెళ్లడానికి ఒప్పుకున్నాడు.

అనుమానంగా ఆందోళనగా తనవంతు వచ్చేదాకా ఎదురు చూపులు చూసి పిలుపు రాగానే కుడికాలు ముందుపెట్టి చేతిలో సిగరెట్‌తో ఆత్మారాముణ్ణి ధ్యానిస్తూ డాక్టర్ గదిలోకెళ్లాడు శివరావ్. తన సమస్యలన్నీ ఇరవై రెండు రీళ్ల సినిమా స్టోరీలా డాక్టరికి చెప్పుకుని భారంగా నిట్టూర్చి చివరగా తన అనుమానం కూడా వెళ్లగక్కాడు.

"ఈ అలవాటువల్ల అందరూ అంటున్నట్టు అన్నీ నష్టాలే అంటారా? లాభాలు ఏమీలేవా? " అని.



డాక్టర్ ధనార్జన్‌రావ్ చిరుదరహాసంతో కుర్చీలో జారబడి... "ఎవరన్నారూ? అన్నీ నష్టాలే అని! లాభాలూ వున్నాయ్!" అన్నాడు అదే దరహాసంతో

"ఏంటీ లాభాలున్నాయా? " అంటూ అంతులేని ఆనందంతో పైకి లేవబోయి తమాయించుకు కూర్చుని "అవేంటో తొంద రగా చెప్పరూ? " అన్నట్టు చూశాడు.

"ఔనండీ! ఈ అలవాటువల్ల వృద్ధాప్యం రాదు" సింపుల్‌గా చెప్పాడు డాక్టర్.

"ఏంటీ! ముసలితనం రాదా? ఎంత చల్లని విషయం చెప్పారూ" శివరావ్ మెచ్చు కోలుగా అన్నాడు.

"అదొక్కటే కాదు ఇంకా బోలెడు లాభాలు న్నాయి తెలుసా? " అన్నాడు మరింత ఊరి స్తున్నట్టు.

"ఆ లాభాల గురించి అలా వుంచండి. ముందు ఈ అలవాటుకు, ఆ నిత్య నూతన యవ్వనానికి గల లింకేంటో కాస్త చెప్పండి. ఇంట్లో మా ఆవిడకు చెప్పాలి. ఆపైన మా ఫ్రెండ్స్‌కి కూడా" అంటూ తెగ తొందరచే శాడు.

"ఇందులో చెప్పుకోదగ్గ లింకేముంది? వెరీ సింపుల్. ఈ అలవాటు వల్ల అనేక రోగాలొచ్చి ముసలితనం రాకుండానే ఈ నిండు యవ్వనదశలోనే టపా కట్టేస్తారు. ఇక ముసలితనం ఎలా వస్తుంది? " అంటూ నిమీలితనేత్రాలతో దీర్ఘంగా ప్రశ్నించాడు డాక్టర్.

"ఆ, ఇంకా మిగతా లాభాలు కూడా చెప్ప మంటారా? " అంటున్న ధనార్జన్‌రావ్‌కి చేతిలో సిగరెట్ పారేసి పరిగెడుతున్న శివ రావ్ లీలగా కనిపించాడు.

**– అమ్మిన శ్రీనివాసరాజు**

---

## తేడా

"హలో!" అంటూ చిరునవ్వుతో పలకరించిం దామె. "నా పేరు వెంకమాంబ" అంది. పాతికేళ్లుంటాయి ఆమెకు.

ఆశ్చర్యపోతూ తన పేరూ చెప్పాడు ముప్ఫయ్యేళ్ల వెంగళ్రావు.

కిసుక్కున నవ్విందామె. "మనిద్దరి పేర్ల లోనూ మొదటి అక్షరం ఒకటే" అంది.

ఓ వెర్రి నవ్వు నవ్వాడతను.

సెకెండ్ హ్యాండ్ హ్యూమన్‌బాడీ పార్ట్స్‌ని నిలవచేసే బ్యాంక్ అది! బ్లడ్‌బ్యాంక్‌నుంచి బ్లడ్ కొనుక్కున్నట్టే ఏ రోగికైనా ఏ అవయవ మైనా ట్రాన్స్‌ప్లాంట్ చేయగల అవకాశ ముంటే ఆయా శరీర భాగాలు ఆ బ్యాంక్‌లో దొరుకుతాయి.

"మీరు ఏ పార్టు కోసం వచ్చారు? " అనడి గింది వెంకమాంబ చొరవగా.

"బ్రెయిన్... అదే, పురుషుల మెదడు కోసం" అన్నాడు వెంగళ్రావు.

"అరె! నేనూ బ్రెయిన్‌కోసమే వచ్చాను. ఫిమేల్ బ్రెయిన్" అందామె ఆశ్చర్యంగా.

"కోయిన్సిడెన్సు మన పేర్లకే పరిమితం కాలేదు" అన్నాడతను విస్మయంగా.

అంతలో డాక్టర్ వచ్చాడక్కడికి. "బోతాఫ్ యూ ఆర్ లక్కీ. మేల్ బ్రెయినూ, ఫిమేల్ బ్రెయినూ ఒక్కొక్కటే వున్నాయి స్టాకులో" అన్నాడు వారి నుద్దేశించి.

వారి వదనాలు వికసించాయి.

"వెల చెబితే వెంటనే వెళ్లి డిమాండ్ డ్రాఫ్ట్ తీసుకొస్తాను," అన్నాడు వెంగళ్రావు.

"పురుషుల మెదడు యాభై వేలు, స్త్రీల మెదడు పాతిక వేలూను" అన్నాడు డాక్టర్.

"రేట్లలో అంత తేడా ఏమిటీ? " విస్తుపో యాడు వెంగళ్రావు.

"స్త్రీ మెదడు రేటు ఎప్పుడూ తక్కువే!" అన్నాడు డాక్టర్.

వెంకమాంబ ముఖం జేవురించింది. "వాట్డూయూ మీన్? ఈ విషయంలో కూడా ఆడదంటే తేలిక భావమేనా? స్త్రీ మెదడును పురుషుడి మెదడులో సగం ధరకు అమ్మ

డంలో మీ వుద్దేశ్యమేమిటి? మహిళా మండలి సెక్రెట్రీని నేను. మీ పురుషాధిక్యపు పొగరణుస్తాను" అంది ఆవేశంగా.

ఆమె రియాక్షన్‌కి డాక్టరు, వెంగళ్రావు కూడా స్టన్నయిపోయారు.

"అదేమిటండీ? ధర తక్కువయినందుకు సంతోషించాలిగాని ఇలా అభ్యంతరం చెబుతారేమిటీ? " అన్నాడు వెంగళ్రావు తెల్లబోతూ.

"ఇది ధర సమస్య కాదు. స్త్రీల ప్రిస్టేజ్ విషయం" అందామె హాట్‌గా.

డాక్టర్ తేరుకుని "మీరు ఏవేవో వూహించుకుని అనవసరంగా ఎక్సైట్ అయిపోతున్నారు. ఈ ప్రైసింగ్ వెనుకున్న లాజిక్‌ని వివరిస్తానుండండి" అన్నాడు.

ఆ బ్యాంక్ పక్కకే ఓ పెద్ద కార్ గరాజ్ వుంది. ఆ ఇద్దరినీ అక్కడికి తీసుకువెళ్లాడతను.

ఆ గరాజ్‌లో సెకెండ్ హ్యాండ్ కార్లున్నాయి. వాటిని చూపించి "ఇవన్నీ సెకెండ్ హ్యాండ్ వెహికల్సు. వీటిలో కొన్నిటి కండిషన్ బాగుంది. మరికొన్ని మరీ పాతగా వున్నాయి. అంటే బాగా కనిపిస్తున్నవి అంతకుమునుపు ఎక్కువగా వాడబడలేదనీ, మిగతావి బాగా వాడబడ్డాయని అర్థమవుతోంది. ఔనా? " అనడిగాడు

ఔనన్నారిద్దరూ.

"సో, తక్కువగా వాడబడ్డ వాటికి హెచ్చు ధర, ఎక్కువ వాడకానికి గురయిన వాటికి తక్కువ ధరా వసూలు చేయడం సబబా కాదా? "

"సబబే"నని ఒప్పుకుందామె.

"హ్యూమన్ బ్రెయిన్ ధర వెనుకనున్న లాజిక్కూ ఇదే మరి" అన్నాడు డాక్టర్.

అర్థం కానట్లు చూసిందామె.

"ఫిమేల్ బ్రెయిన్ ఈజ్ ఎ యూజ్డ్ వన్. అంటే ఎక్కువగా వాడబడేది అదేనన్న మాట. అందుకే పురుషుడి మెదడు కంటే రేటు తక్కువ" అన్నాడతను మందహాసంతో



చటుక్కున స్ఫురించింది వెంకుమాంబకు అందులోని మెలిక ఏమిటో! హాలోజెన్‌ల్యాంపులా వెలిగిపోయింది ఆమె వదనం.

అయితే వెంగళ్రావు ముఖం మాడిపోయింది ఫ్యూజ్డ్ బల్బులా!

– తిరుమలశ్రీ

# చతుర

సంపుటి : 25 ★ సంచిక: 9
అక్టోబర్ : 2002 ★ 297 వ సంచిక



పెళ్లిచూపులకొచ్చిన అబ్బాయి... తాను అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడాలన్నాడు!

అమ్మాయి గుండె వేగంగా కొట్టుకుంటోంది.

మీకు 'యూజెనిక్స్' అంటే తెలుసా? అన్నాడు.

అదేదో సెక్స్ విషయమేమో అని బోలెడు సిగ్గుపడిపోయిందా అమ్మాయి.

ఆ అమ్మాయికి తెలియదన్న సంగతి అతడి
కర్థమై కాబోలు... చెప్పడం
ప్రారంభించాడు.
"మెంటల్‌గా, ఫిజికల్‌గా స్ట్రాంగ్
అండ్ పెర్‌ఫెక్ట్ హ్యూమన్‌రేస్‌ని
ప్రొడ్యూస్ చేసే బాధ్యత
పెళ్లి చేసుకోబోయే
యువతీ యువకుల
కుంది..." అంటూ
అతడు చెప్పిన వివర
ణకు ముందు తెల్లబోయి...
అటుపైన భయపడిందా
అమ్మాయి.
అలా చెబుతూ వారి పెళ్లి
జరగడానికి అతను
పెట్టిన చిత్రమైన
కండిషన్ ఎలాంటిది?
దానికా అమ్మాయి ఎలా
స్పందించింది? చివరికి వారి
పెళ్లి జరిగిందా?
నవ్విస్తూనే ఆలోచింపచేసే

**కొలపల్లి ఈశ్వర్** రచన

# ఫ్యామిలీ హిస్టరీ కార్డ్

ఈ నెల చతుర సమగ్ర నవల.



అ తను నాతో ఏకాంతంగా మాట్లాడాలట! ఏం మాట్లాడతాడో!

నాకు ఉద్వేగంగా ఉంది.

ఏంపేరు? ఏంచదివారు? లాంటి రొటీన్ ప్రశ్నలే వేస్తాడా?

పోనీ... మీరు నాకు నచ్చారు. నేను మీకు నచ్చానా? లాంటి రొమాంటిక్ ప్రశ్నలు అడుగుతాడా?

ఏమడుగుతాడో!... ఏదో ఒకటి త్వరగా అడిగితే బాగుణ్ణు.

పెళ్లి చూపుల్లో.... అమ్మాయిలూ, అబ్బాయిలూ.... ఇలా ఏకాంతంగా మాట్లాడుకోవడాలు ఇవాళ కొత్తకాకపోయినా... నాకు మాత్రం ఏమిటోగా ఉంది.

ఇష్టంగానే ఉంది గానీ, బెరుగ్గా ఉంది.

ఇలా అతని కెదురుగా కూర్చోవడం అనే అనుభవం హాయిగానే ఉంది..... ఎట్ ద సేమ్ టైమ్ అనీజీగా ఉంది. నేను ఓరగా అతనికేసి చూశాను. అతనేదో అడగడానికి నోరు విప్పుతున్నట్టుగా అన్పించి చటుక్కున చూపులు తిప్పుకున్నాను.

ఒకవేళ... వెరైటీగా ఐ లవ్ యూ అంటాడా?

నా గుండె వేగంగా కొట్టుకుంది.

"ఎక్స్‌క్యూజ్ మీ..." అతనన్నాడు.

ఎక్స్‌క్యూజ్ చేసేశాం కానీ అడుగూ...

"మీరు... 'యూజెనిక్స్' అనే మాట ఎప్పుడైనా విన్నారా?"

యూజెనిక్సా? అంటే ఏంటబ్బా?

కొంపతీసి.... ఏదైనా సెక్సీ టర్మ్ కాదు కదా?

నా చెంపల్లో సిగ్గుల మొగ్గలు చకచక రేకులు విప్పుకుని చెక్కిళ్లు ఎర్రని పూల చేలయ్యాయి.

తల బాగా వంచేసి అన్నాను "విన్లేదు"

"అనాటమీ, ఫిజియాలజీ, జువాలజీలాగా అది కూడా సైన్స్ లో ఓ బ్రాంచ్"

నీ మొహం కాదూ? కాబోయే లైఫ్ పార్ట్నర్‌తో లవ్లీగానో సెక్సీగానో మాట్లాడక... మధ్యలో ఈ సైన్సూ, సోషలూ ఏమిట్రా బాబూ?

"అహా! అవునాండీ?" అన్నా కొంచెం తలెత్తి.

"యూజెనిక్స్ ఏంచెబుతోందో తెలుసాండీ అజంత గారూ?"

నాకేం చెప్పలేదు శంకరయ్యగారూ! మీకేమైనా చెప్పిందా అనాలనుకుని కూడా "తెలీదండీ" అనేశాను.

"మెంటల్‌గా, ఫిజికల్‌గా స్ట్రాంగ్ అండ్ పెర్‌ఫెక్ట్ హ్యూమన్ రేస్‌ని ప్రొడ్యూస్ చేసే బాధ్యత మన మీద ఉందనంటోంది యూజెనిక్స్!"

నా శరీరం సిగ్గుతో ముడుచుకుపోయింది.

పెళ్లికాకుండానే ప్రొడక్షన్ గురించి మాట్లాడుతున్నాడేమిటీ మహానుభావుడు అనుకున్నాను.

"ఫ్యూచర్ ఇండివిడ్యువల్స్... ఐ మీన్... మనకు పుట్టబోయే పిల్లల జెనెటిక్ క్వాలిటీస్ ఇంప్రూవ్‌డ్ వే లో వుండాలి. అలా ఉండాలంటే... ఆడా మగా మేటింగ్ సెలెక్టివ్‌గా ఉండాలి."

నాకు చిన్నప్పటినుంచీ సైన్స్ అంటే చెడ్డ చిరాకు. బొద్దింక బాడీ గురించో, గోంగూర రూట్స్ గురించో చదవడం వల్ల ఏం ఒరుగుతుందో అర్థమయ్యేది కాదు.

సైన్స్ మాష్టారు బోర్డు మీద జీర్ణ వ్యవస్థ బొమ్మ గీసి... ఆహారం ఎట్లా జీర్ణమవుతుందో వివరిస్తుంటే... నాకు తిన్నదంతా అరిగిపోయినట్టు నీరసం ముంచుకొచ్చేది.

ఆయనగారు ఏ వానపాము ప్రత్యుత్పత్తి వ్యవస్థ గురించో వర్ణిస్తుంటే... అబ్బాయిలు మా అమ్మాయిల వైపు చూసే దొంగ చూపులకు సిగ్గుతో చచ్చిపోవాలనిపించేది.

స్కూల్ ఫైనల్ వరకూ తప్పని తద్దినంలా భావించిన ఆ సబ్జెక్ట్‌ని.... ఇంటర్‌లో వదిలించుకుని ఆర్ట్స్ స్టూడెంట్‌నయిపోయా.

మళ్లీ ఇన్నాళ్లకు... ఎంతో రొమాంటిక్‌గా

ఊహించుకున్న పెళ్లిచూపుల నేపథ్యంలో.... ఇట్లా సైన్స్ పాఠాలు వినవల్సొస్తుందని కల్లో కూడా...

"సెలెక్టివ్ మేటింగ్ అంటే...." అతను ఒక్క క్షణం ఆగాడు.

బాబోయ్... టీకా, తాత్పర్యం చెప్పబోతు న్నాడు! అప్పటి సినిమాల్లో ఎన్టీఆర్‌లా... తల స్తంభానికేసి బాదుకోవాలనిపించింది. అయినా మర్యాదొకటి ఏడ్చిందిగా! అందుకే "అంటే ఏంటండీ? " అన్నాను అమాయ కంగా మొహం పెట్టి.

"సెలెక్టివ్ మేటింగ్ అంటే తగిన జోడీని సెలెక్ట్ చేసుకోవడం" అన్నాడతను ఓ డెఫిని షన్ ఇస్తున్న లెవెల్లో.

'గంతకు తగ్గ బొంత అంటారు చూడండి... అట్లానా?' పెదవి దాకా వచ్చిన మాటను మింగేశాను.

"ఆ సెలెక్షన్ సరిగ్గా జరగాలంటే... జస్ట్... యూజెనిక్స్ చెబుతున్న కొన్ని సూత్రాలను మనం ఫాలో అయితే చాలు" అన్నాడు.

"ఆహా.." అన్నాను టీ కెటిల్లో మిగిలిన టీ ని అతని మొహంమీద పోస్తే ఎట్లా ఉంటుందో ఊహించుకుంటూ.

"మొదటి రూల్... ఫీబుల్ మైండెడ్... ఐ మీన్ బుద్ధి మాంద్యత గల వ్యక్తులు పెళ్లికి దూరంగా ఉండాలి"

బుద్ధిమాంద్యం మాకేం లేదండీ.... మీకే ఉన్నట్టుంది అనాలనుకుని తమాయించు కున్నా.

"ఇక రెండవది... తల నెరవడం, కంటి జబ్బులూ, షుగరూ లాంటి హెరిడిటరీ జబ్బులున్న వాళ్లుగానీ వాళ్ల సంతానం గానీ పెళ్లి ఊసెత్తకూడదు. ఒకవేళ పెళ్లి చేసుకున్నా పిల్లల్ని కనకూడదు"

నిజం చెప్తున్నా గురూ! మా నాన్నకి షుగ రుంది ... ఈ మాట కూడా అందామనుకు న్నదే.... కానీ అనలేదు.

"దెన్ ద థర్డ్ వన్... కాన్ సెంగ్వేని యస్ మేరేజెస్‌ని అంటే మేనరికపు పెళ్లిళ్లను చేసుకోకూడదు."

నాకు మేనరికం ఉంటే ఇల్లా నీముందెం దుకు కూర్చుంటాను?

"రూల్.... ఉడ్ బీ కపుల్ ఫేమిలీ హిస్టరీ కార్డ్స్‌ని ప్రిపేర్ చేసుకుని... ఇద్దరి పేరెంటేజ్ హెల్దీగా ఉందన్న నిర్ధారణకొ చ్చాక మాత్రమే పెళ్లికి ఓకే చెప్పుకోవాలి"

ఓకే బాస్... యాజ్ యూ లైక్.

"కమింగ్ టూ ద లాస్ట్ రూల్... కాబోయే జంట ఖచ్చితంగా జెనిసిస్ట్‌ని కన్సల్ట్ చేసి జెనిటిక్ కౌన్సిలింగ్ చేయించు కోవాలి. ఇద్దరిలోనూ జన్యుపరంగా ఏ లోపం లేదని చెప్పాకే వాళ్లు మేరేజ్‌కి రెడీ కావాలి"

అబ్బో ఇంత తతంగముందా యూజెనిక్స్ ప్రకారం పెళ్లి చేసుకోవాలంటే! అనుకుం టుంటే నీరసం ముంచుకొచ్చింది నాకు.

అతను మాత్రం ఉత్సాహంగానే చెబుతు న్నాడు. "సో ఆరోగ్యపరంగా ఇన్ని జాగ్ర త్తలు తీసుకుని... ఐ మీన్... సెలెక్టివ్‌గా లైఫ్ పార్టనర్స్ కాగలిగిన వాళ్లే హెల్దీ జెనరే షన్‌ని అందివ్వగలుగుతారు. అలాంటి సంతానం నుంచి మరోటీ, మరోటీ కంటిన్యూ అయిపోతూ ఫ్యూచర్ సొసైటీ అంతా ఎటువంటి జబ్బులూ లేని హెల్దీ జీన్ పూల్ ఉన్న మనుషుల్తో నిండిపో తుంది. నా దృష్టిలో అసలైన సోషల్ సర్వీ స్‌కి మార్గం కేవలం సెలెక్టివ్ మేటింగే. ఏమంటారు? "

నేనేమంటాను? నోట మాటరానట్టు అతన్నే చూస్తూ ఉండిపోయాను.

నేను నైన్త్ క్లాస్ చదివేటప్పుడనుకుంటా సైన్స్ మాస్టారు రకరకాల జంతువుల విస ర్జక వ్యవస్థల్ని గురించి వివరిస్తూ రేబిట్ గురించి ఓ విషయం చెప్పాడు. అది తను విసర్జించిన పదార్థాన్ని తిరిగి తింటుందిట.

ఆ సైన్స్ పాఠం వింటున్నప్పుడు... జుగు ప్సతో డోకొచ్చినంత పనయింది నాకు.

సరిగ్గా ఇప్పుడు కూడా ఈ సైన్స్ పాఠం వింటుంటే అలాంటి భావనే కలిగింది.

"దట్స్ వై.... నేను చెప్పేదేమంటే... మనిద్దరం దాపరికాల్లేకుండా ఒకరి విషయాలొకరం చెప్పుకుందాం. నా ఫేమిలీ హిస్టరీ కార్డ్ మీకిస్తాను. అట్లాగే మీది మీరు ప్రిపేర్ చేసి నాకివ్వండి. బైలక్ అన్నీ సెట్ అయ్యాయనుకోండి.... ఇద్దరం జెనిటిక్స్ కౌన్సిలింగ్ చేయించుకుందాం. అక్కడా గుడ్ రిజల్ట్ వచ్చిందనుకోండి.... మన మేరేజికి ఇక ఏ అడ్డులూ ఉండవు" తన పాఠాన్ని కంక్లూడ్ చేశాడతను.

తల ఊపాలా వద్దా అన్న విషయాన్ని తేల్చుకునే లోపలే అతను లేచి ప్యాంట్ జేబులోంచి ఒక కవర్ తీసి "ఇట్స్ మై ఫామిలీ హిస్టరీ కార్డ్" అంటూ నాకందించి "నా మాటల్ని మరోలా అర్థం చేసుకోకండి. వి ఆర్ ఎడ్యుకేటెడ్. పెద్దవాళ్లకివన్నీ చెప్పలేం. మీరే ఆలోచించుకుని నాకు రిప్లై ఇవ్వండి" అన్నాడు.

ఏడవలేక నవ్వాను.

అతను లేచి హాల్లోకి వెళ్లిపోయాడు.

అతని తరుపు వాళ్లు అమ్మానాన్నలతో అవీ ఇవీ మాట్లాడుతున్నారు.

నాకన్నీ స్పష్టంగా వినబడుతున్నాయి.

కట్నం అస్సలు వద్దట. లాంఛనాలు కూడా మా ఇష్టమేనట. నగలూ, చీరల గురించి పట్టించుకునే ప్రసక్తే లేదట. పెళ్లి ఖర్చు కూడా వాళ్లే పెట్టుకుంటారట.

నాకు తెలుసు అమ్మానాన్నా ప్రస్తుతం గేస్ బెలూన్స్ లా గాల్లో తేలిపోతుంటారని.

అతన్నాతో పర్సనల్‌గా మాట్లాడిన విషయాల్ని వాళ్ల చెవిని వేస్తే ఎట్లా ఫీలవుతారో అని ఒక్క క్షణం ఆలోచించాను.

షుగర్ పేషెంట్ అయిన నాన్న గేస్ తీసిన బెలూన్ అయిపోతాడు.

చిన్నతనంలోనే జుట్టు నెరిసిపోగా అప్పట్నుంచీ డై వాడే అమ్మ ముఖం మాడిపోయిన పెసరట్టులా అవుతుంది.

పదిహేనేళ్ల వయసునుంచే కళ్లద్దాలు తగిలించుకున్న నా సహోదరి రాణి అద్దాల్లోంచి నాకేసి దీనాతిదీనంగా చూస్తుంది.

డస్ట్ అలర్జీ ఉన్న నా సహోదరుడు విక్రమార్కుడు ఏడవలేక నవ్వుతాడు.

నేనిట్లా ఆలోచిస్తూండగానే పెళ్లివాళ్లు వెళ్లిపోయారు. మా ఫ్యామిలీ మెంబర్స్ వాళ్లని గుమ్మం వరకూ సాగనంపి వచ్చి నన్ను చుట్టుముట్టారు.

అదృష్టవంతురాలంటే కేవలం నేనేనంటూ ఆకాశానికెత్తేశారు.

నాన్నయితే నా తల మార్దవంగా నిమిరి "నే చెప్పలా... నా చిట్టితల్లిని వెదుక్కుంటూ రాకుమారుడు వస్తాడని" అన్నాడు.

"ఆహా... బావగారు ఏ దేశపు రాకుమారుడు నాన్నా?" అంది రాణి ముక్కుమీదకు జారిన కళ్లజోడు వెనక్కు నెట్టుకుంటూ.

"ప్రేమ దేశానికి" అన్నాడు మా డస్ట్ ఎలర్జీ వెధవ.

ఒక్క అరుపు అరిచి వాళ్లని కంట్రోల్ చేసి నా పెళ్లికొడుకు నాకు చెప్పిన పాఠాన్ని వాళ్లకు చెప్పాలనిపించింది. కానీ... వాళ్ల ఆనందాన్ని ఇప్పుడే పాడు చెయ్యడమెందుకులే అన్పించి నోరు కట్టేసుకున్నాను.

ఆ రాత్రి నా పెళ్లి చూపుల ప్రహసనం గురించే ఆలోచిస్తూ పడుకున్న నాకు... నా పెళ్లికొడుకుగారి తల్లిదండ్రులు కట్న కానుకల విషయంలో కన్సెషన్ ఎందుకిచ్చారా అన్న డౌట్ సడన్‌గా కలిగింది.

మామూలుగా మగ పెళ్లివారు ఆదర్శప్రాయంగా కట్నం వద్దన్నా... అబ్బాయిలో ఏదైనా లోపం ఉందేమోనని అనుమానించే నైజం మనది.

బట్ ఈ కేసలా కాదే

అతనిచ్చిన ఫేమిలీ హిస్టరీ కార్డ్ చూస్తుంటే.... అతనే కాదు... అతని ఫేమిలీ మెంబర్స్ మొత్తం పర్‌ఫెక్ట్‌లీ ఆల్ రైట్ అని తెల్సిపోతుంది.

మరి ఈ కన్ఫ్యూషన్‌కి కారణం ఏమిటబ్బా? చాలా సేపు నిద్ర పట్టలేదు నాకు.

★ ★ ★

రాత్రి ఆలశ్యంగా పడుకోవడం వల్ల నేమో... మామూలుగా ఆరింటికల్లా లేచే నాకు ఏడైనా మెళకువ రాలేదు.

అమ్మనుకుంటా "లేవ్వే అంజూ!" అంటోంది.

నేను ఊ...ఊ... అంటున్నానే కానీ లేవటం లేదు.

"ఏడైందే" అందమ్మ.

"ఒక్క ఐదు నిమిషాలు" చెబ్తూనే పక్కకు తిరిగి ముడుచుకు పడుకున్నాను.

"రోజూ ఆరింటికల్లా లేచే పిల్ల.... ఇవ్వాళేంటబ్బా! అమ్మాయ్ రాణీ, అక్క ఒళ్లు పట్టుకుని చూడమ్మా జొరం గానీ వచ్చిందేమో" అని అమ్మ అనడం లీలగా వినబడుతోంది.

రాణీ వచ్చి నా చెంప మీద చేత్తో తాకినట్టు నాకు తెలుస్తూనే ఉంది.

"వేడిగానే ఉందమ్మా. అయితే అది జ్వరం కాదులే" అందది.

"వేడిగా ఉంటే జొరం కాక మరేంటే?" అమ్మ కంగారుగా నా దగ్గరకొస్తున్నట్లు అడుగుల శబ్దాన్ని బట్టి అర్థమౌతోంది నాకు.

"ఈ టైపు వేడిని విరహతాపం అంటార్లే. నిన్నేగా పెళ్లి చూపులయ్యాయి. రాత్రంతా నిద్రపట్టుండదు దానికి"

రాణి వాగుడికి నా బద్ధకం ఎగిరిపోయింది. కప్పుకున్న దుప్పటి విసిరికొట్టి లేచి కూర్చున్నాను.

రాణి మాటలకి అమ్మ "నువ్వూరికే దాన్ని ఉడికించకు" అంటూ నవ్వుతోంది.

"ఉడికిస్తే ఉడికి పోవడానికి అదేమైనా బంగాళాదుంపా?" అంటోందది.

"ఇంక చాల్లే. నీ చీప్ జోక్స్ ఆపు" అని దాన్ని గదమాయించి బాత్రూంలోకెళ్లాను.

స్నానం చేసి వచ్చి కూర్చునేసరికి రాణి పొగలుకక్కే కాఫీ కప్పు తెచ్చి నాకిచ్చింది.

హాల్లో సోఫాలో కాలిమీద కాలేసుకుని కూర్చుని కంఫర్టబుల్‌గా వెనక్కి జారబడ్డాను. అక్కడే కూర్చుని పేపర్ చదువుకుంటున్న నాన్న... పేపర్ లోపలి లీఫ్ తీసి నాకిచ్చాడు.

పేపర్ జస్ట్ అలా తిరగేస్తూ హెడ్‌లైన్స్ చూస్తానేగానీ ఆమూలాగ్రం చూసే అలవాటు నాకు లేదు. రాజకీయ వార్తలైతే అస్సలు చదవను. ఆ టైపు న్యూస్ అంటే పరమబోర్ నాకు. ఏ హెడ్‌లైన్‌లోనైనా వెరైటీ కనిపిస్తే... దాన్నిమాత్రం చదువుతా.

కాఫీ సిప్ చేస్తూ అట్లా పేపర్ తిరగేస్తున్న నా కళ్లు ఉన్నట్టుండి ఓ చోట ఫిక్సయి పోయాయి.

"ఇంటర్‌నెట్‌లో వేలానికి అందగత్తెల అండాలు"

ఆ హెడ్ లైన్ విచిత్రంగా అనిపించడంతో ఆ వార్తని ఆసక్తిగా చదివాను.

ఆ న్యూస్ ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్‌కి సంబంధించింది.

పిల్లలు లేని వాళ్లు... కృత్రిమంగా గర్భం ధరించడం ఈరోజుల్లో కొత్తేమీ కాదుగానీ... అందగత్తెల అండాల్ని ఏకంగా ఇట్లా వేలానికి పెట్టి మరీ అమ్మడం విచిత్రమనిపించింది. అది లండన్ న్యూస్. అక్కడి మోడల్స్ కొందరు ఈ వ్యాపారానికి దిగారట. ఏ వెబ్‌సైట్‌లో అండాలని అమ్మే మోడల్స్‌కి సంబంధించిన సమాచారం ఉంటుందో కూడా అక్కడ మెన్షన్ చేశారు. అండాలను కొనుగోళ్లు చేసేవారు నచ్చిన మోడల్‌ని సెలెక్ట్ చేసుకుని వేలానికి దిగాలి. వేలంలో ఆమెను పాడుకోగలిగిన వాళ్లకు ఆమె అండం దక్కుతుంది. ఈ వెబ్‌సైట్ ప్రారంభించింది ఓ ఫొటోగ్రాఫర్‌ట. త్వరలోనే సెమెన్ని కూడా వేలానికి పెట్టే ఆలోచనలో ఉన్నాడట.

వేలంలో ఎక్కువ ధర పెట్టగలిగిన వారికి తక్కువకాలంలోనే బిగిసడలని

యవ్వనం, అందం లభిస్తాయి' అన్నది అతని బిజినెస్ స్లోగనట.

తల తిరిగిపోయింది నాకు.

నిన్నటి నా పెళ్లి చూపుల దెబ్బకే నీరస పడిపోయిన నేను... ఈ వార్త చదివి మరీ డీలా పడిపోయాను. నాన్నకి పేపర్ అందిస్తూ "నాన్నా... ఈ న్యూస్ చదువు" అన్నాను.

నాన్న చదివి నిట్టూర్చాడు.

"టుడేస్ హ్యూమన్ వాల్యూస్ ఆర్ లైక్ దిస్" అన్నాడు.

"అసలు సైన్సే నాన్నా ఈ ప్రపంచాన్నిట్లా దిగజారుస్తోంది" ఎగ్జయిటయిపోతూ అన్నాను.

"నీ ఆర్గ్యుమెంట్ చాలా తప్పమ్మా. పిల్లల్లేరని కుమిలిపోయే దంపతుల వేదన తీర్చడంకోసం ఏ సైంటిస్టో కనిపెట్టిన అద్భుతం ఈ ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్. ఎవరి వీర్యాన్ని గర్భధారణకు వాడుతున్నారో కనీసం ఇన్‌సెమినేషన్ చేయించుకునే స్త్రీకి కూడా తెలియనివ్వలేదు నిన్నటి వరకూ. మోరల్‌గా అది తప్పని భావించటం వల్ల... బట్.... ఇవాళిట్లా మానవ జన్మనే వేలం వేస్తున్నారంటే అది మనిషిలోని స్వార్థం వేసిన వెర్రితలలకు పరాకాష్ఠ అనుకోవాలి గానీ... సైన్స్ ప్రపంచాన్ని పక్కదారి పట్టిస్తోందనడం మూర్ఖత్వం" అన్నాడు నాన్న.

నిజమే అనిపించింది నాకు.

అమ్మ టిఫిన్‌కి రమ్మంటూ వంటింట్లోంచి కేక పెట్టింది.

నాన్నా, నేనూ వెళ్లాం. అప్పటికే రాణి, విక్కీ కూర్చుని మాకోసం ఎదురు చూస్తున్నారు.

అమ్మ మా నలుగురి ముందూ ప్లేట్లు పెట్టి వేడివేడి ఇడ్లీ వడ్డించింది.

అమ్మ మా అందరికీ చట్నీ వేసి విక్కీకి వెయ్యబోతుంటే వాడు "చట్నీ వద్దు కారప్పొడి, నెయ్యి" అన్నాడు.

"అస్తమానూ ఆ కారాలు తినేరా... నీకు అలర్జీ ఎక్కువయ్యేది" అందమ్మ.

"కారం తిండానికీ, డస్ట్ అలర్జీకీ సంబంధం లేదు లేవే. వాడికిష్టమయింది వెయ్యి" అన్నాడు నాన్న.

"అయినా వీడికీ ఎలర్జీ ఎక్కడ్నుంచొచ్చిందండీ? ఇల్లూడుద్దామని చీపురు పట్టుకుంటే చాలు, వంద తుమ్ములు తుమ్ముతాడు వెధవ" అందమ్మ.

"అది మా తాతగారి కాంట్రిబ్యూషన్ లే" నవ్వాడు నాన్న.

"మంచోళ్లే. మీ నాన్నేమో మీకు షుగరూ. మీ తాతయ్యేమో మనవడికి అలర్జీ రాసిచ్చారన్నమాట" అమ్మ విసుక్కుంది.

"అబ్బా! మీ అమ్మ తలనెరుపు నీకు రాసివ్వలా" నాన్న దెప్పిపొడిచాడు.

"నాకీ ఐసైట్ ఎవరిచ్చారు నాన్నా?" అడిగింది మా రాణి.

"ఆ వాటా మీ మేనమామది. ఆయన వారసురాలివి నువ్వు" చెప్పాడు నాన్న.

"మా అన్నయ్యకేం సైటులేదు.. వూరికే తలనొప్పి" ఉడుక్కొంది అమ్మ.

"ఇదివరకైతే ఇట్లాంటి సంభాషణ ఎదురైనప్పుడు నేను పకపకా నవ్వేసేదాన్ని. నేనొక్కదాన్నే ఇంట్లో హెల్తీ పర్సన్‌నని మిగతా అందరూ పేషెంట్సేనని ఎగతాళి చేసేదాన్ని.

కానీ... ఇవాళెందుకో ఆ సంభాషణ నా మైండ్‌ని పేరలైజ్ చేసేసింది. నా గుండెల్లో ఇదీ అని చెప్పలేని సన్నటి మంట బయల్దేరింది.

"అమ్మాయికి ఇంకో రెండు ఇడ్లీలు వెయ్యవే" అంటున్న నాన్న గొంతులోని ఆప్యాయత, నేనిక వద్దని అడ్డుపెడుతుంటే "అందుకేనే రోజురోజుకీ అట్లా సన్నబడిపోతున్నావ్ తినవే నా తల్లీ" అంటూ బలవంతంగా నా ప్లేట్లో ఇడ్లీ వేసే అమ్మ అభిమానం ఇవన్నీ విలువలేని విషయాలేనా.

రేపటి సొసైటీకి కావాల్సిన అంశాలు కేవలం అందం... ఆరోగ్యం... ఇవేనా! ప్రేమా... అనురాగం అనే పదాల్ని ఫ్యూచర్

# సచిత్ర విచిత్రం



## ఆకట్టుకునే మార్జాల జాలం

ప్రాచీన రోమ్ దేశం నేటికీ గతకాలపు అపురూపమైన శిథిల శిల్పాలతో, కళాకృతులతో, ధ్వంసమవగా మిగిలిన భవనాలతో కనువిందు చేస్తూ ఉంటుంది. ఆ శిథిలాల్లో షుమారు వెయ్యి వరకూ అందమైన పిల్లులు స్థిర నివాసం ఏర్పరచుకున్నాయి. గంభీరంగా కొన్ని, తెల్లతెల్లగా, నల్లనల్లగా, తెలుపూ నలుపూ మేళవింపుతో... స్థబ్దుగా, మగతగా ఉండేవి కొన్నీ.... అల్లి బిల్లి తమాషాలు చేసేవి కొన్నీ... ఇలా ఎన్నో రకాల పిల్లులు కనువిందు చేస్తున్నాయి అక్కడ. ఎంతోమంది ప్రజలు ఆ పిల్లులను చూడ్డానికి ఆసక్తిగా అక్కడకు వస్తూ ఉండడంతో ఆ దేశపు చరిత్రలో ప్రఖ్యాతి చెందిన కళాఖండాలకు ఇస్తున్న ప్రముఖస్థానాలను ఆ మార్జాలాలకు సహితం ఇస్తోంది ఆ ప్రభుత్వం. ఇందువలన వీటికి గౌరవం లభిస్తోంది.

డిక్షనరీలోంచి తొలగించక తప్పదా! మన సంతా కకావికలమైపోయింది నాకు.

మాకేం లక్షలకు లక్షలు ఆస్తుల్లేవుగాని మరీ మధ్యతరగతి వాళ్ళం కాదు. అప్పర్ మిడిల్‌క్లాస్ ఫ్యామిలీ మాది. మా నాన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్. డబ్బుకు అంతగా తడుముకోవల్సిన అవసరం లేదు మాకు.

అందుకే మా నాన్న... వాళ్లు కట్నకానుకలు వద్దన్నా నా పేర్న ఓ మూడు లక్షల రూపాయలు డిపాజిట్ చెయ్యాలని నిర్ణయించుకున్నారు.

ఇక అమ్మయితే నగలు ఏ డిజైన్‌లో చేయించాలీ పట్టు చీరలు ఇక్కడే కొనాలా... కంచికెళ్ళి తేవాలా... లాంటి సమస్యలతో సతమతమవుతోంది.

బందర్‌నుంచి మా అమ్మమ్మను పిలిపించారు.

ఫలానారోజు నిశ్చితార్థం పెట్టుకుందామని నాన్న వాళ్ళకు ఫోన్‌చేసి చెప్పారట. వాళ్ళు సరేనన్నారట. అదింకో పదిరోజులుంది.

నాకు నవ్వొచ్చింది. నా పెళ్లికొడుకు అంత తేలిగ్గా ఈ పెళ్లికి ఒప్పుకోడు. ఇప్పటికే రెండుసార్లు ఫోన్ చేశాడు. మీ ఫ్యామిలీ హిస్టరీ కార్డేదీ? జెనెటిక్ కౌన్సిలింగ్‌కి ఎప్పుడు వెళదాం అంటూ నేను ఇదుగో అదుగో అంటూ దాటేస్తున్నా. అట్లా ఎందుకు నాన్చుతున్నానో నాకే తెలీదు.

బహుశా నా వాళ్ళకున్న ఎయిల్‌మెంట్స్ పరాయివాళ్ళముందు బయట పెట్టడం ఇష్టంలేకనే అయివుంటుంది.

"ఈ నిశ్చితార్థం జరగదు నాన్నా" అని ఎప్పటికప్పుడు చెప్పాలనే అనుకుంటున్నా. కానీ కారణం చెప్పాలంటే నోరు పెగలడం లేదు. అసలా కారణాన్ని ఎట్లా చెప్పాలో కూడా అర్థం కావడంలేదు.

అయినా కారణం చెప్పి వాళ్ళని బాధపెట్టాల్సిన అవసరం మామూలుగా అయితే వచ్చుండేదికాదు. ఇతను కాకపోతే ఇంకోరితో నా పెళ్ళి జరక్కపోదు. అతని పేరెంట్సెందుకో మరి... కట్నాలొద్దని... లాంఛనాలొద్దనీ మా వాళ్ళ దృష్టిని అట్లా ఆకట్టుకున్నారు. దాంతో వీళ్ళు పెళ్లి ఏర్పాట్లు చేసేసుకుంటున్నారు.

వాళ్ళబ్బాయి మెంటాలిటీ ఏంటో.... పెళ్ళికి అతని కండిషన్స్ ఏంటో వాళ్ళకి తెలీకుండానే వుంటుందా! తెలిసీ ఎందుకిట్లా మాకు ఆశపెడుతున్నారు.

కాబోయే అల్లుడుగారు డాక్టర్ అనీ... మా పాప అదృష్టవంతురాలనీ వీళ్లేమో నలుగురికీ చెప్పుకుంటూ మురిసిపోతున్నారు.

దీనికంతటికీ కారణం అతని పేరెంట్స్ పెళ్ళి మా అభిప్రాయమేంటో ఉత్తరం రాస్తామని చెప్పొచ్చుగా. అప్పుడు తనకీ హేంగోవర్ వుండేది కాదు.

పోనీ వాళ్లలా చెప్పటానికి ఏదైనా కారణముందా!

"నేను మాత్రం కాసుల పేరు చెడగొట్టే ప్రసక్తేలేదు. ఇది మా మాంగారు మా అత్తయ్యకు చేయించారు. ఆవిడ నాకిచ్చారు. నా నగలన్నీ మా అమ్మాయికి సగం... నా కోడలికి సగం పంచేశా. ఇది మాత్రం నేనట్టిపెట్టుకున్నా నా బంగారు తల్లి అంజూకి పెళ్ళికివ్వాలని" అంటోంది అమ్మమ్మ.

రాణి తలపట్టుకుని "అబ్బబ్బ... అమ్మమ్మా! మా కాలపు పిల్లలు కాసుల పేర్లూ కంటెలూ వేసుకోరే. అది చెడగొట్టి నైస్‌గా ఏ నెక్లెస్సో చేయిస్తే. అక్కకి పెట్టుకోడానికి పనికొస్తుంది" అంటోంది.

"చచ్చినా ఒప్పుకోను. ఇదిట్లాగే పీటల మీద అంజు మెడలో వేస్తాను. మహాలక్ష్మిలా వుంటుందది. ఏమ్మా అంజూ అమ్మమ్మిచ్చే గొలుసు వేసుకోవురా? " నన్ను పట్టుకుని నిలదీస్తోందామె.

నాకు పిచ్చెత్తిపోతోంది వీళ్ళ గోలకు. అందర్నీ వరసగా నిలబెట్టి ఆయనగారు బోధించిన... యూజెనిక్స్ టీచ్ చెయ్యాలనిపిస్తోంది.

ఈ మెస్ చాలదన్నట్టు మా మామయ్యొ

చ్చాడు విజయవాడ్నుంచి "పిల్లకి పెళ్లి కుదిరిందని రాశావ్. మాకెవరికీ చెప్పకుండానే! అంతర్జంటుగా ఏంటీ" అంటూ.

"అనుకోకుండా కుదిరిందిరా. మీ బావ ఆఫీసులో వాళ్లెవరో కుదిర్చారీ సంబంధం. మాకైతే దానికిప్పుడే పెళ్ళిచెయ్యాలని లేదు. అదే చెబితే... పెళ్లిచూపులవరకూ రానీండి సర్. కుర్రాడు డాక్టర్. మంచి కుటుంబం. మీరిష్టపడితేనేగా పెళ్లి అంటూ బలవంతం చేశారు. సర్లే మొదటగా వచ్చిన సంబంధం. కాదని ఎందుకనాల్లే అని పిల్లను వాళ్ళ ముందు కూర్చోబెట్టాం. వాళ్లకిది బాగా నచ్చేసి కానీ కట్నం లేకుండా చేసుకుంటామన్నారు" అంది అమ్మ సంబరంగా.

"బాప్‌రే! మా అంజూ మొగుడు డాక్టరా! అయితే ఇక మాకేరోగాలొచ్చినా కానీ ఖర్చుండదన్నమాట ఏదీ... ఎక్కడదీ" అంటూ నా రూమ్‌లో కొచ్చేశాడు మామయ్య.

వచ్చీరాగానే నా భుజం వూడిపోయేలా నా హేండ్ షేక్ చేసి "కంగ్రాచ్యులేషన్స్ అండ్ మై బ్లెస్సింగ్స్ రా అంజూ" అన్నాడు.

సన్నగా నవ్వి కళ్లు దించుకున్నాను.

"అదేంటీ... విజయవాడ్నుంచొచ్చి మరీ కంగ్రాట్స్ చెబుతుంటే కనీసం థేంక్సయినా చెప్పవ్. నువ్వంతా మీ అత్త పోలికేరా. అదీ అంతే. రోజూ నాచేత గొడ్డుచాకిరీ చేయించుకుంటుందా... ఒక్కనాడన్నా థేంక్స్ చెప్పదు" అన్నాడు.

నేను నవ్వాపుకుంటూ, "అవునా మామయ్యా" అన్నాను. మామయ్య నావే పొక్క చూపు చూసి ఆవేశంగా మొదలెట్టాడు. "అవునా అని మెల్లగా అంటున్నావా! దానికి తలనొప్పొస్తే జండూబామ్ రాసేది నేను. రోజూ పెరట్లో పూసిన గులాబీ పువ్వును తెంపుకొచ్చి దాని కొప్పులో పెట్టేది నేను. అది నిద్రపోతుంటే దుప్పటి కప్పేది నేను. ప్రతి ఆదివారం సినిమాకి తీసికెళ్లేది నేను..."

"పాపం! ఇంత గొడ్డుచాకిరీ చేస్తూ ఆ ఇంట్లో ఎట్లా బతుకుతున్నావ్ మామయ్యా. అర్జంట్‌గా విడాకులు తీసేసుకో" అంది అక్కడికొస్తూ మారాణి.

"ఇంత మంచి ఐడియా నాకు రానేలేదే కోడలా ఇన్నాళ్లూ. అంజూ పెళ్ళికి వస్తుందిగా మీ అత్తయ్య. నువ్వే మాట్లాడి ఆ ఏర్పాట్లేవో చూడు. చచ్చి నీ కడుపున పుడతా" అన్నాడు మామయ్య.

"ఓ.కే. మామయ్యా. నీ కష్టాలు తీర్చే బాధ్యత నాది. పద... భోజనానికి పిలుస్తోందమ్మ. అక్కా నిన్ను కూడా" అంది.

ఇక భోజనాల దగ్గరంతా నా పెళ్ళి గొడవే.

"అబ్బబ్బ... అసలింకా నిశ్చితార్థమే కాలేదు. అప్పుడే ఇన్ని వూహాగానాలేంటి" అన్నాను ఓ దశలో విసుగొచ్చి

అమ్మకు నా మాటలు నచ్చలేదు. "అదేంటే అట్లా అంటావ్ నామకార్థంగా నిశ్చితార్థం పెట్టుకుంటున్నాంగాని... పెళ్లి కుదిరిపోయినట్టేగా" అంది.

"అని మనం అనుకుంటే చాలా" అంటూ లేచి నా గదిలోకొచ్చేశాను.

అమ్మ ఇంకేం ప్రశ్నించకుండా తలుపులు కూడా మూసుకున్నా.

"ఏంటే లీలా... పిల్లకేమన్నా ఈ పెళ్ళిష్టం లేదా ఏం" అని అమ్మమ్మ అనడం కిటికీలోంచి వినబడి లేచి కిటికీ తలుపులు కూడా మూసేశాను.

ఇక లాభంలేదు చెప్పెయ్యాలి.

"నాన్నా... నీకు షుగరుంది. కాబట్టి అతను నన్ను చేసుకోడూ" అని చెప్పెయ్యాలి.

"అమ్మా... నీ తల నెరుపు నాకు రాకపోయినా నా పిల్లలకి రాదన్న గ్యారంటీ లేదు కాబట్టి అతను నన్ను చేసుకోడు అని చెప్పాలి. అదికాకున్నా రాణీకున్న సైటో, విక్కీగాడి అలర్జీనో ఏదో ఒకటి నా పిల్లలకు రావచ్చు. అట్లాంటి అనారోగ్యకరమైన

సంతానానికి జన్మనిచ్చి ఫ్యూచర్ సొసైటీని రోగగ్రస్తం చేసే హక్కు లేదు కాబట్టి అతను నన్ను చేసుకోడూ అని కుండబద్దలు కొట్టినట్టు చెప్పెయ్యాలి" నేనో నిర్ణయానికొచ్చేసి తలుపులు తీసుకుని బయటికొచ్చాను.

"అంజూ! నీకు ఫోనే. బావగారి దగ్గర్నుంచి" అంటూ ఎదురొచ్చింది రాణి.

బావగారుట బావగారు!, పళ్లు కొరుక్కుంటూ రిసీవ్ చేసుకున్నాను.

అవతలనుంచి అతను "హెలో" అన్నాడు.

నాకు రిటర్న్‌లో 'హెలో! బాగున్నారా' అని అతన్ని అడగబుద్ధి కాలేదు. అసలే ఆవేశంగా వున్నాను.

"ఏంటీ? " అన్నాను ఉక్రోషంగా.

"మీ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ ఎప్పుడు పంపిస్తున్నారు? " అన్నాడు.

నేను సమాధానం ఇవ్వలేదు. అప్రయత్నంగానే పళ్లు కొరుక్కున్నాను.

"మరోలా అనుకోకండి. మా పేరంట్స్ నిశ్చితార్థం అంటూ హడావుడి చేస్తున్నారు. అందుకనీ... ఆ విషయం త్వరగా సెటిలై పోతే మంచిదనీ" అన్నాడు.

దానికీ బదులు చెప్పలేదు నేను.

అతనికి నేను వింటున్నానో లేదోనన్న అనుమానం వచ్చినట్టుంది. "హెలో మిస్ అజంతా ఆర్ యూ హియరింగ్ మీ" అన్నాడు.

"ఆc... చెప్పండి" అన్నాను.

ఒక్కక్షణం నిశ్శబ్దం తర్వాత అతనన్నాడు స్వరాన్ని చాలా మార్దవంగా పెట్టి, "మీరెందుకో మొదటి చూపులోనే నాకు నచ్చారు. కాబట్టే ఇన్నిసార్లు మిమ్మల్ని అప్రోచ్ అవుతున్నా. బై గాడ్స్ గ్రేస్ మీది హెల్దీ పేరెంటేజ్ అయితే... నాకన్నా అదృష్టవంతుడు మరొకడుండడు"

ఆవేశాన్ని సాధ్యమైనంత వరకూ కంట్రోల్ చేసుకుంటూ ఖచ్చితంగా చెప్పాను. "చూడండి మిస్టర్ దిలీప్! నా ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ మీకివ్వదలుచుకోలేదు. ఎందుకంటే... మన పెళ్లి జరగదు కాబట్టి సో... మీది అదృష్టమో దురదృష్టమో మీరే తేల్చుకోండి"



కొగల కార్యం గంధర్వులే తీర్చారన్నట్టు నేన్నిజం చెప్పి నా వాళ్ళని బాధపెట్టాల్సిన అవసరం లేకుండానే ఆ ఫోన్‌కాల్‌తో ఇక నా పెళ్లి జరగదన్న విషయం ఇంట్లో అందరికీ తెల్సిపోయింది. అక్కడే తచ్చాడుతున్న రాణి వినేసింది దిలీప్‌తో నేనన్నమాటని. పజిల్ అయిపోతూ వచ్చి నన్నడిగింది.

"పెళ్లి జరగదంటున్నావేంటక్కా"

ముందే చిరాగ్గా వున్నానేమో... కోపం ముంచుకొస్తుంటే "అన్నాను. అయితే ఏంటి? " అన్నాను.

అది బిక్కముఖం వేసుకుని వెళ్ళిపోయింది. నాకు తెలుసు అది నేరుగా వెళ్ళి ఈ విషయాన్ని అమ్మ చెవిన వేస్తుందని. అనుకున్నంతా అయింది. అమ్మ హడావిడిగా నా దగ్గరకొచ్చేసి "ఏంటే అంజూ! రాణేంటో అంటోంది" అంది.

"క్లియర్‌గా చెప్పలేదా" అన్నాను రాణికేసి చూస్తూ.

అదేం మాట్లాడలేదు.

క్షణాల్లో ఇల్లంతా ఈ వార్తతో అట్టుడికిపోయింది.

అంజూ! డైరెక్ట్‌గా పెళ్ళికొడుకుతోనే పెళ్ళొద్దని చెప్పేసింది.

ఇంకేముంది కొంప మునిగిపోయింది. అమ్మ "నీకేం గ్రహచారమే. సిరొస్తా మోకాలడ్డడమంటే ఇదేనే" అంటూ ఏడ్చింది.

అమ్మమ్మ అలిగి "నా కాసుల పేరిటీవే లీలా! ఇవ్వాళే ఊరెళ్లిపోతా" అని కూర్చుంది.

మామయ్య నాకు నచ్చచెప్పడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు.

రాణీ, విక్కీ.... గొప్ప డిజప్పాయింట్‌కి గురైనట్టు ముఖాలు వేళ్లాడేశారు.

నాన్నయితే "వాళ్లకి నేనేం చెప్పాలి" అన్న సందిగ్ధంలో పడిపోయాడు.

ఇదంతా కాస్త బాధ కలిగించినా గొప్ప రిలీఫ్‌గా ఫీలయ్యాను నేను.

"బంగారంలాంటి కుర్రాడు వాడు. అట్లాంటివాడ్ని కాదంటానికి నీకు మనసెలా ఒప్పింది అజంతా. పోనీ కారణం చెప్పిచావ్వే" అంది అమ్మ కోపంగా.

కారణం చెబితే అమ్మ దృష్టిలో బంగారమైన ఆ కుర్రాడు ఇనుపముక్కగా మారడానికి క్షణం పట్టదు. అంతేకాదు... మా అనారోగ్యాలవల్లే మా అమ్మాయికీ పెళ్ళి తప్పిపోయిందన్నబాధ వాళ్ళని అంత తేలిగ్గా వదిలిపెట్టదు.

జీవితంలో ఇంకెప్పటికీ కలుసుకోబోని ఒక వ్యక్తికోసం నిజం చెప్పి నావాళ్ళని హర్ట్ చెయ్యాల్సిన అవసరం ఎంతమాత్రం లేదన్పించింది నాకు.

అందుకే మౌనంగా ఉండిపోయాను.

ఎంతమంది ఎన్నివిధాలుగా అడిగినా ప్రాధేయపడినా నిష్ఠూరపడినా ఒక్కటే సమాధానం ఇచ్చాను. "ఈ పెళ్లి నాకిష్టంలేదంతే" అని.

సాయంత్రమవుతున్నా ఒక్కళ్లూ నాతో మాట్లాడలేదు. అసలు నా ఉనికినే పట్టించుకోలేదు. వరండాలో కూర్చుని మామయ్యా, నాన్నా ఏదో సీరియస్ డిస్కషన్‌లో ఉన్నారు.

అమ్మా, అమ్మమ్మ కాసేపు కిచెన్లో, కాసేపు పెరట్లో, ఇంకాసేపు హాల్లో... అట్లా నుంచుని గుసగుసలు పోతున్నారు.

ఒసేవ్ సైటూ, అనీ పోరా అలర్జీ వెధవా అనీ ఒకళ్లనొకళ్లు తిట్టుకుంటూ అరక్షణమైనా ఒద్దిగ్గా వుండలేని రాణీ విక్కీలు కూడా ఓ మూలకు చేరి చెవులు కొరుక్కుంటున్నారు.

"వాళ్లకి నేనేదో సర్ది చెబుతాలే నువ్వు బెంబేలు పడకు" అంటున్నాడు మామయ్య నాన్నతో.

"ఆఖరిమాటగా 'దాన్నడిగి చూడమ్మా" అంటోంది అమ్మ వాళ్ళమ్మతో.

ఇన్ని ఫీలింగ్స్ మధ్య ఇమడడం ఇబ్బందిగా వుంది నాకు. ఊపిరి తిరగనట్టుగా అన్పిస్తోంది. 'బెటర్ టు గో అవుట్ ఫర్ ఎ వైల్' అనుకుని కాళ్ళకి చెప్పులేసుకున్నా.

నాన్న చూస్తూ కూడా ఎక్కడికని అడగలేదు. బయటపడ్డం నాన్ననైజం కాదుగాని ఆయన కోపం తారాస్థాయిలో ఉందని అట్లా అడక్కపోవడమే చెప్పింది నాకు. అయితే ఎక్కడ కంగారు పడతారోనని నాన్నకి వినబడేలా

"మామయ్యా శిల్పా ఇంటిదాకా వెళ్ళొస్తాను" అన్నాను.

శిల్పా అంటే నా ఫ్రెండని నాన్నకు తెల్సు.

అది నా కాలేజ్‌మేట్ క్లాస్‌మేట్ అనకుండా కాలేజ్‌మేట్ అంటానిక్కారణం మేమిద్దరం ఒకే కాలేజ్ అయినా గ్రూప్స్ వేరు.

నేను ఆర్ట్సు అది సైన్సూ. గ్రూప్స్ వేరైనా మా ఇద్దరి మధ్యా స్నేహం కలవడానిక్కారణం... లాంగ్వేజ్ క్లాసుల్లో కలవడమే. లవ్ ఎట్ ఫస్ట్ సైట్‌లాగా ఫ్రెండ్‌షిప్ ఎట్ ఫస్ట్ సైట్ మాది. ఇద్దరం

ప్రస్తుతం డిగ్రీ ఫైనల్ రాసి సెలవుల్లో వున్నాం. అది వాళ్ళ పెదనాన్నగారి ఊరికెళ్లింది. వచ్చిందో రాలేదో అనుకుంటూ వెళ్ళా. నేను వెళ్ళేసరికి అది వాళ్ళమ్మతో కలిసి గార్డెనింగ్ చేస్తోంది.

నన్ను చూడగానే "హాయ్... అజంతా చిత్రసుందరీ... కమ్ అండ్ జాయినజ్" అంది.

లక్ష్మి ఆంటీ "ఏమ్మా బాగున్నావా?" అంది.

"దానికేం పెళ్లిచూపులూ... డాక్టర్ మొగుడూ బ్రహ్మాండంగా వుంది దానిపని" అంది శిల్ప.

"నీకెట్లా తెల్సు? నువ్విక్కడ లేవుగా" అన్నానాశ్చర్యపోతూ.

"గాలి చెప్పిందమ్మా" అంది.

"గాలి కబురు నమ్ముతున్నావా?" అన్నా తేలిగ్గా.

"పెళ్లి కూడా దాదాపు ఫిక్సయినట్టేననీ... ఓ వారంలో నిశ్చితార్థమని కూడా విన్నాను" అందది.

"అదీ గాలి చెబితే విన్నావా?" అన్నాను ఇంకా తేలిగ్గా కొట్టిపారేస్తూ.

అబబ్బ ఇక్కడికొచ్చినా ఈ గొడవలేనా అన్పించింది నాకు.

"గాలి కాదమ్మా. మీ సహోదరీ... సహోదరులు చెప్తే విన్నా"

"వాళ్ళెక్కడ కనబడ్డారు నీకు?"

"నిన్న ఉదయం రైల్వేస్టేషన్నుండి వస్తుంటే ఎదురయ్యారు నాకు"

ఉదయమంటే ఓహో కంప్యూటర్ క్లాసులకెళ్తూ కనబడి ఉంటారు. రైల్వేస్టేషన్ రూట్‌లోనే వాళ్ళ ఇన్స్టిట్యూట్ వుండేది.

"ఏం చెప్పారు?" అన్నా.

అది నాకు సమాధానం ఇవ్వకుండా "మమ్మీ నువ్వెళ్ళి మా ఇద్దరికీ బూస్ట్ పంపించు. నీ ప్లేస్‌లోకి అంజూ వస్తుందిలే" అంది.

లక్ష్మి ఆంటీ చేతికంటిన మట్టిని కడుక్కుని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక "అవునూ? పెళ్లికొడుకు అచ్చు పవన్‌కల్యాణ్‌లాగున్నాట్ట గదా మీ రాణి చెప్పింది" అంది.

"విక్కీ ఏంచెప్పాడు?" అన్నాను.

"ఏంచెప్పలేదుగానీ రాణీతో మాత్రం 'నీకు సైట్ లేవే సరిగా కనబడదూ.... పెళ్లికొడుకు అచ్చు షారూఖ్ ఖాన్‌లా ఉన్నా'డంటూ వాదనకు దిగాడు. బైదిబై అసలెల్లా ఉన్నాడంటావ్?"

"జాన్ ట్రవోల్టాలా ఉన్నాడు" సీరియస్‌గా అన్నాను.

"అయితే అతను సాక్షాత్తూ అవతారపురుషుడే అయ్యుంటాడు. కాకుంటే ఇంతమంది కళ్లకు ఇన్ని రూపాల్లో కన్పించడం మానవ మాత్రులకు సాధ్యమా? ఫొటో ఉందా? కళ్లారా చూసి జన్మ ధన్యం చేసుకుంటా" అందది.

నాకు నవ్వాగలేదు. పకపకా నవ్వేశాను. నేన్నవ్వడం అయ్యాక "ఇంతకీ మన కళ్యాణ్‌ఖాన్ ట్రవోల్టాగారి నామధేయమేంటో?" అంది.

"నువ్వే నామకరణం చేశావుగా. ఇంక అదే సార్థకం చెయ్యి" అన్నాను.

ఇంతలో లక్ష్మి ఆంటీ పనమ్మాయితో బూస్ట్ పంపించింది. వెనకాలే ఆవిడా వచ్చింది.

"ఇంతకీ పెళ్లెప్పుడమ్మా?" అంది

"లేదాంటీ. క్యాన్సిల్ అయింది"

అంతవరకూ జోక్స్ కట్ చేస్తున్న శిల్ప సీరియస్ అయిపోతూ "నిజంగానే అంటున్నావా అంజూ?" అంది.

"ఛ... ఆంటీతో అబద్ధం చెబుతానా?" అన్నాను.

ఆంటీ కారణమడిగింది. "ఎందుకో ఆంటీ నాకతను నచ్చలేదు" అన్నాను.

ఆంటీ నిట్టూర్చింది. "ఏంటోలే... నిన్ను చేసుకునే వాడు ఎక్కడ పుట్టి పెరుగుతున్నాడో? మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అని ఊరికే అనలేదు. సరే మీరిద్దరూ ఆ గార్డె

నింగ్ ముగించుకుని రండి. నేనీలోపు టిఫిన్ తయారు చేస్తాను" అంటూ ఆమె వెళ్లిపోయింది.

"ఏమైందే? " అడిగింది శిల్ప.

ఒక్క నిముషం చెప్పాలా వద్దా అన్న మీమాంసలో పడ్డాను. చివరికి చెప్పాలనే నిర్ణయించుకుని జరిగినదంతా చెప్పేశాను.

అంతా విని అది "మోస్ట్ పెక్యూలియర్ కేస్" అంది.

"అల్ట్రామోడర్న్ కల్చర్ మాటున హ్యూమన్ వాల్యూస్ అణగారిపోతున్నాయని చెప్పడానికి ఎగ్జాంపుల్ అతను" కసిగా అన్నాను.

శిల్పేం మాట్లాడలేదు చాలా సేపటివరకూ.

ఆ తర్వాత ఇద్దరం గార్డెన్‌లో వీడింగ్ చేస్తూ లండన్ ఇంటర్నెట్‌లో మోడల్స్ బిజినెస్ గురించి, అవీఇవీ మాట్లాడుకున్నాం.

శిల్పాకు గార్డెనింగ్ అంటే చాలా ఇష్టం. ఎక్కడెక్కడి మొక్కలూ తెచ్చి ఇంటి ఆవరణలో పెంచుతుంది.

మందారాలూ, రాధామనోహరాలూ లాంటి కన్‌వెన్షనల్ ప్లాంట్సునుంచి బోన్సాయ్ టైపు హైబ్రిడ్ చెట్ల వరకూ ఉంటాయి దాని తోటలో.

వీడింగ్ పూర్తయ్యాక వాటరింగ్ మొదలెట్టాం.

ఆ గార్డెన్‌లో రెండుమూడు చోట్ల ఫిక్స్ చేసిన స్ప్రింక్లర్స్‌ని ఆన్ చేసింది శిల్ప. అవి నీళ్లని తోటంతా స్ప్రే చేస్తున్నాయి.

అస్తమిస్తున్న సూర్యకిరణాలు నీటిధారల మీద పడి రిఫ్లెక్ట్ కావడంతో అవి రంగురంగుల పూసల తోరణాల్లా ఉన్నాయి.

నీటి జల్లుల్లో తడిసిపోయిన మొక్కల మీద ట్విలైట్ పడి తోట తోటంతా బంగారు ద్రవంలో ముంచినట్టు ధగధగలాడుతోంది.

ఇద్దరం చేతులు కడుక్కుని వరండా మెట్ల మీద కూర్చున్నాం.

లక్ష్మి ఆంటీ టిఫిన్ రెడీ రమ్మంటూ పని పిల్లతో కబురు పంపింది.

"వెళ్తాంగానీ నువ్వా చెత్తంతా క్లీన్ చెయ్యి సరసూ" అంది పనిపిల్లతో శిల్ప.

మేమిద్దరం తోటలోంచి పీకేసిన కలుపు మొక్కల్నీ... చీడ పట్టిన ఆకుల్నీ కుప్పగా ఓచోట చేరుస్తోంది పనిపిల్ల సరసు.

ఇద్దరం లేచాం.

శిల్ప తోటవంక ఓసారి తృప్తిగా చూసుకుని అంది"ఆ చెత్త మొక్కలన్నీ పీకేశాక.. ఎంత బాగుందో చూడు తోట"

ఎందుకో తెలీదు చప్పున గుర్తొచ్చాడు దిలీప్.

రేపటి సొసైటీ కూడా ఈ గార్డెన్‌లా ఉండాలనే కదూ... అతనన్నాడు.

చీడ పట్టిన మొక్కల్లాంటి వాళ్లేగా వ్యాధిగ్రస్థులైన మనుషులు.

"ఏంటీ ఆలోచిస్తున్నావ్? పద టిఫిన్ చల్లారిపోతుంది" అంది శిల్ప.

ఇద్దరం వెళ్లి డైనింగ్ హాల్లో కూర్చున్నాం.

లక్ష్మి ఆంటీ వేడివేడి జీడిపప్పు ఉప్మా ప్లేట్లను మాముందుంచింది.

ఓ జీడిపప్పు పలుకు తీసుకుని నోట్లో వేసుకుంటూ అన్నాను శిల్పతో "శిల్పా! మనం చేసిన గార్డెనింగ్‌కీ... దిలీప్ చెప్పిన యూజెనిక్స్‌కీ... చాలా వరకూ సంబంధం ఉందనిపిస్తోంది."

"ఏంటీ ఉండేది నీ తలకాయ" అందది.

"అదికాదే...." అంటూ మొదలెట్టబోయిన నన్ను అడ్డుకుంటూ "మొక్కలకీ, మనుషులకీ తేడా లేదూ! ఫ్యూచర్ సొసైటీలో ఉండకూడనిది డిసీజ్‌డ్ పర్సన్స్ కాదు. ప్రేమించే హృదయం లేనివాళ్లూ... జాలీ, దయా లాంటి పదాల్ని మర్చిపోయిన వాళ్లూ.... వీళ్లూ ఉండకూడనిది. ఇలాంటి మెటీరియలిస్టిక్ మనుషులవల్లే.... కమింగ్ వరల్డ్ సిక్ యూనిట్‌గా మారబోతోంది. వి మస్ట్‌బి బివేర్ ఆఫ్ సచ్ పీపుల్. డిడ్‌యూ క్యాచ్ మై పాయింట్? " అంది.

సరిగ్గానే క్యాచ్ చేశాను. అది దిలీప్‌లాంటి

మనుషుల్ని కామెంట్ చేస్తోంది.

"యు మీన్ ఈజ్ దిలీప్ వీడీ పెర్సన్?" తెలిసీ అడిగాను.

"యా.... ఐమీనిట్. ఇట్లాంటి వాళ్లే రేపటి సమాజంలో కలుపు మొక్కలు. రిమూవ్ చెయ్యకపోతే ఈ జాడ్యం మరో నలుగురికి అంటుకునే ప్రమాదం ఉంది"

రిమూవ్ చెయ్యడం అంటే ఎట్లాగో నాక ర్థంకాలేదు. ఆమాటే అడిగితే అదంది "ఈరోజు రాత్రంతా ఆలోచించు. స్ట్రయిక్ కాలేదనుకో... ఉదయాన్నే ఫోన్ కొట్టు. ఓకే"

నేన్నవ్వి "ఓకే" అన్నాను.

★ ★ ★

ఇంటికి వెళ్లాక్కూడా నాతో ఎవరూ మాట్లాడలేదు. హంగర్ స్ట్రయిక్ చేస్తున్నార్ట వాళ్లంతా. రాణీ నాకు చెప్పే బదులు గోడకి చెప్పింది. ఆ ఇన్‌డైరెక్ట టాక్ అర్థమైపోయి నేనేం తక్కువ తిన్లేదన్నట్టు నేనూ హంగర్ స్ట్రయిక్ చేస్తున్నానని కిటికీతో చెప్పి వెళ్లి పడుకున్నాను.

నాకేం... శిల్పింట్లో... సుష్టుగా ఇందాకే జీడిపప్పు ఉప్మా తిన్నాను ఫుల్‌గా. సో నావరకూ నాకు నో ఆకలి మంటలు. వాళ్లే పాపం ఉదయానికల్లా డౌనయిపోతారు. అయితే అవనీలే. ఇప్పుడు నేవెళ్లి బతిమాలే ప్రోగ్రామ్ పెట్టానా... అందరూ మూకుమ్మడిగా నా నెత్తిమీద కథక్ చేస్తారు.

అప్పుడు చచ్చినట్టు నేనా మిస్టర్ డిసీజ్‌తో పెళ్లెందుకు వద్దన్నానో చెప్పాల్సి వస్తుంది. దాంతో వాళ్ల హృదయాలు భగ్గున మండడమో, మూగ బోవడమో జరుగుతుంది. అది నాకిష్టం లేదు. అన్నట్టు అతనికి నేనిచ్చిన నిక్‌నేమ్ బాగానే ఉందే.

మిస్టర్ డిసీజ్! ఫెంటాస్టిక్ నేమ్.

శిల్ప చెప్పినట్టు... ఆ రాత్రంతా అతన్ని రిమూవ్ చెయ్యడం ఎలాగో ఆలోచించాను.

అర్ధరాత్రి దాటుతుండగా ఛమక్‌మందో మెరుపులాంటి ఆలోచన నా మనసులో.

మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ బట్ నాటిన్ హాస్పిటల్ బాస్...

అనుకుంటూ నిద్రలోకి జారిపోయాను.

నేన్నిద్రలేచేసరికి డైనింగ్ టేబిల్ దగ్గర తొక్కిసలాట మొదలై ఉంది. రాత్రి చేసిన హంగర్ స్ట్రయిక్ దెబ్బ మరి. నన్ను చూడ గానే అమ్మ "టిఫిన్ తింటావా?" అంది సీరియస్‌గా.

"ఆ... బ్రష్ చేసుకొస్తా" అన్చెప్పి వెళ్లి స్నానం కూడా ముగించుకుని వచ్చి కూర్చున్నాను.

ప్లేట్లో అమ్మ వేడివేడి దోశెలు వడ్డించింది కారప్పొడితో.

తినబోతూ "అమ్మమ్మేదీ?" అనడిగాను ఎక్కడా ఆమె కనబడకపోయేసరికి.

"ఊరెళ్లిపోయింది. ఇక ఇక్కడేంపని ఆవిడకు. మనవరాలి పెళ్లికని ఓపిక చేసుకుని అంతదూరం నుంచి వచ్చినందుకు ఆవిడకు మంచి శాస్తే జరిగింది" అంది అమ్మ.

ఎందుకడిగాన్రా దేముడా అనుకుంటూనే మళ్లీ "మామయ్యేడీ?" అన్నాను.

"ఏంపనే నీకు వాళ్లందరితో? ఎవరి దార్న వాళ్లు పోయారు. ఏంచెయ్యాలంట మామయ్య ఇక్కడుండీ?" అంది ఇంకొంచెం గొంతు పెంచి.

గప్‌చిప్‌గా దోశలు తినేసి నా గదిలోకి వెళ్లబోతుంటే నాన్న పిలిచి "నీ నిర్ణయం మారదా అంజూ" అన్నాడు.

ఒక్కసారి నాన్న కళ్లలోకి చూసి తలదించుకుని "ఉహుం" అన్నాను తల అడ్డంగా ఊపుతూ.

"దానికి పెద్దాచిన్నా లేదండీ. మనకి సిగ్గు లేక అడగాల్సిందే" అమ్మ అంది.

"నాన్నా" అన్నాను మెల్లగా.

ఆయన ఆశగా చూశాడు నా వంక. ఒక వేళ మనసు మార్చుకున్నాననుకున్నాడో ఏమో!

"ఏంట్రా" అన్నాడు.

"నేను... నేను పి. జి చేస్తాన్నాన్నా"

"చెయ్యమ్మా! వూళ్లేలుదువుగాని" అందమ్మ.

"ఇంజనీర్‌గారి భార్యవైవుండీ ఇట్లా అంటా వేమ్మా" అనబోయి తమాయించుకున్నాను.

"నీ ఇష్టం" అన్నాడు నాన్న.

నేను "థేంక్స్ నాన్నా" అనేసి నా గదిలోకి వెళ్లబోతుంటే "అంజూ! ఒక్క నిముషం" అన్నాడు.

ఏంటన్నట్టు చూశాను.

"అతన్ని కాదంటానికి కారణమేంటో ఇప్పటికైనా చెప్పొచ్చుగా" అన్నాడు.

"సందర్భం వచ్చినప్పుడు తప్పక చెబుతా నాన్నా" అన్నాను.

ఇక ఆయన పొడిగించలేదు.

నావంక ఆశగా చూస్తున్న రాణీ, విక్కీ... నిరాశగా ముఖాలు వేళ్లాడేసి అక్కడ్నుంచి తప్పుకున్నారు.

"అట్లాంటి సంబంధం కుదరాలంటే పెట్టి పుట్టాలండీ. మన ముఖాన ఆ భగవంతుడు రాయలేదు మరి. ఏం చేస్తాం" అమ్మ సణుక్కుంటోంది.



నేనదేం పట్టించుకోకుండా హాల్లోకి వెళ్లి శిల్పా నెంబర్ డయల్ చేశాను.

"హెలో..." అన్నాను.

"హెలో... దిసీజ్ శిల్పా" అందది.

"గుడ్ మార్నింగ్ ఎల్లోరా శిల్పసుందరీ" అన్నాను.

అది కిసుక్కున నవ్వి "ఏంటీ... నే చెప్పిన వీడింగ్ గురించి ఆలోచించావా? గాట్ మైపాయింట్?" అంది.

"యాc... ఐ గాటిట్" అన్నాను.

"ఏంటో చెప్పు" అంది.

చెప్పాను.

"ఎగ్జాట్లీ కరెక్ట్‌గా కేచ్ చేశావ్" అందది సంతోషంగా.

అట్లా అన్నాక "థియరీ బాగుంది. ప్రాక్టికల్ సాధ్యమేనంటావా?" అంది.

"సాధిస్తాను... బైహుక్ ఆర్ క్రూక్" అన్నాను.

"ఇంతకీ మీ మిష్టర్ ఉండేది ఏ వూళ్లో అన్నావ్?"

చెప్పాను. చెప్పాక "నేను పిజి చేద్దామనుకుంటున్నా శిల్పా" అన్నాను.

దాని కర్థమైంది. "ఇన్నాళ్లూ ఎప్పుడెప్పుడు డిగ్రీ అయిపోతుందా... పెళ్లి చేసేసుకుందాం అనుకునే నువ్వు పి.జి. ఎందుకు చెయ్యబోతున్నావో నాకర్థమైంది లేవే. ఒకే సారి రీసెర్చ్ వర్క్ కూడా పూర్తి చెయ్యాలని కదూ?" అందది.

"అవునే" అని నవ్వి మళ్లీ అన్నాను. "నా ప్రొఫెసర్ నువ్వే. థీసిస్ నీకే సమర్పిస్తుంటాను"

"నీ పక్కనే వుంటాగా. బ్రహ్మాండంగా గైడ్ చేస్తాలే. నీకు పి. హెచ్.డి ఖచ్చితంగా వస్తుంది నో డౌట్" అందది.

నేను థేంక్స్ చెప్పి రిసీవర్ క్రెడిల్ చేశాను.

★ ★ ★

మేడమీద రెండు గదుల పోర్షన్‌లో దిగాం నేనూ శిల్పా. యూనివర్శిటీ హాస్టల్ అయితే మా అసైన్‌మెంట్ మేమనుకున్నంత సజావుగా సాగదు. అందుకే మేమిద్దరం ఓ ఇల్లు అద్దెకు తీసుకుని డే స్కాలర్స్‌గా యూనివర్శిటీకి వెళ్లాలని నిర్ణయించుకున్నాం. ఈ విషయంలో మా వాళ్లని ఒప్పించటానికి చాలా ప్రయత్నమే చెయ్యాల్సి వచ్చింది.

"ఇదేం చోద్యం. హాయిగా హాస్టల్లో వుండి చదువుకోక... ఆడపిల్లలు ఒంటరిగా ఇల్లు తీసుకుని వుండడమేంటి? నేనొప్పుకోనుగాక ఒప్పుకోను. ఇట్లా అయితే అసలు చదువే అక్కర్లేదు" అందమ్మ.

నాన్న కూడా "అదికాదురా! హాస్టల్లో వుండే ప్రొటెక్షన్ మీకు బయట దొరకదు. ఆలోచించు" అన్నాడు.

"నాన్నా...అన్నీ ఆలోచించుకునే ఈ నిర్ణయానికొచ్చాను. మేమేం ముక్కూ ముఖం తెలీనిచోట ఇల్లు తీసుకోబోవటంలేదు. శిల్పా వాళ్ల నాన్నగారి ఫ్రెండ్ ఆ యూనివర్శిటీ లోనే ప్రొఫెసర్‌గా చేస్తున్నార్ట. వాళ్ల మేడ మీద టూ రూమ్డ్ హౌస్ ఒకటి అన్ని ఫెసిలిటీస్‌తో వుందట. అక్కడా మేం ఉండబోయేది. నేనూ వున్నా కాబట్టి ఇద్దరం పైపోర్షన్‌లో సపరేట్‌గా వుండాలనుకుంటున్నాం. శిల్పా ఒక్కతే అయితే వాళ్లింట్లోనే ఏ పేయింగ్ గెస్ట్‌గానో వుండిపోయేది" అన్నాను.

నాన్న నేను చెప్పిందంతా ఆలకించాక "సరే చూద్దాం" అన్నారు.

ఆ తర్వాత స్వయంగా వచ్చి ప్రొఫెసర్ గార్ని కలిసి మాట్లాడి ఇల్లూ అదీ చూసి పూర్తిగా శాటిస్‌ఫై అయ్యాకనే నన్నిక్కడ శిల్పాతోపాటూ వదిలి వెళ్లిపోయాడు.

ప్రొఫెసర్ని శిల్పా అంకుల్ అని పిలుస్తుంది. ఇంగ్లీష్ ప్రొఫెసర్ ఆయన. పేరు విల్సన్ అని తెలిసి క్రిస్టియన్స్ అనుకున్నా. కాసేపటికి ఆయనభార్య పేరు జెరీనా అని విని ఇంటర్ రెలిజియస్ మేరేజేమో అనుకున్నా. ఇంకాసేపటికి ప్రొఫెసర్‌గారి మదర్

పేరు మహాలక్ష్మి అని తెలిసి కొంచెం కన్ ఫ్యూజ్ అయి శిల్పతో 'క్యామతలబ్' అంటే ఆమె హిందువనీ, ఆమె భర్త క్రిస్టియన్ అని చెప్పింది.

ప్రొఫెసర్‌గారి పెద్దమ్మాయి పేరు రెబెకా. రెండో అమ్మాయి పేరు నర్గీస్, కొడుకు పేరు శ్రీకాంత్.

శిల్పతో అన్నాన్నేను. "మొత్తంమీద ప్రొఫెసర్ సాబ్ ఇల్లు మినీ ఇండియా అన్న మాట"

"నో మినీ వరల్డ్" అందది.

నేను ప్రశ్నార్థకంగా చూస్తే "జెరినా ఆంటీ వాళ్ల నాన్న ముస్లిమ్... కానీ తల్లి ఆంగ్లో ఇండియన్" అని చెప్పిందది.

"ఫెంటాస్టిక్ ఫ్యామిలీ" అన్నాను.

నాకెందుకో ప్రొఫెసర్‌గారి కుటుంబం ఇరవై ఒకటో శతాబ్దపు మోడల్ ఫ్యామిలీ అన్పించింది.

మేమా మేడమీద ఇంట్లో దిగిన రోజు మా ఇద్దర్నీ భోజనానికి పిల్చారు వాళ్లు.

మా యూనివర్శిటీ ప్రొఫెసర్ ఇంట్లో మాకు భోజనం అనగానే నేను కాస్త ఫంక య్యాను గాని శిల్ప చెప్పింది "అంకుల్ సంగతి నీకు తెలీదు. చాలా క్లోజ్‌గా మూవ్ అవుతారు. ఒక్క పది నిముషాల్లో నువ్వా ఇంట్లో ఓ మెంబర్ వయ్యేలా చేస్తారు"

"అంటే ఆల్రెడీ నువ్వు వాళ్ల ఫ్యామిలీ మెంబర్‌వేనన్నమాట" అన్నాను శిల్పతో.

శిల్ప నవ్వి "లాస్టియర్ నాన్నతో వచ్చి వీళ్లింట్లో రెండ్రోజులున్నాను. అంతే... అయిపోయాను" అంది.

"ఏమైపోయావ్? "

"ఆయనకి ఫ్యాన్నయిపోయా"

"మిమ్మల్ని డేడీ కిందికి రమ్మంటున్నారు" అంటూ వచ్చింది ఆయన పెద్ద కూతురు రెబెకా.

"ఓకే రిక్కీ వచ్చేస్తున్నాం" అంది శిల్ప డ్రెస్ మార్చుకుంటానికి బెడ్‌రూమ్‌లోకి వెళ్తూ.

నేనాల్రెడీ డ్రెస్ చేసేసుకున్నాను కాబట్టి శిల్ప కోసం వెయిట్ చేస్తూ ఫ్రంట్ రూమ్ లోనే కూర్చున్నా. అదే మాకు స్టడీ రూమ్... లివింగ్‌రూమ్ అన్నీ.

రెబెకా వెళ్లలేదు. మమ్మల్ని వెంటబెట్టుకె ళ్లడానికామె గుమ్మంలోనే నిలబడి వుంది.

"రండి... కూర్చోండి రెబెకాగారూ" అన్నాను.

రెబెకా,-గలగల నవ్వుతూ "నేను చాలా చిన్నదాన్ని మీకంటే. జస్ట్ డిగ్రీ ఫస్టియర్. రిక్కీ అనండి చాలు" అంటూ వచ్చి నా ఎదురుగా వున్న చెయిర్లో కూర్చుంది. కూర్చున్నాక నాకేసి ఎడ్మైరింగ్‌గా చూస్తూ "యు ఆర్ సో క్యూట్" అంది.

నేను సన్నగా నవ్వాను.

"మీ డ్రెస్ చాలా బాగుంది. ఐ లవ్ గ్రే కలర్" అంది. దానికీ నవ్వాను.

"యువర్ స్మైలీజ్ బ్యూటిఫుల్" అంది.

మళ్లీ నవ్వుతూ కుర్చీలో ఇబ్బందిగా కదిలాను.

నోరు మూసుకుంటే ఈ పొగడ్త ఇలాగే కంటిన్యూ అవుతుందని భయమేసి "మీ హెయిర్ కట్ బాగుంది" అన్నాను.

"ఎవ్రీబడీ సేస్ దటోన్లీ" హేపీగా నవ్వేసి "ఇది ఇండియన్ పాప్‌సింగర్ మేఘనా హెయిర్ స్టైల్ అంది.

అంతటితో ఆపకుండా "ఐ లవ్ మేఘన. ఆమె ప్రైవేట్ ఆల్బమ్స్ అంటే పడిచస్తా న్నేను. షి ఈజ్ బై లాంగ్ ఆడ్స్ ద గ్రేటెస్ట్ ఆఫ్ లివింగ్ పాప్‌సింగర్స్" అంది.

"ఇక వెళ్దామా" అంటూ వచ్చింది శిల్ప.

రెబెకా శిల్పని చూడగానే స్టన్నింగ్ ఎక్స్ ప్రెషన్ ఇచ్చి "వావ్...యు ఆర్ జెస్ట్ లైక్ నమ్రతా బారువా" అంది.

'గోద్రెజ్ బీరువా కాదూ' అనుకున్నా న్నేను.

"ఆవిడెవరు" అంది శిల్ప.

"ఆమె తెలీదా! వెరీ ఫేమస్ మోడల్ తను" అంది ఆవిడేదో ఈవిడ బెస్ట్ ఫ్రెండ

న్నంత ఇదిగా.

"పద శిల్పా" అన్నాను.

మెట్లు దిగుతుంటే నర్గీస్ ఎదురైంది.

"మమ్మీ రమ్మంటోంది" అంటూ

ఆ అమ్మాయి చాలా బాగుంది. అప్పటి సినిమా హీరోయిన్ నర్గీస్‌లాగే వుందనిపించింది.

శిల్పకి మాత్రమే వినబడేలా అన్నాను, "ఆ అమ్మాయికి పాత హిందీ సినిమా హీరోయిన్ నర్గీస్ పోలికలున్నాయ్ కదూ"

"పోలికలేంటి. సరిగ్గాచూడు, ఆ పిల్ల నర్గీస్‌కి జిరాక్స్ కాపీ" అంది శిల్ప.

శిల్ప మాటలు రెబెకా చెవిన బడినట్లున్నాయి. వెంటనే రియాక్టయిపోయింది. "దాని అసలు పేరు సాదియా. దాన్ని ఎల్ కె.జిలో జాయిన్ చేసినపుడు స్కూల్లో దాన్నందరూ నర్గీస్, నర్గీస్ అని పిలిచేవాళ్లు. దాంతో మా మమ్మీ దాని పేరట్లా మార్చేసి నర్గీస్ అని రాయించేసింది"

మేం కిందకెళ్లేసరికి... లివింగ్ రూమ్‌లో కూర్చుని మాకోసమే వెయిట్ చేస్తున్నారు ప్రొఫెసర్‌గారు.

"గుడ్ డే అంకుల్" అంది శిల్ప.

నేను మాత్రం... 'నమస్తే సర్' అన్నాను రెండుచేతులూ జోడించి.

ప్రతి నమస్కారం మాట దేవుడెరుగు కనీసం తలన్నా పంకించలేదాయన. నావైపు అదోలా చూస్తూ

"యు ఆర్ ఎట్ సిక్సెస్ అండ్ సెవెన్స్" అన్నాడు.

ఆయన అనేదేమిటో నాకర్థంకాక కన్‌ఫ్యూజింగా చూస్తుంటే " ఐమీన్... నామాటల కర్థం నువ్వు కన్‌ఫ్యూజన్‌లో వున్నావని" అన్నాడు.

'అవును మహానుభావా' అని మనసులో అనుకుని "సర్" అన్నాను మళ్ళీ అయోమయంగా.

"శిల్ప నన్నేమని పిల్చింది? " అడిగాడాయన.

నేను శిల్పకేసి చూస్తుంటే "అంకుల్ అని కదూ" అన్నాడాయనే.

"నువ్వు, ఆ అమ్మాయీ సమ వయస్కులు. అట్లాంటప్పుడు నువ్వేదో అయిపోయి నన్ను సర్ అని పిలుస్తూ మన రిలేషన్ని డిజార్డర్‌లోకి నెడతావెందుకు? యు ఆర్ లైక్ శిల్పా ఓన్లీ టు మి" అన్నాడాయన.

అదా విషయం, హమ్మయ్య అనుకుని హాయిగా నవ్వేశాను. "ఫీల్ ఫ్రీ. నేను ప్రొఫెసర్నే కానీ... నాది మీ సబ్జెక్ట్ కాదు. సో అబ్‌సొల్యూట్లీ ఐయామ్ యువరంకుల్" అన్నాడు.

కిచెన్‌లోంచి వస్తూ జెరీనా ఆంటీ మమ్మల్ని చూసి పలకరింపుగా నవ్వింది.

లేత ఆరెంజ్ కలర్, మైసూర్ క్రేప్ శారీలో ఆమె శరీరం ట్వంటీటూ కేరెట్ గోల్డ్‌లా మెరిసిపోతోంది.

ఆమెను చూడగానే అనుకున్నాను. వాళ్ళమ్మాయి నర్గీస్ అంతా తల్లిపోలికేనని.

"కూర్చోండి... మీ అంకుల్ నిలబెట్టే మాట్లాడేస్తున్నార్లా వుంది" అంది నవ్వుతూ.

మేం కూర్చున్నాక తను కూర్చుంది. రెబెకా తల్లి పక్కన కూర్చుంటే నర్గీస్ తండ్రి పక్కన సెటిలైంది.

"శ్రీ ఏడాంటీ? " అంది శిల్ప.

"ట్యూషన్‌కెళ్ళాడు శిల్పా! టెన్త్‌కదూ... నో లీజరెటాల్" అందాంటీ.

కాసేపు ఫ్యామిలీ అఫైర్స్ మాట్లాడుకున్నాక రెబెకా, నర్గీస్ ఇల్లంతా తిప్పి చూపించారు.

ఆ ఇంటి మొత్తంలోకీ నాకు నచ్చింది పూజగది. ఆ గదిలో... అన్ని మతాలకు చెందిన దేవుళ్లూ వున్నారు.

"ఇట్స్ మార్వలెస్" అన్నాను రెబెకా కేసి అడ్మయిరింగా చూస్తూ.

ఆ అమ్మాయి గర్వంగా నవ్వి "వి బిలీవ్ ఇన్ ద డివైనిటీ బట్ నాట్ ఇన్ గాడ్స్... ఏ దేవుడైనా చెప్పేదొకటేగా... ఎబౌట్ గుడ్‌నెస్" అంది.

తరువాత అందరం వచ్చి లివింగ్ రూంలో కూర్చున్నాం.

"ఇక భోంచేద్దామా" అన్నదాంటీ.

"శ్రీని కూడా రానివ్వండి ఆంటీ" అన్నాను. శిల్ప చెప్పినట్టూ నాకా ఇంట్లో బెరుకన్పించలేదు.

ఆయన టైం చూసుకుని "శ్రీ రావడానికి ఇంకో అరగంట టైముంది. మీన్‌వైల్... మనమేదైనా కరెంట్ టాపిక్‌నోదాన్ని డిస్కస్ చేద్దామా" అన్నాడు.

"ఫ్యాషన్స్" అంది రెబెకా వెంటనే.

"ఇటీజాల్ గ్రీక్ టుమీ" అన్నాడాయన పెదవి విరుస్తూ.

"గార్డెనింగ్" అంది శిల్ప.

"దటీజాల్ హిబ్రూ టుమీ" అన్నాడాయన దానికీ పెదవి విరుస్తూ.

"కేటరింగ్" అంది ఆంటీ.

"అది డైనింగ్ టేబుల్ కాన్‌వర్సేషన్" అన్నాడాయన.

"సైన్స్ అండ్ టెక్నాలజీ" అంది నర్గీస్ గొప్పగా.

"వద్దు" చప్పున అనేశాన్నేను సైన్స్‌మీద నాకుండే అనాసక్తివల్ల.

"ఐ హేవ్ ఎ బోన్ టు పిక్ విత్ యు' ' నవ్వుతూ నాకేసి చూశాడాయన.

ఈ మహానుభావుడి ఇంగ్లీష్‌తో చస్తున్నాన్నేను. ఆయన ఉపయోగించే ఇడియమ్స్ కొన్ని అర్థమౌతున్నాయి. కొన్ని అర్థం కావటంలేదు నాకు.

"అర్థం కాలేదా అంజూ" అన్నాడు. నేనాశ్చర్యపోయాను. ఇంతలోపే అంత చనువుగా అంజూ అంటున్న ఆయన్ని చూసి.

"దటీజ్ హిజ్ స్టైల్" అంది శిల్ప ఆయన 'అంజూ' అనగానే మారిన నా ఫీలింగ్స్ చూస్తూ.

"వెల్ బేబీ! ఐ హేవ్ ఎ బోన్ టు పిక్ విత్ యు అంటే... నీతో పోట్లాడ్డానికి నాకో కాజ్ దొరికిందీ అని" అన్నాడాయన.

"పోట్లాటా! ఎందుకు? " అన్నాను అయోమయంగా.

"సైన్స్ అండ్ టెక్నాలజీ చాలా మంచి టాపిక్. ఎందుకూ వద్దంటున్నావ్? " అన్నాడాయన.

"అదా!" తేలిగ్గా నవ్వాను. "పర్సనల్‌గా నాకదంటే ఇష్టంలేదు"

"వై? " భృకుటి ముడిచాడాయన.

"ప్రత్యేకమైన కారణం లేదు. అదంటే బోర్. దట్సాల్" అన్నాను.

"పోనీ నువ్వేదైనా టాపిక్ సజెస్ట్ చెయ్" అన్నాడు.

ఓ క్షణం ఓపిగ్గా ఆలోచించి చెప్పాను. "హ్యూమన్ వేల్యూస్"

ఆయన ఇన్‌స్పైర్ అయినట్టు నాకేసి చూశారు.

"ప్రస్తుతం అది మానవులంతా మర్చిపోతున్న అంశం అంకుల్. ఎ ఫర్‌బిడెన్ టాపిక్" అన్నాన్నేను.

"యు ఆర్ వెరీ ఇంట్రెస్టింగ్" అన్నాడాయన నావైపే సూటిగా చూస్తూ.

"ఇరవై ఒకటో సెంచరీ కంప్యూటర్స్‌లో, ఇంటర్నెట్ కనెక్షన్స్‌లో, జెట్ ప్లేన్స్‌లో రిచ్ కావచ్చు బట్ ఇటీజ్ ప్రెట్టీపూర్ ఇన్ హేవింగ్ హ్యూమన్ వేల్యూస్" అన్నాను.

"యు ఆర్ సో డీప్" అన్నాడాయన నా కళ్లలోకి మరింత సూటిగా చూస్తూ.

నేనేదో అనబోతున్నంతలో నర్గీస్ "అడుగో శ్రీ వచ్చేశాడు" అంది.

విల్సనంకుల్ లేస్తూ అన్నాడు, "నువ్ సజెస్ట్ చేసిన టాపిక్ కాసేపు మాట్లాడి వదిలేసేంత ఆషామాషీ టైప్ కాదు. సో... లెటజ్ డైన్ ఫస్ట్. తర్వాత డాబామీద వెన్నెల్లో కూర్చుని డిస్కస్ చేసుకుందాం"

★ ★ ★

డిషెస్ అన్నీ అద్భుతంగా వున్నాయి.

జెరీనా ఆంటీ కేటరింగ్ గురించి డిస్కస్ చేద్దామనటానికి కారణం అవి తింటుంటే అర్థమైంది నాకు.

"వెరీ డెలిషియస్" మెచ్చుకున్నాను బ్రెడ్ పుడ్డింగ్ టేస్ట్ చేస్తూ.

డిన్నర్ అయ్యాక అందరం టెర్రస్ మీదకెళ్ళాం. శ్రీకాంత్ మాత్రం హోమ్‌వర్క్ చాలా హెవీగా వుందంటూ ఆగిపోయాడు.

వెండిజల్లులా కురుస్తోంది వెన్నెల. పేరాపిట్ వాల్‌లోకి ఇన్‌సర్ట్ చేయబడిన ఫ్లవర్ పాట్స్‌లో విరబూసిన గ్లాడియోలాలకు అమెజాన్ లిల్లీలకూ సిల్వర్ ఫ్రింజ్ వేస్తోందా వెన్నెల.

అక్కడ మూడు చెయిర్స్ ఉన్నాయ్. నర్గీస్, రెబెకా ఫస్ట్ ఫ్లోర్‌లోని మా పోర్షన్‌లోకెళ్ళి, మరో మూడు చెయిర్స్ పట్టుకొచ్చారు.

అందరం కూర్చున్నాక విల్సనంకుల్ "ఓ.కే. బేబీస్ హ్యూమానిటీకి మీమీ డెఫినిషన్స్ ఇవ్వండి" అన్నాడు.

వెంటనే రెబెకా "ఎదుటి మనిషి కష్టాన్ని చూసినపుడు సాటి మనిషిలో కలిగే స్పందన హ్యూమానిటీ" అంది.

నర్గీస్ "మన ఫెలోమెన్‌కి మనం సహాయ సహకారాలందించడం" అంది.

శిల్ప "ఇతరుల పట్ల సానుభూతి చూపించడం" అంది.

జెరీనా ఆంటీ "మనకున్న దాన్లో ఇతరులకు దానం చేయడం" అంది.

నేనొక్కక్షణం ఆలోచించి చెప్పాను.

"మనిషి మనిషిలాగా జీవించడం"

"యు... మీన్ జంతువులాగా జీవించకపోవడం.. యామై రైట్" అన్నాడాయన.

"ఐ మీన్ దట్టోన్లీ" అన్నాను.

"మనిషి మనిషిగా జీవించాలీ అంటే... కొన్ని వేల్యూస్‌ని పాటించి తీరాలి. అవి అవగాహన, అభిమానం, ప్రేమా, దయా... అంతే కదమ్మా అంజూ!" అడిగాడాయన.

"ఎగ్జాట్లీ అంకుల్... ఎట్ ప్రెజెంట్... మనుషులు వాటిని మర్చిపోతున్నారు. మరీ మెటీరియలిస్టిక్‌గా బతుకుతున్నారు. మనిషికీ మనిషికీ మధ్యనున్న సున్నితమైన సంబంధాలు... క్రమంగా సన్నగిల్లిపోతున్నాయ్. ఎవరి జీవితం వాళ్లది. ఎవరి స్వార్థం వాళ్ళది. ఇదీ ఇప్పటి ట్రెండ్" అన్నాను.

"వెల్ సెడ్ బేబీ... మరి ఆ ట్రెండ్‌కి కారణాలు అన్వేషించావా? " అన్నాడాయన.

"జస్ట్... బిజీలైఫ్. ఇదే అసలు కారణం. ఈ ఉరుకుల పరుగుల కాలం మనిషిని ఓ మెషీన్‌గా మారుస్తోంది. మెషీన్ వర్క్‌చేస్తుందిగాని ఆలోచించలేదుగా!"

"యువర్ రీజనింగ్ ఈజ్ అప్ టు ద మార్క్" ఆయన మెచ్చుకుని మళ్ళీ అన్నాడు. "మరి ఈ సమస్యకు పరిష్కారం కూడా నువ్వే చెప్పు"

"మనిషి క్షణం తీరిక లేకుండా వర్క్ చేసేది ఎక్కువ సంపాదించటానికి. ఎక్కువ సంపాదించేది మరీ లగ్జూరియస్‌గా జీవించటానికి. ఈ లగ్జరీస్‌ని మినిమైజ్ చేసుకుంటే... ఆటోమేటిగ్గా సంపాదన తగ్గించుకోవచ్చు సంపాదన తగ్గించుకోవడం అంటే... రెస్ట్‌లెస్ వర్క్‌నుంచి కొంచెంసేపైనా ఎస్కేప్ అవడమే. అప్పుడు దొరికిన గేప్‌లో ఐ మీన్ తీరికలో మనిషి మనసు హ్యూమన్ వేల్యూస్‌ని కొంచెంసేపైనా మననం చేసుకోగలుగుతుందని... నా అంచనా అంకుల్"

"నీ మాటలు వింటుంటే... నాకో అమెరికన్ రైటర్ గుర్తొస్తున్నాడు. అతని పేరు..." అంటూ విల్సనంకుల్ ఓ క్షణం ఆగి... జ్ఞాపకం చేసుకుని చెప్పాడు. "యస్... హి ఈజ్ హెన్రీ డేవిడ్ థోర్యూ. అతనో నేచురాలిస్ట్ అండ్ ఫిలాసఫర్. వర్క్ గురించి అతనంటాడూ... ఒక మనిషి కేవలం వారంలో ఒక్కరోజు మాత్రమే వర్క్ చెయ్యాలి. మిగిలిన రోజులన్నీ ప్రకృతిలోని అద్భుతాల్ని ఎంజాయ్‌చెయ్యటానికి వాడుకోవాలీ అని"

"వెరీ నైస్ మేన్" అంది రెబెకా ఉత్సాహంగా.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: **3000/-** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై "చతుర సమీక్ష"కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**అక్టోబర్ చతుర నవల ఫ్యామిలీ హిస్టరీ కార్డ్**

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

"ఎంజాయ్ చెయ్యడమంటే... మ్యూజిక్ సిస్టమ్‌లో రికీ మార్టిన్ పాటలు వింటూనో... ఏ సరికొత్త సి.డి. చూస్తూనో గడపమని కాదు" అంది నర్గీస్ సీరియస్‌గా.

"అవునా డేడ్" అంది రెబెకా గాలి తీసిన బెలూన్లా అయిపోతూ.

"నర్గీస్ ఈజ్ రైట్. ఆయన సంపదల్ని ఇష్టపడడు. మనిషిలోని బ్లైండ్ లవ్ ఆఫ్ వెల్త్‌ని అసహ్యించుకుంటాడు. ప్రకృతిలో ప్రకృతిలా జీవించమంటాడు. తన ఫ్రెండ్‌న డిగి ఒక గొడ్డలి అరువు తీసుకుని వాల్డెన్ పాండ్ అనే సరోవర తీరానికి వెళ్ళి... పర్ణ శాల నిర్మించుకుని అతి నిరాడంబరంగా జీవించిన వ్యక్తి ఆయన.

విల్సన్ అంకుల్ చెప్పింది చాలా నచ్చింది నాకు. ఆయనకేసి ఉత్సాహంగా చూస్తూ, "అంకుల్! ఇప్పటి మానవుడు ఆ హెన్రీ డేవిడ్ అంతటి సింపుల్ లైఫ్ గడపలేకపో యినా... వర్క్‌కీ, ఎంటర్‌టైన్‌మెంట్‌కీ తను స్పెండ్ చేసే టైమ్‌లో కనీసం ఒక్క గంట మానవతా విలువల్ని అర్థంచేసుకోవడానికి వెచ్చిస్తే ఫ్యూచర్ సొసైటీ చాలా హెల్దీగా వుంటుంది"

నేనట్లా అనగానే శిల్ప కల్పించుకుని "యు ఆర్ రైట్ అంజూ! ఇక సైంటిస్ట్ జీవితకాల మంతా వెచ్చించి కనిపెట్టే ఓ ఔషధం కన్నా... ఒక చిత్రకారుడు అహర్నిశలూ శ్రమించి గీసే ఒక అద్భుత చిత్రం కన్నా ఒక రచయిత అహోరాత్రులూ ఆలోచించి సృష్టించే ఒక అసామాన్య రచనకన్నా సాటి మనిషికోసం ఒక మనిషి హృదయం ద్రవించి స్రవించే ఒక అశ్రువు అమూల్యమైంది. వెలకట్టలేనిది" అంది.

"అమూల్యమైందన్నా... వెలకట్టలేనిదన్నా...ఒకటేగా" అల్లరిగా నవ్వింది నర్గీస్.

అట్లా సాగిన మా సంభాషణ రాత్రి పదకొండు వరకూ కొనసాగింది.

మధ్యలోనే రెబెకా... నర్గీస్ వెళ్ళిపోయారు నిద్రొస్తోందంటూ.

పదకొండయ్యాక అందరం కిందకి దిగాం.



ఇవాల్టినుండీ క్లాసులు ప్రారంభం. గుండెల్లో దడదడగా వుంది. ఇంతవరకూ ర్యాగింగ్ గురించి వినడమేగాని అనుభవించి చూసింది లేదు.

శిల్ప మాత్రం ధైర్యంగానే ఉంది. "ఏంచేస్తారు! కొంచెంసేపు ఏడ్పించి వదిలేస్తారు. అంతేగా" అంటోంది.

"అట్లాకాదే... అప్పుడప్పుడూ ర్యాగింగ్ తట్టుకోలేక వాళ్లు చనిపోయారు, వీళ్లు చనిపోయారు అంటూ న్యూస్ వస్తుంటుంది కదా" అన్నాను ఏడుపుగొంతుతో.

అసలు నేను డిగ్రీతో చదువాపేసి...ఏదైనా ఒకేషనల్ కోర్స్ చేద్దామనుకున్నా. కానీ... దిలీప్ రిఫార్మేషన్ కార్యక్రమం ఒకటి పెట్టుకుని ఈవూళ్లో ఉండడం కోసం పి.జి కోర్సులో చేరాను.

ఇద్దరం రెడీ అయి కిందకి దిగుతుంటే... అప్పుడే విల్సనంకుల్ బైక్ తీస్తూ కన్పించాడు.

"గుడ్‌మార్నింగ్ అంకుల్" అన్నాం ఇద్దరం.

"వెరీ గుడ్‌మార్నింగ్, యూనివర్సిటీకేగా" అన్నాడు.

అవునన్నట్టు తలూపాం.

"లిఫ్ట్ కావాలా? " అన్నాడు.

"మేం సిటీ బస్‌లో వస్తామంకుల్!" చెప్పింది శిల్ప.

"ఓ సన్నీ కొనుక్కోండమ్మా" అన్నాడా యన.

"ఇంటిదగ్గరుందంకుల్! తెప్పించు కుంటాం" చెప్పాన్నేను.

ఆయన వెళ్లిపోయారు.

ఇద్దరం మా స్ట్రీట్ దాటి.... మెయిన్ రోడ్ క్రాస్ చేసి బస్టాప్‌లో నిలబడ్డాం. మేం నిలబడ్డ పది నిముషాలకు యూనివర్శిటీ వైపెళ్లే బస్ వచ్చింది.

మేం బస్ దిగి యూనివర్శిటీ క్యాంపస్‌లో అడుగు పెడుతుంటే 'హాచ్' మంటూ తుమ్మా రెవరో.

"ర్యాగింగ్‌కి రిబ్బన్ కటింగ్ అన్నమాట ఇది" అంది శిల్ప సన్నగా. కేంపస్ లోపల అక్కడక్కడా చెట్లకిందా వరసగా పార్కు చేసి ఉన్న బైక్స్ మీదా.... సైకిళ్లమీదా కూర్చుని మమ్మల్ని చూస్తూ ఏవేవో కామెంట్స్ చేస్తున్నారు కొందరు. వాళ్లంతా సీనియర్స్ అని వాళ్ల వాలకం చూస్తుంటేనే అర్థమౌతుంది.

మాలాగా ఆరోజే యూనివర్సిటీలో అడు గు పెట్టిన స్టూడెంట్స్ భయం భయంగా బిక్కుబిక్కుమంటూ నడుస్తున్నారు.

"వీళ్లు మన జోలికొచ్చేట్టు లేరులేవే. దూరంగా ఉండి కామెంట్స్ విసురుతు న్నారు" అన్నాన్నేను.

"అంజూ! అటుచూడు" అంది శిల్ప.

ఓ జూనియర్ అండర్‌వేర్‌తో నిలబడి ఉన్నాడు. అతని చుట్టూ ఉన్న సీనియర్స్‌లో అబ్బాయిలే కాదు, అమ్మాయిలు కూడా ఉన్నారు. క్లాప్స్ కొడుతూ గందరగోళంగా అరుస్తున్నారు. అందరిమధ్యా ఆ అబ్బాయి సిగ్గుతో చచ్చిపోతున్నట్టు తలదించుకునే ఉన్నాడు.

నాకు భయం ఎక్కువయింది. ఇద్దరం గబగబా నడుస్తున్నాం.

"హాయ్!" అన్నారెవరో.

వద్దనుకుంటూనే తలెత్తి చూశాను.

బ్లాక్ ట్రాన్స్‌పరెంట్ కుర్తాలో రెండు చెవులకూ రింగులు పెట్టుకుని నాకేసి చూస్తూ నిలబడి ఉన్నాడొకడు.

నేనతన్ని చూడ్డం గమనించి కనుబొ మ్మల్ని స్టైలిష్‌గా ఎగరేస్తూ "స్టాప్‌దేర్" అన్నాడు క్రిస్టల్ బ్రేస్‌లెట్ ధరించి ఉన్న కుడిచేతిని ముందుకు చాపి. అతనుకాక ఇంకో పదిమందిదాకా ఉన్నారక్కడ. వీడు వాళ్లందరికీ లీడర్‌లా ఉన్నాడు.

'భగవంతుడా! వీళ్ల బారినుండి మమ్మల్ని కాపాడావంటే వచ్చే శుక్రవారం నీ గుడికొచ్చి నూటొక్క కొబ్బరికాయలు కొడతాను' అను కున్నాను.

"పేరు? " డిమాండింగా అడిగాడు.

చెప్పాను.

"ఊరు? "

చెప్పాను.

"వయసు? " అన్నాడు.

చెప్పక తప్పలేదు.

"కరెక్టేగా! ఆఫీస్‌లో నీ డేటాఫ్‌బర్త్ చెక్ చేస్తా. తేడా వచ్చిందో..." అంటూ వాడాపి. ఇంకోడివైపు చూశాడు.

ఒక్క చెవికి మాత్రమే స్టడ్ పెట్టుకుని బ్లూ జీన్స్‌లో కట్‌షార్ట్ చేసిన క్రాపులో వున్న ఆ సీనియర్ ఓ అడుగు నావైపు వేసి "నీ బర్త్‌డే సెలబ్రేట్ చేసి మేమంతా పార్టీ చేసుకుంటాం" అన్నాడు.

విని క్వాయిట్‌గా వూరుకున్నా.

"అర్థం కాలేదా మోహన్‌భాసియా, అదిగో వాడికి చేస్తున్నారే..., అట్లాంటి సెలబ్రేషన్" అన్నాడు అల్లంత దూరాన అండర్‌వేర్‌తో వున్న జూనియర్ని చూపిస్తూ.

సిగ్గుతో చితికిపోవడం అంటే ఏమిటో అనుభవంలోకొచ్చింది నాకు.

"కరక్ట్‌గానే చెప్పాను" అన్నాను తల ఏమాత్రం ఎత్తకుండా.

"దట్స్ గుడ్" అన్నాడు వాడు.

"మనసు? " అన్నాడు క్రిస్టల్ బ్రేస్‌లెట్ గాడు.

ఈ ప్రశ్నేమిటో నాకర్థంకాలేదు.

"ఐ మీన్... దగ్గరే వుందా... ఎవడికైనా ఆల్రెడీ ఇచ్చేశావా? "

నాకు భయం, సిగ్గు స్థానంలో ఉక్రోషం ముంచుకొచ్చింది. "అది అబ్‌సొల్యూట్లీ పర్సనల్, చెప్పను" అన్నాను.

"రేయ్ మణీ ఇట్రారా" అన్నాడు బ్రాస్‌లెట్‌గాడు కంట్రీ లాంగ్వేజ్‌ని ఇమిటేట్ చేస్తూ.

"ఏందన్నా" అన్నాడు వాడు గూండా స్టయిల్లో. మనిషిమాత్రం వానపాము నిలువుకోతలా వున్నాడు.

"దాని పైట లాగరా. అమ్మడి గుండె నోవేకన్సీనా, టులెట్టా అనేది ఇట్టే చెప్పేస్తా" అన్నాడు.

చప్పున కొంగులాగి నడుం చుట్టూ తిప్పి దోపుకున్నాను.

అయినా వాడు నా మీదిమీదికి వచ్చాడు కొంగు లాగబోతున్నట్టే.

చుడీదార్ వేసుకోకుండా చీరకట్టుకొచ్చినందుకు నన్ను నేను తిట్టుకున్నాను.

వాడి చెయ్యి నా నడుం దగ్గరకు రాబోతుండగా చప్పున వడిసి పట్టుకుని విసిరికొడుతూ "చం పేస్తాను" అన్నాను.

"చంపుద్దంటున్నా" అన్నాడు వానపాము వెకిలిగా నవ్వుతూ బ్రేస్‌లెట్‌గాడితో.

"నీకింకా బతకాలనుందిరా? " అన్నాడు బ్రేస్‌లెట్‌గాడు.

"అప్పుడే ఎట్టాపోయేదన్నా? ఇంకా ఒక్క పెళ్లాం గూడా రాలా" అన్నాడు వానపాము.

"అయితే దాన్నొదిలేసి దీని చున్నీ లాగేసుకో" శిల్ప ఉలిక్కిపడింది.

"ప్లీజ్..." అందది ఏడుపు గొంతుతో తనకేసి వస్తున్న మణిగాడ్ని చూస్తూ.

"ఈ యూనివర్సిటీ కాంపస్ ఆస్థాన దుశ్శాసనుడు వాడు. వాడ్ని ప్లీజ్ చేసుకోవాలంటే నీ ఫ్రెండ్ మనసు కథ చెప్పాల్సిందే" అన్నాడు బ్రేస్‌లెట్‌గాడు.

ఇక లాభంలేదని అర్థమైంది నాకు.

"నేనెవర్నీ ప్రేమించలేదు" అన్నాను గబగబ.

"వెల్ సెడ్" బ్రేస్‌లెట్‌గాడు నన్ను మెచ్చుకుని "అయితే... ఓ ప్రేమలేఖ రాసుకో చాలా పొయటిగ్గా, టచింగ్‌గా వుండాలి. లేదో... నీ యవ్వారం అట్టో ఇట్టో తేల్చేసుకుంట" అన్నాడు.

వాడి కనుసైగ అందుకుని ఆ గుంపులోంచి ఒకడు లెటర్ ప్యాడ్ అందించబోయాడు నాకు.

"నే రాయను" అన్నా మొండిగా.

"అయితే మీ శిల్పసుందరికి బర్త్‌డే సెలబ్రేషన్ తప్పదు" అన్నాడు వానపాము.

శిల్ప వణికిపోతూ ఒకడుగు వెనక్కేసింది.

"ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గారు మా అంకుల్" అన్నాను ఆ ఐడెంటిటీ ఏమైనా వర్కవుట్ అవుతుందేమోనని.

"అట్లాగయితే లవ్‌లెటర్ ఆయనకే రాసేయ్" అన్నాడు బ్రేస్‌లెట్ పళ్లికిలిస్తూ.

వీళ్లు తాటాకు చప్పుళ్లకి భయపడే రకం కాదని అర్థమైపోయింది నాకు.

వానపాముగాడు శిల్ప చున్నీ కొనని పట్టుకుని నిలబడివున్నాడు.

"రాస్తే వదిలేస్తారా" కమిట్ అయిపోతూ అడిగాను.

"నీ లవ్‌లెటర్ మాకు నచ్చితే" అన్నాడు చెవికి స్టడ్ పెట్టుకున్న బ్లూ జీన్స్ వెధవ.

అక్కడే వున్న పచ్చికలో కూర్చున్నాను.

ఒక్కక్షణం ఆలోచించాను.

"రంజు గుండాల" అన్నాడు వానపాము నిలువుకోత.

వాడికేసి అసహనంగా చూసి రాయడం మొదలెట్టాను.

డియర్... అంటూ మొదలెట్టి... అట్లా రాస్తూపోతున్నా. రాస్తున్నంతసేపూ ఏదో ఒకటి వాగుతూనే వున్నారు వాళ్లు. ఓ పది నిమిషాల్లో రాయడం పూర్తిచేసి ఆ బ్రేస్‌లెట్ గాడికి విసురుగా అందించాను. వాడు దాన్ని విప్పి చదవబోయిన వాడల్లా ఆగి, శిల్పాకేసి చూసి అన్నాడు. "నువ్ చదవ్వే" అని.

పి.జి. కోర్స్ చేస్తూ అంత ఫౌల్ లాంగ్వేజ్ వాడెట్లా వాడుతున్నాడో నాకర్థం కాలేదు.

శిల్పా ఇబ్బందిగా చూసింది.

"చదవమంటుంటే..." గదమాయించాడు.

తప్పదన్నట్టు మొదలెట్టింది.

ప్రియా!

క్రితం రాత్రేకదూ! ఆకాశం అంచుల్లో వెన్నెల దీపాలు వెలిగేవేళ... ఆదమరిచి నిద్రపోతున్న నా కనుపాపల ఒళ్లోకి కలవై వచ్చావ్!

అప్పుడు నువ్వాలపించిన స్వప్నరాగాలు నా హృదయాంతరాళంలో ప్రతిధ్వనిస్తూ ఇప్పటికీ నా చెవులకు విన్పిస్తూనే వున్నాయ్. అందుకే రెప్పల సందుల్లోంచి నువ్వెక్కడ జారిపోతావోనని కళ్లు విప్పే సాహసం చెయ్యటంలేదు నేను. ఒక్కసారి నిజమై రావూ... నా కనురెప్పల సంకెళ్లు తెంపి నిన్ను కళ్లారా చూసుకుంటాను.

శిల్పా చదవటం ఆపి వాళ్ళకేసి చూసింది.

"వహ్వా... వహ్వా... ఏం భావుకత" అన్నాడు బ్లూజీన్స్.

"ఎంతో ఎక్స్‌పీరియన్స్ వుంటే తప్ప ఇట్లా రాయడం అసాధ్యం అన్నాడు" గుంపులోంచి మరొకడు.

బ్రేస్‌లెట్ గాడు మాత్రం మౌనంగా దాన్నందుకుని మళ్ళీ ఓసారి చదువుకుని "కింద సంతకం చెయ్" అన్నాడు.

తిరిగి దాన్ని నాకిస్తూ.

వాడడిగిన పద్ధతికి ఇక మొరాయించి వేస్టన్పించి సంతకం చేశాను.

అందుకని మళ్ళీ చదివి "డియర్ పక్కన డేష్ పెట్టావా! పోన్లే... నీకో లవ్‌ని సెట్ చేసే బాధ్యత నాది. ఒక్క నాల్రోజులాగు. దీనికి రిప్లై తెప్పించిపెడతా" అన్నాడు.

"దాన్నేం చేస్తావ్?" భయంగా అడిగాను.

"వెయిట్ అండ్ సీ" అన్నాడు వాడు అదోలా నవ్వుతూ.

★ ★ ★

డాక్టర్ కె. దిలీప్, ఫిజీషియన్ అన్న బోర్డ్ చూసి ఆటో దిగాం నేనూ శిల్పా.

అశోకా నర్సింగ్ హోమ్ అన్న అక్షరాల్ని చదువుతూ "మీ మామగారి పేరా?" అంది శిల్పా.

"చీప్ జోక్స్ వెయ్యొద్దు". సీరియస్‌గా చెప్పాను.

"క్లినిక్ చాలా బాగుంది. మై కంగ్రాచ్యులేషన్స్ టు యు ఇన్ అడ్వాన్స్" అని "ఇది జోక్కాదు" చెప్పింది శిల్పా అంతకంటే సీరియస్‌గా.

పోర్చ్ మెట్లెక్కి... కేరిడార్ దాటి వెయిటింగ్ హాల్లో మిగతా పేషెంట్స్‌తో పాటూ కూర్చున్నాం ఇద్దరం.

"నీ ఉడ్‌బీది గొప్ప బిజీ ప్రాక్టీసే" అంది శిల్పా అక్కడున్న పేషెంట్స్ సంఖ్యను చూస్తూ.

"చీప్ జోక్స్ కట్ చెయ్యొద్దన్నానా?" గుడ్లురిమాను.

...ఓ పాతికేళ్ల యువతి మాక్కాస్త దూరంలో ఓ టేబులూ చెయిరూ అరేంజ్ చేసుకుని ఓపెన్ కౌంటర్‌లో కూర్చుని వుంది. మాటిమాటికీ మాకేసి చూస్తోంది.

"నీకు రైవల్ బాగుందే. వాలకం చూస్తుంటే నీ దీపూకి ఆల్రెడీ లైనేసిన శాల్తీ లాగుంది" అంది శిల్పా.

నేను శిల్పాకేసి నుదురు చిట్లించి చూసి "ఆ శాల్తీని సరిగ్గా చూడు. నీ డౌట్ క్లియ రౌతుంది" అన్నాను.

శిల్పా ఆమెకేసి ఎగాదిగా చూసి అర్థం కానట్టు ముఖం పెట్టింది.

# ఏరిన ముత్యాలు

★ నీ వెనుకా, నీ ముందూ ఉన్నదానికంటే నీ లోపల ఉన్నది మరింత ముఖ్యం.

\- లాంగ్‌ఫెలో

★ మనిషికి ఎలా జీవించాలో నేర్పడమే మతాలన్నిటి పరమ లక్ష్యం.

\- గురునానక్

★ తెలిసింది తక్కువా, గ్రహించేది ఎక్కువా కాబట్టి స్త్రీలు పురుషులకంటె తెలివైనవారు.

\- స్టీవెన్స్

★ కష్టాలు అనే పిట్టలు తల మీంచి ఎగరకుండా మానవు, కానీ అవి నీ తల మీద గూడు కట్టకుండా మాత్రం చూసుకోగలవు.

\- చైనా సామెత

★ సత్యం తత్త్వశాస్త్రానికి ధ్యేయం. తత్త్వవేత్తలకు కాదు.

\- జాన్‌ఛర్టన్ కాలిన్స్

★ పైకి నవ్వుతూనే కనిపించవచ్చు, అయినా అతడు దుష్టుడు కావచ్చు.

\- షేక్స్‌పియర్

★ సంఘవిద్రోహి చిట్టచివరకు ధరించే ముసుగు ప్రజాసేవ.

\- శామ్యూల్ జాన్సన్

★ ఇతరులకు బాధ కలిగించే బదులు మనం బాధపడడం మంచిది.

\- జె.పి వాస్వానీ

★ అమర్యాదగా జీవించడం కంటే గౌరవంగా చనిపోవడం మేలు.

\- టాసిటస్

★ ప్రతిభావంతుల ప్రతి మాటలోనూ మనం చెప్పలేక తోసిపుచ్చిన భావాలే తిరిగి హుందాగా మనకు సాక్షాత్కరిస్తాయి.

\- ఎమర్సన్

★ ఎక్కువ ఆదాయం గలవారు మాత్రమే అనుభవించగల భోగం కోపం.

\- విలియమ్ కర్టిస్

★ మీ వాదమే సరైనదని మీకు తెలిసినా ఆవేశంతో వివాదానికి దిగకండి.

\- లార్డ్ ఛెస్టర్ ఫీల్డ్

★ విద్య ఐశ్వర్యంలో ఆభరణం, ఆపదలలో అండ.

\- అరిస్టాటిల్

★ తమ పిల్లల స్వభావం విషయంలో కంటే గుర్రాల, కుక్కల విషయంలో మనిషి ఎక్కువ శ్రద్ధ చూపిస్తాడు.

\- పెన్నా

సేకరణ: పి.వి.రమణకుమార్

"ఆ అమ్మాయి కళ్ళద్దాలు పెట్టుకుందా లేదా!" అన్నాను.

అప్పటిగ్గాని శిల్పకు బల్బ్ వెలగలేదు. "ఓహో యూజెనిక్స్ ఇష్యూనా! అయితే అన్‌ఫిట్ కేసే ఇది" అంది నిట్టూరుస్తూ.

అట్లా అన్నాక, "అవునూ ఆ పిల్లెందుకూ మనల్ని తినేసేలా చూస్తోంది" అందది.

"ఎందుకంటే... ఇంకా టోకెన్ తీసుకోలేదేమో అని" అన్నాను.

"యు ఆర్ రైట్... పదపద" అంది.

కౌంటర్ దగ్గరకెళ్ళాక ఆమె నాకేసి అదోలా చూసి కరుగ్గా అంది "పేరు"

"దాని పేరు మోహన్‌భాసియా. నా పేరు నమ్రతా బారువా" అంది శిల్ప.

ఆ పేర్లు వినగానే శిల్ప ఊహించిన రియాక్షనేం ఆమెలో రాలేదు. పైగా "ఇద్దరూ చూపించుకుంటారా? " అంది.

"ఏం చూపించాలండీ ఇక్కడ? " అంది శిల్ప అమాయకంగా ముఖంపెట్టి.

"మిస్... జోక్స్ మానేసి... వివరాలు చెప్పండి" అందామె సీరియస్‌గా.

"నేనిందాకట్నుండీ చెబుతున్నా జోక్స్ కట్ చెయ్యొద్దని విన్నావా? " అన్నాను.

శిల్ప నా మాటలేం పట్టించుకోకుండా కౌంటర్‌లోని అమ్మాయితో "రాసుకో... పేరు నమ్రతా బారువా... వయసు ఇరవై ఒకటి దాటి మూణ్నెల్లా పదకొండురోజులైంది" అంది.

ఆ అమ్మాయి మళ్ళీ శిల్పకేసి చురుగ్గా చూసి ఓ టోకెన్ని కౌంటర్‌లో పడేసి "ఫిఫ్టీ రూపీస్" అంది.

ఇరవైతొమ్మిదో నంబర్ అంది. పర్స్ తెరిచి యాభైనోటు ఆమె కందించాను!

ఇద్దరం వచ్చి మళ్ళీ చెయిర్స్‌లో కూర్చున్నాం.

కన్సల్టింగ్ రూమ్ డోర్ దగ్గర నిలబడి ఉన్న ఓ కుర్రాడు "ట్వెంటీ వన్... ట్వెంటీ వన్..." అని అరుస్తున్నాడు.

ఇంకో ఎనిమిదిమంది లోపలికెళ్ళాగ్గానీ మా టర్న్ రాదని అర్థమైంది నాకు.

"నిన్ను చూసి స్టన్నయిపోతాడేమోనే దీపూ" అంది శిల్ప.

నాకూ అట్లానే అనిపించింది.

"నాకెందుకో మీరు మొదటి చూపులోనే నచ్చారు. కాబట్టే ఇన్నిసార్లు మిమ్మల్ని అప్రోచ్ అవుతున్నా. బై గాడ్స్ గ్రేస్ మీది హెల్దీపేరెంటేజ్ అయితే నాకన్నా అదృష్టవంతుడు మరొకడుండడు" అన్న అతని మాటలు గుర్తుకొచ్చాయి అప్రయత్నంగా నాకు.

ఓ అరగంట తర్వాత మా టోకెన్ నెంబర్ని పిల్చాడా కుర్రాడు.

ఇద్దరం కన్సల్టింగ్ రూమ్‌లో అడుగెట్టాం. ఎయిర్ కండిషన్డ్ ఛాంబర్ అది. అద్భుతమైన శాండిల్ పరిమళం గదంతా పరుచుకుని ఉంది.

విశాలమైన టేబుల్ మీద మెరూన్ కలర్ ముఖమల్ క్లాత్ పరిచి ఉంది. దానిపైన అమర్చిన గాజు పలకలోంచి క్లెన్లీనెస్ ఈజ్ నెక్స్ట్ టు గాడ్లీనెస్ అన్న అక్షరాలున్న స్ట్రిప్ కనబడుతోంది.

ముందు మమ్మల్ని చూడగానే కేజువల్‌గా "రండి... కూర్చోండి" అన్నాడు.

మేం కూర్చున్నాక "కంప్లయింట్ ఏమిటి? " అంటూ నాకేసి చూసి కాస్త ఎగ్జయిట్ అయ్యాడు. "మీరు... మీరు..." అన్నాడు ఇంకేమనాలో అర్థంకానట్టు.

నేను నేనే అన్నట్టుగా ఓ ఎక్స్‌ప్రెషన్ ఇచ్చి కావాలని కాస్త సిగ్గుని ఎగ్జిబిట్ చేస్తూ తలదించుకున్నాను.

"మిమ్మల్ని ఇక్కడ చూడడం చిత్రంగానే ఉందే" అంటూ ఇదెట్లా సాధ్యం అన్నట్టు చూశాడు.

"ఇక్కడ యూనివర్సిటీలో పి.జి. లో చేరాను. ఇది నా ఫ్రెండ్. ఒంట్లో బాగా లేదంటే తీసుకొచ్చాను. మీరనుకోలేదు" అన్నాను సంతోషాన్ని వ్యక్తంచేస్తూ.

"గ్లాడ్ టూ మీట్ యూ" అన్నాడు.

"థాంక్యూ" అన్నాను.

"వెల్ కమ్" అన్నాడు.

"ఇష్.... అబ్బ" అంది శిల్ప.

దిలీప్ అలర్ట్ అయిపోయి "కంప్లెయింట్ ఏంటి మేడమ్? " అన్నాడు.

"ఒకటి కాదు డాక్టర్!" అందది నిట్టూరుస్తూ.

"చెప్పండి" అన్నాడు.

"కాళ్లూ, చేతులూ ఒకటే లాగేస్తూంటే... డాక్టర్ మధుసూదన్ గారికి చూపించా. టెస్టులూ అవీ చేసి షుగరని చెప్పారాయన. దాంతో నేను అప్ సెట్ అయిపోతుంటే.... ఈమధ్య ఏంతిన్నా కడుపులో ఒకటే మంట. తట్టుకోలేక డాక్టర్ మురళీధర్ దగ్గరకెళ్లాను. గేస్ట్రిక్ ట్రబుల్ స్టార్టయిందని చెప్పాడు. దీనికే దిగులుపడి నేనేడుస్తూంటే తలనొప్పి మొదలయింది. కళ్లు ఒకటే ఎర్రబారడం.... ఐ డాక్టర్ ప్రతాప్‌గారికి చూపిస్తే త్వరలో గ్లకోమా వచ్చే సూచనలున్నాయని అన్నారు. మందులూ అవీ రాసిచ్చారు.

"అంతేకాదు. హెయిర్ డైలూ అవీ మానేయండి. అవి కళ్లకు చెరుపు చేస్తాయి అని చెప్పాడు. నా ప్రాబ్లమ్ ఏంటంటే బాల నెరుపు. పదహారేళ్ల వయసునుంచీ డై వాడ్డం అలవాటు చేసుకున్నాను. ఇప్పుడు సడన్‌గా మానాలంటే ఎలా కుదురుతుంది? అందుకే ఆపలేదు" చెప్పింది శిల్ప.

"ఇంత చిన్న వయసులో ఇన్ని కంప్లెయింట్స్ వున్నాయంటే... రియల్లీ ఐ పిటీ యూ. అన్నట్టు మీ ప్రెజెంట్ కంప్లయింట్ చెప్పనేలేదు" అన్నాడు.

"గుండెల్లో నొప్పిగా ఉంటోందండీ. ఏ కార్డియాలజిస్ట్ దగ్గరకో వెడితే.... నా గుండెల్లో హోలుందనో... హార్టెటాక్ సింప్టమ్స్ కనపడుతున్నాయనో చెప్తారని భయమేసి మీ దగ్గరకొచ్చానండి" అంది.

"గుండె జబ్బంటే... స్పెషలిస్ట్‌ని కన్సల్ట్ చేయడమే మంచిదండీ. మీ కేసుని నేను డాక్టర్ ప్రభాకర్ గారికి రిఫర్ చేస్తాను. వెళ్లి ఆయన్ని కన్సల్ట్ చేయండి" అన్నాడు.

"తప్పదంటారా? " అంది శిల్ప.

"మీ మంచి కోసమే చెబుతున్నానండీ" అన్నాడు.

శిల్ప నాకేసి 'ఇక కానివ్వు' అన్నట్టు చూసింది.

నేను గొంతు సవరించుకున్నా. "ప్చ్... పాపం దాని పెళ్లి ఇంకో రెండు నెలలుంది. అన్ని రోగాల్నీ తోసేసుకుని... పెళ్లికి సిద్ధమైంది. మళ్లీ... ఈ గుండె జబ్బొకటి" అన్నాను.

దిలీప్ ఒక్కసారి షాక్ తిన్నట్టు మొహం పెట్టి అంతలోనే తమాయించుకుని శిల్పకేసి ఓ బాధాకరమైన చూపు చూసి, తరవాత మెల్లగా "మీరీ పరిస్థితుల్లో పెళ్లిచేసుకోకపోవడమే మంచిది" అన్నాడు.

శిల్ప విషాదంగా నవ్వింది. "నేనూ అదే చెబుతున్నానండీ... మా మోహన్ నామాట వింటేనా! నువ్వు లేందే నేను బ్రతకలేనూ అంటారు. చావైనా బతుకైనా నీతోనే అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంటాడు. నేనేం చెయ్యలేక ఈ పెళ్లికి సిద్ధమయ్యాను"

"చాలా పొరపాటు చేస్తున్నారు" అన్నాడు.

"ఈ పొరపాటు నాది కాదండీ. ప్రేమది" అంది శిల్ప.

దిలీప్ ముఖంలో చిరాకు స్పష్టంగా కన్పించింది నాకు. "ప్రేమా అనురాగం అనుకుంటూ పెళ్లిచేసుకుని రోగగ్రస్థులైన ఫ్యూచర్ ఇండివిడ్యువల్స్‌ని ప్రొడ్యూస్ చేసే హక్కు మీకు లేదు" అన్నాడు.

శిల్ప దెబ్బ తిన్నట్టు చూసింది. "మీరు చెప్పింది నిజమే డాక్టర్. ఈ సొసైటీని స్పాయిల్ చేసే రైట్ నాకు లేదు" అంది. దుఃఖంతో అదురుతున్న కింద పెదవిని కాసేపు మునిపంటితో నొక్కిపెట్టి ఆనక అడిగింది. "డాక్టర్... ఇఫ్ యూ డోంట్ మైండ్... నాకో హెల్ప్ చెయ్యగలరా? "

దిలీప్ "చెప్పండి" అన్నాడు మృదువుగా.

"ఒక్కసారి... మీరు మా మోహన్‌తో

మాట్లాడగలరా! జస్ట్ ఫోన్లోనే" అంది.

అతనేదో అనబోతుంటే "ప్లీజ్ డాక్టర్... నో అనకండి. మా మోహన్‌కి ఈ పెళ్లి వద్దని నచ్చచెప్పండి. యూజెనిక్స్ గురించి చెప్పి అతన్ని ఎడ్యుకేట్ చెయ్యండి. పనికిమాలిన ప్రేమకోసం ఫ్యూచర్ సొసైటీని రోగులతో నింపడం తప్పని చెప్పండి డాక్టర్" శిల్ప కొంగు నోటికడ్డం పెట్టుకుంది.

వస్తున్న నవ్వును ఎట్లాగో ఆపుకున్నాను.

"ఏ టైమ్‌లో చెయ్యమంటారు ఫోన్? " అన్నాడు శిల్ప దుఃఖాన్ని ఏ ఫీలింగ్ లేకుండా చూస్తూ.

"రేపు రాత్రి తొమ్మిది పైన చెయ్యండి" అంటూ విల్సనంకుల్ ఫోన్‌నంబర్ ఇచ్చింది శిల్ప.

శిల్ప గొడవయ్యాక దిలీప్ అటెన్షన్ నామీదికి మళ్లింది. నాకేసి ప్లెజంట్‌గా చూస్తూ, "ఓసారి... ఇంటికి రాకూడదూ! జస్ట్ ఇట్స్ మై ఇన్విటేషన్" అన్నాడు.

నేనేం చెప్పలేదు. నవ్వి వూరుకున్నాను.

అది చూసి అతను "అమ్మా, నాన్నా కూడా సంతోషిస్తారు" అన్నాడు.

"ట్రై చేస్తాలెండి" అన్నాను.

"ట్రై చెయ్యడం కాదు. తప్పకుండా రావాలి" అని అతని ఇంటి అడ్రస్ వున్న విజిటింగ్‌కార్డ్ ఇచ్చాడు.

"అలాగే" అన్నాను లేస్తూ.

"సీయూ ఎగైన్" అన్నాడు నా కళ్లలోకి గుచ్చి చూస్తూ.

గాఢంగా నిట్టూర్చాను. ఇప్పుడు శిల్ప చెప్పినలాంటి కంప్లెయింట్సన్నీ మా ఇంట్లో ఒక్కొక్కరికి ఒక్కోటి చొప్పున వున్నాయని తెలిస్తే ఇంత ఇదిగా నన్ను వాళ్లింటికి ఇన్వయిట్ చేస్తాడా ఇతను?

మేం బయటికి వచ్చేస్తుంటే శిల్ప మళ్లీ అతనితో "మర్చిపోరుగా... ఫోన్ చేస్తారు కదూ" అంది.

"డెఫినిట్లీ" అన్నాడు.

హాస్పిటల్ గేటు దాటాక శిల్ప అంది.

"నీ ఉడ్‌బీ మరీ నల్లరాయి, కనికరాయి. అడగ్గానే చూడు. ఫోన్‌చేసి మరీ నా పెళ్లి చెడగొట్టడానికి ఎంత నీట్‌గా ఒప్పుకున్నాడో"

"ఆ నల్లరాయిని మార్చటం మన తరం అవుతుందంటావా? నువ్వేగా ఈ రిఫార్మింగ్ ప్రోగ్రామ్ సజెస్ట్ చేసింది" అన్నాను.

"అరే ఫస్ట్ అటెంప్ట్‌కే అప్‌సెట్ అవుతావ్. ట్రై అండ్ గెట్ షుడ్‌బి అవర్ మోటో" అంది శిల్ప.

"ఎనీవే... నీ నటన అమోఘం. కన్నీళ్లు కూడా పెట్టుకున్నావ్. ఎట్లా నటించావే అంత డీప్‌గా" అన్నాను ఆశ్చర్యంగా.

"స్నేహం కోసం" అంది అంతకంటే డీప్‌గా.

★ ★ ★

విల్సన్ అంకుల్ టెలిఫోన్ ముందు కూర్చుని వున్నారు. మేమంతా అంటే... జెరీనా ఆంటీ, వాళ్ళ పిల్లలూ, నేనూ, శిల్పా అందరం ఆయన చుట్టూ కూర్చుని ఉద్విగ్నంగా టెలిఫోన్‌కేసి చూస్తున్నాం.

తొమ్మిది దాటి పది నిముషాలు కావస్తోంది.

"నా రిక్వెస్ట్ అప్పుడే మర్చిపోయుంటాడు. పోనీ నేనే రింగ్‌చేసి అంకుల్‌కి కనెక్ట్ చేసేదా? " అంది శిల్ప.

శిల్ప దిలీప్ దగ్గర సృష్టించిన మోహన్ పాత్ర పోషించడానికి విల్సనంకుల్ రెడీగా వున్నారు.

హాస్పిటల్ నుండి ఇంటికొచ్చాక... ఒకవేళ దిలీప్ ఫోన్ చేస్తే మోహన్‌లాగా ఎవరు మాట్లాడాలా అన్న సందిగ్ధంలో పడ్డాం. ముందైతే గొంతు మార్చి మేమే మాట్లాడాలని మా ప్లాన్. కానీ అట్లా గొంతులు మార్చి మాకు మేమే ఫోన్‌చేసి చూసుకుంటే అదంత ఎఫెక్టివ్‌గా అన్పించలేదు.

రెబెకానీ నర్గీస్‌నీ.. వాళ్ల ఫ్రెండ్స్‌లో ఎవరైనా మిమిక్రీ తెలిసిన వాళ్లున్నారేమోనని ఎంక్వయిరీ చేశాం. లేరనే సమాధానం వచ్చింది.

మేమట్లా అడుగుతున్నప్పుడు విల్సనం కుల్ విని తనకు తెలిసిన మిమిక్రీ ఆర్టిస్ట్ ఒకరున్నారని, కావాలంటే పిలిపిస్తాననీ అన్నారు. అయితే అతనితో అవసరం ఏంటో చెప్పమన్నారు.

ఇక అంత పెద్దమనిషి దగ్గర విషయం దాచడం అనవసరం అనిపించింది. అదీ గాక... ఏ సందర్భంలోనైనా ఇది బయటప డితే ఆయన మరోలా అర్థం చేసుకునే అవ కాశం ఉందనిపించి మొత్తం చెప్పడానికే నిర్ణయించుకున్నాం.

అంతా విన్నాక ఆయన "ఏంటీ.... హెరి డిటరీ డిసీజెస్ ఉన్నంత మాత్రాన ఇక ఆ మనిషి ఎందుకూ కొరగాడా? ఐ యామె డయాబిటిక్ పేషెంట్. అంత మాత్రాన ఇక నా బిడ్డలకు భవిష్యత్ ఉండకూడదా? ఎవడట్లా వాగింది? ఐ విల్ టీచ్ హిమ్ ఎ లెసన్" అన్నాడు ఆవేశంతో ఊగిపోతూ.

ఆయన ఆవేశాన్ని కంట్రోల్ చెయ్యాల్సిన అవసరం ఉందనిపించి "అబ్బే.. అతనట్లా అనలేదంకుల్. యూజెనిక్స్ అట్లా చెబు తోందీ అంటాడు" అన్నాను.

"హెల్ విత్ ద యూజెనిక్స్. అతను హ్యూమన్ బీయింగ్ కాదా? హ్యూమానిటీ లేదా? " అన్నాడు.

శిల్ప అంది "ఉండే ఉంటుందంకుల్ హిడెన్‌గా. దాన్ని బయటికి లాగాలనే మా ప్రయత్నం. అతన్నట్లా వదిలేస్తే అతని లాంటివాళ్లు మరికొందరు తయారవుతారు. దాంతో ఫ్యూచర్ సొసైటీ ఫిజికల్‌గా హెల్దీ అవుతుందేమోగానీ మోరల్‌గా అనారోగ్యం పాలౌతుంది. సో డాక్టర్ దిలీప్‌కి యూజెని క్స్‌కన్నా ప్రేమ గొప్పదని ఋజువు చెయ్యా లనే ఈ డ్రామా ఆడుతున్నాం మేం"

"వెరీగుడ్ బేబీస్! మీ డ్రామాలో మోహన్ పాత్రకి మిమిక్రీ ఆర్టిస్ట్ అక్కర్లేదు. ఐ విల్ బి దట్ మోహన్. అతని కాల్ నేనే రిసీవ్ చేసుకుంటాను" అన్నాడాయన.

"మంచి టర్నింగే" అని ఒప్పుకున్నాం.

"అందుకే అందరం లివింగ్‌రూమ్‌లో గేద రైపోయి దిలీప్ కాల్ కోసం ఆత్రంగా ఎదు రుచూస్తున్నాం.

"సరే... నువ్వే డయల్ చెయ్" చెప్పాను శిల్పకి.

శిల్ప రిసీవర్ చేత్తో ముట్టుకోబోతుండగా ఫోన్ రింగయింది.

చప్పున లిఫ్ట్‌చేసి "హలో దిసీజ్ శిల్పా" అంది శిల్ప.

అవతలి ఎండ్‌నుండి చెప్పింది విని, "గుడీవినింగ్! డాక్టర్ మోహన్ ఇక్కడే వున్నారు. మాట్లాడండి" అంటూ శిల్ప రిసీ వర్ని విల్సనంకుల్ చేతికి అందించి "గుక్క తిప్పుకోనివ్వకండంకుల్" అంది. ఆయన గొంతు సవరించుకుని "హెలో... గుడీవి నింగ్ డాక్టర్... మోహన్ని మాట్లాడుతున్నా" అన్నాడు.

నా గుండె వేగం పెరిగింది.

అవతల్నుంచి దిలీప్ ఏమన్నాడో మరి "ఫర్లేదు డాక్టర్. నేనేమనుకుంటాను. శిల్ప ముందే చెప్పిందిలెండి మీ గురించి" అన్నాడు విల్సనంకుల్.

ఒక్కపాజ్ ఇచ్చి మళ్ళీ "నో... నో... ఐ నెవర్ మైండ్. యాజె డాక్టర్ అండ్ వెల్ వి షర్ మీరు చెప్పదల్చుకున్నది చెప్పండి" అన్నాడు.

దిలీప్ ఏదో అంటున్నాడు. విల్సనంకుల్ తల వూపుతున్నాడు. నేనిక ఉద్విగ్నత ఆపు కోలేక రెబెకా రూమ్‌లోని ఇంటర్‌కమ్ దగ్గ రికి పరిగెత్తాను. రిసీవర్ చెవికి ఆనించుకు న్నాను.

"మీ మేలు కోరి చెబుతున్నా. ఆమెను మీరు మేరేజ్ చేసుకోవడం మంచిది కాదు" అంటున్నాడు దిలీప్.

విల్సనంకుల్ "శిల్పని నేను ప్రేమించా డాక్టర్" అంటున్నాడు గొంతు గంభీరంగా పెట్టి.

"నేను చెప్పేది మీరు అర్థం చేసుకోవడం లేదు.. షి ఈజ్ సఫరింగ్ ఫ్రమ్ ఎ నంబ

రాఫ్ డిసీజెస్. తను డయాబెటిస్, ఐ డిసీజ్, గ్యాస్ట్రిక్ ట్రబుల్ ఇట్లా చాలా జబ్బులతో బాధపడుతోంది. మోరోవర్ ఆమెకు గుండెజబ్బు కూడా వున్నట్టుంది. ఆమెను మేరేజ్ చేసుకోవడం మీకే కాదు ఆమెక్కూడా మంచిది కాదు" దిలీప్ నచ్చజెబుతున్నట్టుగా అన్నాడు.

"తెలుసు డాక్టర్ అయినా శిల్పని ప్రేమిస్తున్నా. ఆమెను వదులుకోవడం అసాధ్యం" అన్నాడు విల్సనంకుల్.

"మీకేమైనా పిచ్చి పట్టిందా! నచ్చచెప్పమని చెప్పింది"

"స్టిల్ ఐ లవ్ హర్ డాక్టర్" అచ్చమైన ప్రేమికుడిలా అన్నాడు అంకుల్.

"మైగాడ్... నేను మీతో పర్సనల్‌గా మాట్లాడాలి. రేపోసారి నా క్లినిక్కి రాగలరా? " దిలీప్ అన్నాడు.

"సారీ! చెప్పదలచుకుంది అయిపోయిందా? " అన్నాడు విల్సనంకుల్.

"ట్రైటు అండర్‌స్టాండ్ మి మేన్. అన్ని జబ్బులతో బాధపడే మనిషిని. అదీ షుగర్ లాంటి హెరిడిటరీ డిజీజెస్‌తో బాధపడే వ్యక్తిని పెళ్లాడి... అన్‌హెల్దీ ఆఫ్‌స్ప్రింగ్స్‌ని ప్రొడ్యూస్ చెయ్యడం సామాజిక నేరం యూనో" అన్నాడు దిలీప్.

"డాక్టర్ దిలీప్! డు యునో ద రియల్ మీనింగ్ ఆఫ్ హెల్త్" అడిగాడు విల్సనంకుల్.

దిలీప్ ఏదో అనబోయేలోగానే అంకులే అన్నాడు. "హెల్త్ అనేది కేవలం ఫిజికల్ ఫీలింగే కాదు డాక్టర్. అది మానసికమైంది కూడా. హెల్త్ ఈజ్ ఎ స్టేట్ ఆఫ్ వెల్ బీయింగ్ ఫీలింగ్ ఇన్ ఆల్ ద యాస్పెక్ట్స్ ఆఫ్ అవర్ బాడీ, మైండ్ అండ్ ఇన్ అవర్ రిలేషన్స్ విత్ ద సొసైటీ ఇన్ విచ్ వి యీ లివ్"

"మిష్టర్ మోహన్! మీరు నా పాయింట్ క్యాచ్ చేయడంలేదు. శారీరక అనారోగ్యంతో, బాధపడేవాడు మానసికంగా కూడా దెబ్బతింటాడు. అట్లా దెబ్బతిన్న వ్యక్తి సొసైటీతో గుడ్ రిలేషన్స్‌ని డెవలప్ చేసుకోలేడు. అతను ఫ్రస్ట్రేషన్‌తో సమాజానికి చెరుపు చేసే అవకాశాలు ఎక్కువ" దిలీప్ రీజనింగ్ ఇచ్చాడు.

విల్సనంకుల్ ఫక్కుమని నవ్వాడు.

"మీ థింకింగ్ చాలా నేరోగా వుంది డాక్టర్"

దిలీప్ ఏదో అనుబోతుంటే విల్సనంకుల్ "ప్లీజ్ లిజన్ టుమి" అంటూ అబ్జెక్ట్ చేశాడు. "చరిత్ర ప్రసిద్ధి చెందిన మహాపురుషులెందరో జబ్బులతో బాధపడినవారే. గ్రేట్ పోయట్ కీట్స్... తన పద్యాలుగోఏట చూపు కోల్పోయాడు. అంతమాత్రాన ఆయన యూజ్‌లెస్ పర్సన్ కాలేదే! గుడ్డితనంతో బాధపడుతూ ఆయన రాసిన 'సోనెట్ ఆన్ బ్లైండ్‌నెస్' అనే పోయమ్ వరల్డ్ ఫేమస్ అయింది. ఇంకో కవయిత్రి టోరుదత్ అతిచిన్న వయసులోనే క్యాన్సర్ వ్యాధితో మరణించింది. అంత మాత్రానికే ఆమె నేమ్‌కీ ఫేమ్‌కీ ఎటువంటి ఆటంకం రాలేదే! నేషనల్ లీడర్ వినోబా... క్రానిక్ అల్సర్‌తో బాధ పడేవాడట. అయినా ఆయన ఫ్రస్ట్రేట్ కాలేదు. జబ్బుతో ఓ వంక బాధపడుతూనే లేండ్ గిఫ్ట్ మిషన్ని ఆర్గనైజ్ చేసి ఎంతోమంది లేండ్‌లెస్ పీపుల్‌కి... లేండ్ లార్డ్స్ నుంచి భూమిని కానుకగా ఇప్పించిన ఘనుడాయన. ఆయనకున్న జబ్బు... ఆయన గొప్పతనాన్ని డిస్‌ఫిగర్ చెయ్యలేదే!"

విల్సనంకుల్ దిలీప్‌ని మరీ వాయించేస్తున్నాడనిపించింది. ఇక దిలీప్ తన పాలసీ చేంజ్ చేసుకోక తప్పదనిపించింది. బట్ నా అంచనాల్ని తలకిందులు చేస్తూ దిలీప్ ఓ మాటన్నాడు. "నేనొక రూట్‌లో వస్తుంటే... మీరో రూట్‌లో వెళుతున్నారు. ఐకాంట్ హెల్ప్‌యు"

విల్సనంకుల్ ఒక్కక్షణం మౌనంగా వుండిపోయి తరవాతన్నాడు. "చూడండి

డాక్టర్ దిలీప్! మీరెప్పుడైనా ఎవర్నయినా ప్రేమించారా?"

"లేదు ఏం?"

"ప్రేమించి చూసి ప్రేమ లోతెంతో తెలుసుకుని... అప్పుడు చెప్పండి నేను శిల్పని పెళ్ళి చేసుకోవాలో వద్దో. టిల్ దెన్... ఐ డోంట్ మేరీ హర్"

"ఛాలెంజ్ చేస్తున్నారా?" అడిగాడు దిలీప్.

"యస్... ఛాలెంజ్. మీ యూజెనిక్స్ ప్రకారం ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ని అబ్జర్వ్ చెయ్యకుండా ఓ అమ్మాయిని ప్రేమించండి. మీరు ప్రాణంగా ఆమెని ప్రేమించాననుకున్నాక ఆమె ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ చూడండి. ఆమె కుటుంబంలో ఏ హెరిడిటరీ జబ్బుతోనో బాధపడేవాళ్లు కనీసం ఒక్కరైనా వుండే వుంటారు. అప్పుడు మీరు మీ యూజెనిక్స్కి ప్రాధాన్యతనిచ్చి ఆమెను మర్చిపోతారో... ప్రేమకి తలవంచి ఆమెను గుండెలకు హత్తుకుంటారో... మీరే నిర్ణయించుకోండి"

ఈ సంభాషణ ఇట్లా మలుపు తిరుగుతుందని వూహించలేదు నేను. ఏదో మోహన్ అనే వ్యక్తిలా అంకుల్ నాలుగు చివాట్లేస్తారనుకున్నా. మొత్తానికి పరిస్థితి ఛాలెంజ్ చేసుకునే స్థాయికి రావడం చాలా ఎగ్జయిటింగా అన్పించింది.

అంకుల్ చేసిన ఛాలెంజ్కి దిలీప్ ఏం సమాధానం ఇస్తాడా అని చెవులు రిక్కించాను.

"ఒక పేషెంట్ రిక్వెస్ట్ చేసిందని మీకు ఫోన్చేశా గాని ఒక ముక్కూముఖం తెలీని వ్యక్తి ఛాలెంజ్కి రెస్పాండ్ అవ్వాల్సిన అవసరం నాకు లేదు. ఆఫ్టాల్ ప్రేమకోసం సొసైటీని స్పాయిల్చేసే వ్యక్తిని కాను. యాజే డాక్టర్ ఐ నో మై రెస్పాన్సిబిలిటీ టువర్డ్స్ అవర్ సొసైటీ" టక్కున ఫోన్ క్రెడిల్ చేశాడు దిలీప్.

ఒక్కసారిగా నీరు కారిపోయాన్నేను అంకుల్ ఛాలెంజ్కి రెస్పాండ్ అయిపోతూ.

"ఓ... కె... మీరన్నట్టే ప్రేమిస్తాను. ప్రేమించి నేను రైటో కాదో తేల్చుకుంటాను" అంటాడేమో... మహానుభావుడ్ని లైన్లోపెట్టి లవ్లో ముంచేసి సరెండర్ అయ్యేలా చేద్దాం అనుకున్నా.

బట్... దిలీప్ ఓ పట్టాన మారే మనిషి కాదని అర్థమైంది.

నిరుత్సాహంగా రెబెకా గదిలోంచి బయటికొస్తుంటే విల్సనంకుల్ శిల్పతో "కొరకరాని కొయ్యలా ఉన్నాడు కుర్రాడు" అనడం వినిపించింది.

శిల్ప నాకేసి చూసి నాలో నిరుత్సాహాన్ని గమనించి అంది అంకుల్తో "ట్రై అండ్ గెట్ ఈజ్ అంజూస్ మోటో అంకుల్" అంది.

తరువాత అందరం కూర్చుని కాసేపు దిలీప్ గురించి డిస్కస్ చేసుకున్నాం.

"ఆ... అట్లా శపథాలు చేసినవాళ్లే ఈజీగా ప్రేమలో పడేది" అంది జెరీనా ఆంటీ ఓ సందర్భంలో విల్సనంకుల్ కేసి ఓరగా చూస్తూ.

"స్వానుభవం" అన్నాడు విల్సనంకుల్ ఆంటీ కన్ను గీటుతూ.

"అంటే డాడీ! అప్పట్లో నువ్వు దిలీప్గారిలా కొరకరాని కొయ్యవన్నమాట" అంది రెబెకా.

"అయినా మమ్మీ కొరికేసిందిగా" అంటూ అల్లరిగా నవ్వింది నర్గీస్.

"డాడీ! ప్లీజ్... నీ లవ్స్టోరీ చెప్పవూ?" అన్నాడు శ్రీకాంత్.

ఆయన హుషారుగా నవ్వి "చెప్పటమేంటీ.... నేను రిటైర్ అవగానే... నా ఆటో బయాగ్రఫీ రాసి మీకు చదువుకోటానికిస్తాను సరేనా!" అన్నాడు.

ఆయన మాటలకు అందరూ హేపీగా నవ్వుతుంటే నేను మాత్రం దిలీప్ని తల్చుకుని పళ్లు కొరుక్కుంటూ ఉండిపోయాను.

ఆ రాత్రి శిల్పతో "ఛ.... అట్లాంటి అన్ రొమాంటిక్, యారోగెంట్ పర్సన్ కోసం, ఈస్థటిక్స్‌కి అర్థం తెలియని లవ్ సెన్స్ లేని ఆ ఫ్యూచర్ సొసైటీ స్పెసిమన్ కోసం ఇక నా టైమ్ వేస్ట్ చేసుకునే ప్రసక్తే లేదు. అతన్ని ఈ క్షణం నుంచీ నా మనసులోంచి కంప్లీట్‌గా తొలగిస్తున్నా" అన్నాను.

శిల్ప అడ్డుపడుతూ రిఫార్మింగ్, గిఫార్మింగ్ అంటూ మొదలెట్టబోతుంటే కాళ్ల నుంచీ తలవరకూ బ్లాంకెట్ తన్ని పెట్టుకున్నట్టుగా కప్పుకుని గట్టిగా కళ్లు మూసుకుని పడుకున్నాను.

★ ★ ★

నేనూ శిల్పా క్లాస్ రూమ్‌లోకి వెళ్లబోతుంటే నాచేత బలవంతంగా లవ్‌లెటర్ రాయించిన బ్రేస్‌లెట్‌గాడు ఎదురై... "మిస్... రిప్లై వచ్చిందా?" అంటూ అడిగాడు.

నేను, అయోమయంగా అతనికేసి చూస్తుంటే "లవ్ లెటర్ రాశావుగా. మాలో ఎవరమైనా పుచ్చుకుందామంటే మా అందరికీ తలో గర్ల్ ఫ్రెండూ ఆల్రెడీ సెటప్ అయిపోయింది. ఈ కేంపస్‌లో ఇంకెవడి



కైనా ఇద్దామంటే... నువ్వు మరీ ఇరిటేట్ అవుతావని బాగా ఆలోచించి... మా స్ట్రీట్ లోనే ఉన్న ఓ బేచ్‌లర్ గాడికి స్పీడ్‌పోస్ట్‌లో పంపేశా. ఇవాళో రేపో రిప్లై రావచ్చు నీకు. వస్తే... మాకు గ్రాండ్ పార్టీ ఇవ్వాలి. ఓకే" అన్నాడు.

వాడికి సమాధానం ఇవ్వకుండా విసురుగా తల తిప్పుకుని క్లాస్‌లోకి వెళ్లి కూర్చున్నాం.

ప్రొఫెసర్ 'సోషియాలజీ ఈజ్ సైన్స్' అనే టాపిక్ డిస్కస్ చేస్తున్నాడు.

ఓ పావుగంట గడిచాక నన్ను వైస్ ఛాన్స్‌లర్ రమ్మంటున్నాడంటూ అటెండర్ వచ్చి చెప్పాడు. ప్రొఫెసర్ దగ్గర పర్మిషన్ తీసుకుని అటెండర్ వెంట బయల్దేరాను. ఛాంబర్‌లోకి అడుగు పెడుతుంటే వినబడిందా మాట. "ఒక ముక్కూ మొహం తెలీని వ్యక్తికి లవ్‌లెటర్ రాయడానికి ఎంత బరితెగించినతనం కావాలి సర్. ఇట్లాంటి స్టూడెంట్స్ వల్లే కాలేజీలకీ, యూనివర్శిటీలకీ చెడ్డపేరొచ్చేది"

చూసి షాకయ్యాను. "ముందు ఫోన్ చేద్దామనుకున్నా. బట్ ఐ ఫెల్ట్ దట్ ఇటీజ్ మై రెస్పాన్సిబిలిటీ టు మీట్ దట్ గర్ల్... అండ్ వార్న్ హెర్. అందుకే డిస్పెన్సరీకి వెళ్తూ ఇలా వచ్చాను. ఇదే లెటర్ ఏ ఇర్రెస్పాన్సిబుల్ పర్సన్ చేతిలోనో పడిందనుకోండి.... మీ యూనివర్శిటీ పరువు ఏమవుతుందో ఒక్కసారి ఆలోచించండి"

నో డౌట్ అది డాక్టర్ దిలీప్ గొంతు. అంటే నా చేత బలవంతంగా రాయించిన లవ్‌లెటర్ని... ఆ బ్రేస్‌లెట్‌గాడు పోస్ట్ చేసింది ఇతనికేనన్నమాట.

ఇంకేముంది... అయిపోయాను. ఇవాళ్టితో నా పరువు టోటల్‌గా పోయినట్టే.

తల్లో నరాలు చిట్లిపోతున్నట్టుగా అనిపిస్తుంటే ఎట్లాగో గొంతు పెగుల్చుకుని "మే ఐ కమిన్ సార్?" అన్నాను.

"యస్... కమిన్" అన్నాడాయన.

మానప్రాణాల్ని తాకట్టు పెట్టినదాన్లా తలను నా గుండెలకు తగిలేలా వంచుకుని నిలబడ్డాను దిలీప్ ముందు.

నన్ను చూసి దిలీప్ ముఖంలో ఎట్లాంటి ఎక్స్‌ప్రెషన్ చోటు చేసుకుందో నాకు తెలియదు.

అతనేమంటాడా... ఏం వినాల్సివస్తుందా అన్న విషయాన్ని ఎక్స్‌పెక్ట్ చేసే ఓపిక కూడా లేనిదాన్లా నిస్సత్తువగా నిలబడ్డాను.

బహుశా... నన్ను చూసి ఆశ్చర్యపోయాడేమో "ఈ అమ్మాయి..." అంటూ ఆగిపోయాడు దిలీప్.

"సోషియాలజీ ఫస్టియర్ స్టూడెంట్. పేరు అజంతా. ఈమెనేకదూ మీరడిగారు" వైస్‌ఛాన్స్‌లర్ అడిగాడు.

ఆయన టేబుల్‌మీద స్ప్రెడ్ చేయబడి పేపర్ వెయిట్ కింద రెపరెపలాడుతోంది నేను రాసిన, ఛ...ఛ... నాతో వాడు రాయించిన లవ్‌లెటర్.

నేను క్రీగంట దిలీప్‌కేసి చూశాను.

అతను చప్పున... టేబుల్‌మీదున్న లవ్‌లెటర్ని లాక్కున్నట్టుగా తీసుకుని వైస్‌ఛాన్స్‌లర్‌తో అన్నాడు.

"సారీ సార్... ఈ లెటర్ రాసిన అమ్మాయి పేరు అజంత కాదు అజిత"

అప్రయత్నంగా కళ్లెత్తి ధిలీప్‌కేసి చూశాను. అతనూ అదే సమయంలో నా వంక చూశాడు.

అతని ముఖంలో ఒకలాంటి భావం.

అదేంటో నాకర్థం కాలేదు. కానీ అది కోపం మాత్రం కాదని తెలుస్తోంది.

"మీ క్లాస్‌లో అజిత అనే అమ్మాయి వుందా?" అన్నాడు వైస్‌ఛాన్స్‌లర్ నాకేసి చూస్తూ.

"నో సర్ లే... లేదు సర్" తడబడిపోయాను.

"సారీ డాక్టర్ దిలీప్... ఆ పేరుగల అమ్మాయి ఫస్టియర్ సోషియాలజీ గ్రూప్‌లో లేదు"

"ఐ మస్ట్ సే సారీ టు యూ సర్. మీకు చాలా ట్రబులిచ్చాను" అన్నాడు దిలీప్ లేస్తూ.

"ఇట్సాల్ రైట్ డాక్టర్" అన్నాడాయన.

దిలీప్ ఛాంబర్ బయటికి వెళ్లిపోయాడు.

"అజంతా యుకెన్ గో" అన్నాడు వైస్‌ఛాన్స్‌లర్.

"థాంక్యూసర్" అని నేను గబగబ బయటికి వచ్చాను.

దిలీప్... అక్కడే నిలబడి వున్నాడు. నాకోసమేనని అర్థమౌతోంది.

నేను చూసేలా లవ్‌లెటర్ని పర్స్‌లో దాస్తూ అన్నాడు.

"థాంక్యూ మిస్ అజంతా"

ఆ మాటలని, అతనక్కడ్నించి వడివడిగా పార్కింగ్ ప్లేస్‌లో వున్న తన కార్‌వైపు వెళ్లిపోయాడు.

అతని సీయెలో కదిలే వరకూ అక్కడే నిలబడ్డాను.

"థాంక్యూ" అన్నాడంటే... దిలీప్... ఆ లవ్‌లెటర్ని నేను కావాలనే అతనికి రాశాననుకుంటున్నాడా.

నో డౌట్ అంది నా మనసు.

రొట్టె విరిగి నేతిలో పడ్డం... తంతే బూరెల బుట్టలో పడ్డం లాంటి సామెతలన్నీ వెంటవెంటనే గుర్తుకొచ్చి వుక్కిరిబిక్కిరయ్యాను.

నన్ను చూడగానే నా పేరు హైడ్ చేస్తూ అజిత అనే పేరు చెప్పాడంటే నా మీద అతనికి ప్రేమకాకపోయినా అట్లాంటి దానికి సమానమైన భావమేదో వుండే వుండాలి.

తొలిప్రేమ సినిమాలో పవన్‌కల్యాణ్ ఓ సీన్లో ఎవరూ లేకుండా చూసి రహస్యంగా 'యాహూ' అని అరిచి గంతులేసినట్టు నాకూ వెయ్యాలన్పించింది.

ఆనందాన్ని గుండెల్లోనే అదిమేసుకుంటూ క్లాస్‌వైపు వెళుతుంటే బ్రేస్‌లెట్‌గాడు తన గ్యాంగ్‌తో ఎదురై ఏదో అనబోతుంటే కట్ చేస్తూ "వెరీ వెరీ థాంక్స్" అన్నాను.

వాడూ వాడి గ్యాంగూ నేనెందుకు థాంక్స్ చెప్పానో అర్థంకాక నోళ్లు తెరుచుకు చూస్తుంటే నవ్వుకుంటూ క్లాస్‌రూమ్‌లోకి వెళ్లాను.



"అతన్ని నువ్వు రిఫార్మ్ చెయ్యడం కాదు ముందు నిన్ను నేను రిఫార్మ్ చెయ్యాలి" విసుక్కుంది శిల్ప.

రాత్రి సప్పర్‌లోకి చపాతీలు చేస్తున్నా నేను. అది బంగాళాదుంపలకి చెక్కుతీస్తోంది.

దాని మాటకు నేనేం సమాధానం ఇవ్వలేదు. ఇరిటేట్ అయిపోతూ అంది "ఆ లవ్ లెటర్ లక్కీగా అతనికి చేరిపోయింది. నా రొట్టె విరిగి నేతిలో పడిందీ... నూనెలో పడిందీ అని మురిసిపోయిందీ నువ్వే. దొరికిన ఛాన్స్ మిస్ చేసుకుందీ నువ్వే"

దాని కోపానిక్కారణముంది. ఓ అరగంట క్రితం దిలీప్ నాకు ఫోన్ చేసి ఆ లెటర్ రాసింది నేనని తెలీక కంప్లయింట్ చెయ్యడానికి యూనివర్శిటీకి వచ్చినందుకు సారీ చెప్పాడు. పైన నేనతనికే ప్రేమలేఖ రాశాననుకుని థాంక్స్ చెబ్తూ తెగ ఇదయిపోయాడు. నాకేమిటోగా అన్పించింది. నా

బిహేవియర్‌ని అతనెక్కడ చీప్‌గా అంచనా వేస్తాడో అని భయమేసింది. ఆ భయంలో అనుకోకుండా నోటంట నిజం వచ్చేసింది. ఆ ప్రేమలేఖ కథాకమామీషంతా చెప్పే శాను. "అంటే అది మీరు నాకు రాసింది కాదా" అన్నాడు. కాదన్నాను. ఆ తర్వాత ఓ నిముషం పాటు అతనేం మాట్లాడలేదు. నేను 'హలో హలో' అన్నాను. బదులు చెప్పకుండా ఫోన్ పెట్టేశాడు. బాగా నిరా శకు గురయినట్టు అర్థమైపోయింది నాకు. నేనట్లా నిజం చెప్పకుండా వుండుంటే బాగుండేదేమో అనుకున్నా.

"ఏంటాలోచిస్తున్నావ్? ఇప్పుడేం చేద్దా మని? " శిల్ప అడిగింది.

"ఏం చేస్తాను!" అసంకల్పితంగా అంది "వచ్చిన అవకాశాన్ని చేజేతులా పోగొట్టుకు న్నాను"

"ఓ పని చెయ్" అంది శిల్ప.

ఏంటన్నట్టు చూశాను.

"అతనికి రింగ్ చేసి ఆ ప్రేమలేఖ రాసింది మీకని కాదుగానీ అది రాసేప్పుడు నా కళ్లముందు మీరే మెదిలారు అని కోసెయ్. అతని రియాక్షన్ అనుకూలంగా వుంటే ఏదైనా హోటల్లో నీ బర్త్‌డే సంద ర్భంగా అతనికో స్మాల్ ట్రీట్ ఇవ్వబో తున్నట్లు చెప్పి ఇన్వయిట్ చేసెయ్... దెబ్బకు ఫ్లాటవుతాడు"

"నా బర్త్‌డేనా... అదిప్పుడే ఎక్కడ... ఇంకా రెండ్నెల్లుంది" అన్నాను.

"కాదు, రేపే నీ బర్త్‌డే. ఫోన్ చెయ్" అంది.

"నువ్వు నాకు చెప్పినంత తేలిగ్గా... నేన తన్తో చెప్పగలనంటావా? " సందేహంగా చూశాను.

"చూడు అంజూ! నేచురల్‌గా ప్రేమ పుట్టేది దగ్గరితనంలోంచి. ఆ క్లోజ్‌నెస్ డెవ లప్ కావాలంటే అకేషన్ వుండాలి. ఆ సందర్భం అనేది ఒక్కోసారి కలిసొస్తుంది. ఒక్కోసారి మనం సృష్టించాలి"

శిల్ప చెప్పేది వింటున్నా.

"నీ ప్రేమ కాలక్షేపానికి బఠానీ గింజ లాంటి టీనేజ్ లవ్ కాదు. అనుకోకుండా మనసులోంచి పుట్టే అలౌకికమైన ప్రేమ కాదు. ఒక పర్పస్ కోసం... ఒక మనిషిలో ఒక మౌలికమైన మార్పు తేవడంకోసం చేసే ఒక మంచి ప్రయత్నం. ఆశయసాధనకోసం నువ్ కొన్ని సాహసాలు చెయ్యక తప్పదు. వేడిలో ఒక నిర్ణయాన్ని తీసుకున్నావ్. ఫలి తాన్ని పొందేవరకూ వేడి చల్లారకూడదు. చల్లారిందా అది నిర్ణయమే కాదు"

నేను రెండు చేతులూ జోడించి శిల్పకు నమస్కారం పెట్టి చెప్పాను "కర్తవ్యం బోధ పడింది తల్లీ. నువ్ చెప్పినట్టే చేస్తాగాని స్మాల్ ట్రీట్ అన్నావే... దాని వెన్యూ కూడా ఎక్కడో చెప్పి పుణ్యం కట్టుకో"

"ఏదైనా హోటల్లో పెట్టుకో" అంది.

"ఏ హోటల్ అనేది కూడా నువ్వే సజెస్ట్ చెయ్యకూడదూ? " అన్నాను.

"ఈ వూరు మనకి ఫెమిలియర్ కాదు గదా! ఓ పన్చెయ్! వెన్యూ అతన్నే డిసైడ్ చెయ్యమను" చెప్పిందది.

ఈ ఐడియా బాగానే వున్నట్టన్పించి కింద పోర్షన్ వైపు దారి తీశాను దిలీప్‌కి ఫోన్ చెయ్యడానికి.

★ ★ ★

గ్రేకలర్ శారీ కట్టుకుని అద్దాల చోళీ వేసు కున్నాను. అద్దం ముందు నిలబడి జడవేసు కుంటుంటే కింద పోర్షన్‌లోంచి ఓ ఆరెంజ్ కలర్ గులాబీని ఆకులతో పాటూ తెంపు కుని వచ్చింది శిల్ప.

దాన్ని నా జడలో పెడుతూ "దీనికి నేనో పేరు పెడుతున్నా" అంది.

"దేనికి? " అన్నాను దువ్వెనకున్న చిక్కు తీస్తూ.

"నీ లవ్ అఫైర్‌కి... 'ఆపరేషన్ లవ్‌స్టాం' బాగుందా? " అంది.

"ఏమిటో ఈ వ్యవహారమంతా ఎబ్బెట్టుగా అన్పిస్తోంది శిల్పా" అన్నాను.

"నీ ఇంజన్ మహా ట్రబుల్ సమ్. నెట్టా ల్సిందే" అంది అది నా భుజాలమీద చేతు లుంచి గుమ్మంవైపు నెడుతూ

"జోక్కాదు. నిజంగానే విసుగ్గా వుంది. ప్రేమను నటించడం చాలా కష్టం, అసహ్యం అని ఇప్పుడర్థమౌతోంది"

శిల్ప నా వైపు డీప్‌గా చూసింది. "ఇప్పు డెలా? అతను నీ కోసం హోటల్ దగ్గర వెయిట్ చేస్తుంటాడు. వెళ్ళకపోతే మర్యా దగా వుండదు"

నాకూ అలాగే అన్పించింది. "ఈసారికి వెళ్తాను. ఇంకెప్పుడూ ఇట్లాంటి ఎంగేజ్ మెంట్స్ పెట్టుకోను" శిల్పతో ఖచ్చితంగా అని... కాళ్లకు చెప్పులు వేసుకున్నాను.

నాతోపాటు గేటు వరకూ వచ్చింది శిల్ప.

రెబెకా సన్నీ మీద ఎక్కడికో బయలుదేర బోతోంది. నన్ను చూసి ఆగి "లిఫ్ట్ కావాలా? " అంది.

వద్దన్నాను. నేను చెయ్యబోయే పని నాకే ఇష్టంలేదు. దాన్ని ఇంకోరు నోటీస్ చెయ్యడం అస్సలిష్టంలేదు.

"బెస్టాఫ్‌లక్" అంది శిల్ప.

నవ్వి ముందుకు నడిచాను. పది గజాలు నడిచాక ఆటో ఎక్కాను.

తాజ్ ఇంటర్నేషనల్ ముందు ఆటో దిగి... దిలీప్ కోసం చుట్టూ చూశాను.

ఎక్కడా కనబడలేదు.

నా ఇన్విటేషన్‌కి అతను రెస్పాన్స్ ఇవ్వ లేదు. అంటే అంటే... నన్నతను చీప్‌గా అంచనా వేస్తున్నాడా!

కానీ నేను శిల్ప చెప్పినట్టు అతన్తో ఫోన్‌లో "ఆ లెటర్... మిమ్మల్ని ఉద్దేశించి రాసింది కాదన్నది నిజం. కానీ అది రాస్తు న్నంతసేపూ మీరు నా కళ్లముందు కదిలి పోయారన్నది ఇంకా నిజం" అని నేనం టుంటే అతను ఆనందంతో ఉక్కిరిబిక్కిరవు తున్న విషయం నాకు కనబడకపోయినా ఫోన్‌లో వినబడింది.

ఓ నిముషం పాటు అతనేం మాట్లాడలే కపోయాడు.

తరువాత నేనే "రేపు నా బర్త్‌డే... స్మాల్ ట్రీట్ ఇవ్వాలనుకుంటున్నా. కేవలం మీ ఒక్కరికే" అన్నాను.

"నిజంగా... నా ఒక్కడికేనా? " ఎగ్జయి టింగ్‌గా అడిగాడు.

అవునన్నాను. అప్పుడు నేనడక్కుండానే ఈ హోటల్ పేరు సజెస్ట్ చేశాడు.

"ఈవెనింగ్ ఆరున్నరంటే మీకు బిజీ అవ ర్సేమో" అన్నాను.

"నో ప్రాబ్లం. మీ బర్త్‌డే కంటే నా ప్రాక్టీస్ ముఖ్యం కాదు నాకు" అన్నాడు.

అట్లా అన్న మనిషి ఇప్పుడిట్లా గైర్‌హాజర్ అయ్యాడంటే...

"మెనీ మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ దడే" నా వెనక నుంచుని నా చెవిలో విష్పర్ చేశారె వరో. ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను.

మనోజ్ఞంగా నవ్వాడు దిలీప్.

పెళ్లి చూపుల్లో అంత పర్టిక్యులర్‌గా గమ నించలేదుగాని దిలీప్ మంచి అందగాడని ఇప్పుడే తెలిసింది నాకు.

"పదండి" హోటల్లోకి దారి తీశాడు.

పోర్ట్ మెట్లెక్కుతుండగానే నలుగురు హోటల్ సిబ్బంది ఎదురై పెద్ద ఫ్లవర్ బొకేని నా ముందుకు చాపి కోరస్‌గా గ్రీటింగ్స్ చెప్పారు.

ఈ ఏర్పాట్లన్నీ దిలీప్ చేసినవేనని అర్థ మైంది నాకు.

నా నిజమైన పుట్టిన్రోజును కూడా నేనె ప్పుడూ ఇట్లా సెలబ్రేట్ చేసుకోలేదు.

తల స్నానం చేసి కొత్త చీరె మాత్రం కట్టుకునే దాన్ని. అమ్మిచ్చిన పాయసం తాగి శిల్పతో కలిసి సినిమాకెళ్లేదాన్ని. వచ్చేప్పుడు ఏ ఐస్‌క్రీమ్ పార్లర్‌లోనో కూర్చుని ఐస్‌క్రీమ్ తినే వాళ్లం. అంతే.

ఆ హోటల్ సిబ్బంది నన్ను ఏ మీర్జా పూర్ జమీందారుగారి గారాలపట్టినో అన్నట్టు ముందుండి స్వాగతం పలుకుతూ బాగా అలంకరించిన ఓ టేబుల్ దగ్గరకు

తీసికెళ్లారు.

నా కళ్లు జిగేల్‌మన్నాయి.

ఆ టేబుల్ పరిసరాలన్నీ బెలూన్స్‌తో, క్రేప్ పేపర్ కటింగ్స్‌తో, గ్లిట్టరింగ్ మెటీరియల్‌తో చాలా రిచ్‌గా అలంకరించారు. టేబుల్ మీద పెద్ద కేకు అమర్చబడివుంది.

ఇదంతా నాకోసమే. నమ్మలేకపోయాను.

ఉద్వేగంగా ఎందుకిదంతా అన్నట్టుగా దిలీప్‌కేసి చూశాను.

"కూర్చోండి" అన్నాడతను.

అట్లా కూర్చున్నానో లేదో ఓ బెలూన్ని ఫట్ మన్పి పేల్చారెవరో.

నా తలనిండా తళుకుల వర్షం.

చప్పున అక్కడ వెలుగుతున్న షాండ్లియర్ ఆరిపోయింది.

"కేండిల్స్ వెలిగించండి" అన్నాడు దిలీప్.

మేచ్ స్టిక్ వెలిగించాను.

కేక్‌మీద ఒకే ఒక్క కేండిల్ వుంది. వెలిగించాను "మన పరిచయం ఇప్పుడేగా. అందుకే ఒక్క కేండిల్" చెబ్తూ టేబుల్ పైనే వున్న కేండిల్ స్టాండ్‌లోని కేండిల్స్ అన్నిట్నీ దిలీపే వెలిగించాడు.

"కేక్ కట్ చెయ్యండి" చెప్పాడతను.

నా ఫాల్స్ బర్త్‌డేని అతనంతగా సెలబ్రేట్ చేస్తాడని వూహించని నాకు చాలా గిల్టీగా అన్పించింది.

ఇట్లాంటి ఐడియా ఇచ్చిన శిల్ప మీద కోపం, దిలీప్‌మీద జాలి ఒక్కసారిగా కలిగాయి.

తాజ్ ఇంటర్నేషనల్లో ఇంత గ్రాండ్‌గా అరేంజ్‌మెంట్స్ చేశాడంటే ఎంత ఖర్చయ్యుంటుందో అంచనా వేస్తూ నెమ్మదిగా కట్ చేశాను. ఓ ముక్కని దిలీప్ చేతికి అందించాను.

"నోటికందిస్తే బాగుండేదేమో" అన్నాడతను.

నేను చిరుకోపంగా అతనికేసి చూసి ఓ ముక్క నోట్లో వేసుకున్నాను.

ఒక్కక్షణం తర్వాత నాకన్పించింది. ఇంతకీ నేను కదా అతనికి ట్రీట్ ఇవ్వాలనుకుంది. మరి అతనే నాకిస్తున్నాడేంటి?

ఆ మాటే అడిగితే అతను తేలిగ్గా నవ్వాడు.

నాకు రోషంగా అన్పించింది. మెనూ కార్డ్ అతని ముందుకు తోస్తూ "ఏం కావాలో చెప్పండి. నేను ఆర్డర్ చేస్తాను" అన్నాను మొండిగా.

నేనట్లా అంటుండగానే ఆర్డర్ చెయ్యాల్సిన అవసరం లేకుండా ఐటమ్స్ రానేవచ్చేశాయి.

ఇక మాట్లాడ్డం అనవసరం అని అర్ధమైంది. కేండిల్ లైట్ డిన్నర్ మొదలైన రెండు నిముషాల తర్వాత 'అతన్ని లైన్లో పెట్టడానికి కొన్ని చిట్కాలు చెబుతాను' అన్న శిల్ప మాటలు గుర్తుకొచ్చాయి.

"డిన్నర్ చేస్తుండగా ఎట్‌లీస్ట్ ఓ నిముషం పాటు డీప్‌గా అతని కళ్లలో కళ్లు పెట్టి చూడు"

శిల్ప మాటల్ని మననం చేసుకుంటూ మెల్లగా కళ్లెత్తి అతని వంక చూశాను.

సరిగ్గా అప్పుడే అతన్నాకేసి చూశాడు.

కంగారుగా కళ్లు పక్కకి తిప్పుకున్నాను.

కళ్లలోకి కళ్లు పెట్టి చూడ్డం శిల్ప చెప్పినంత తేలిక్కాదన్పించింది. అదొక ఆర్ట్. అందరికీ రాదు. నా వల్ల అస్సలు కాదు.

"పొరపాటున తగిలించినట్టుగా నీ చెయ్యో కాలో అతనికి తగిలించు"

పోనీ ఇది ట్రై చేద్దాం.

ముందు కాలు జరపబోయాను. బాగోదని ఆ నిర్ణయం మార్చుకుని ఓసారి నా ఎడం చేతి వేళ్లకేసి చూసుకున్నాను.

పాలిష్ చేసిన గోళ్లతో చాలా ముద్దుగా వున్నాయన్పించింది.

ఇప్పుడీ చేతిని మెల్లగా అతనికి తగిలించాలా? లేక చటుక్కున చూడనట్టుగా అతని చేతి మీద వెయ్యాలా?

ఛ... రెండూ బాగోవు. ఆక్వర్డ్‌గా వుంటాయ్.

ఇది కూడా నా వల్లకాదు.

"అతన్నవ్వునో, హెయిర్‌స్టైల్‌నో, టాకింగ్ స్టైల్‌నో కొంచెం ఓవర్‌గా పొగిడెయ్"

ఇదేదో కాస్త ఈజీగా వుందనుకున్నా.

అతనికేసి చూశా ఏ విషయంలో పొగిడితే టచింగ్‌గా వుంటుందో ఆలోచిస్తూ.

అతను నాకేసి చూస్తూ మెత్తగా నవ్వాడు.

అతని చూపు బాగుంది. నవ్వు బాగుంది.

రెండిట్లో దేన్ని అప్రీషియేట్ చెయ్యాలా అనుకుంటున్నంతలోనే అతనన్నాడు "ఏంటండీ... అంత డీప్‌గా చూస్తున్నారు? "

కంగారుపడ్డాను.

నాకు తెలీకుండానే అతనికేసి అందులోనూ అతని కళ్లలోకి డీప్‌గా చూశానా! అంటే శిల్ప సజెస్ట్ చేసిన మొదటి చిట్కాని వద్దనుకుంటూనే ఇంప్లిమెంట్ చేశానన్న మాట.

తడబడిపోయాను. పొలమారినట్టయింది. చప్పున మంచి నీళ్ల గ్లాసందుకోబోయాను. సరిగ్గా అదే సమయంలో అతనూ గ్లాసుకోసం చెయ్యి చాపాడు.

అనుకోకుండా శిల్ప చెప్పిన రెండో చిట్కా ఇంప్లిమెంటేషన్ జరిగిపోయింది.

గ్లాసుతోపాటూ అతని చేతిని గట్టిగా పట్టుకున్నాను.

అప్పుడతను నా వంక చూసిన చూపు రియల్లీ మార్వెలెస్. చూపులు తూపులై గుండెల్లో నాటుకోవడం అంటే ఏంటో అనుభవంలో కొచ్చింది.

చప్పున అతని చేతిని వదిలేసి సిగ్గుగా తల దించుకున్న నాతో అతనన్నాడు "థాంక్యూ వెరీమచ్"

"ఎందుకూ? " అని నేనడగలేదు ఎందుకో నాకు తెలుసుకాబట్టి. ఆ తర్వాత డిన్నర్ ఎట్లా పూర్తి చేశానో, అక్కడ్నుంచి ఎట్లా ఇంటికి చేరుకున్నానో నాకే తెలీదు.

ఆ రాత్రంతా నాకన్నులు నిద్రపట్టలేదు.

★ ★ ★

ఏ తెల్లవారుఝామున నిద్రలోకి జారానో మరి, బాగా పొద్దెక్కాక మెలకువొచ్చింది నాకు.

లేవగానే శిల్ప కాఫీ అందించింది.

శిల్పకి మహా బద్ధకం. రోజూ అయితే నేనే కాఫీ కప్పుతో దానికి సుప్రభాతం పాడాలి. ఇవాళది రివర్సయింది.

"లేపకూడదూ... మరీ ఎనిమిదైనట్టుంది" అన్నాను కాఫీ సిప్‌చేస్తూ.

"రాత్రంతా దీపూ... దీపూ అని కలవరిస్తూ కలతనిద్ర పోయిన ప్రాణిని... అంత కర్కశంగా లేపబుద్ధికాలేదు. పాపం... పోన్లే అనుకుని దయతల్చి కాఫీ పెట్టాను" అంది.

నిజంగా కలవరించానా... లేక అది ఆట పట్టిస్తోందా అర్థంకాలేదు.

అందుకే దానికేసి కోపంగా చూశాను.

"కోపం తర్వాత. టైంలేదు. లేచి ఉప్మా చెయ్" చెప్పిందది.

"ఇవాల్టికి నువ్ చెయ్యవే. స్నానం చేస్తాను" అన్నాను.

"కాఫీ... ఉప్మా... రెండూ నేనేనా... అన్యాయం" అంటూనే అది కిచెన్‌వైపెళ్లింది.

నేను హాయిగా నిట్టూర్చి బాత్‌రూమ్‌లో దూరాను. స్నానం కానిచ్చి వచ్చేసరికి శిల్ప రెండు ప్లేట్లలో దోశలు సర్ది వుంచింది.

ఉప్మా కదా చేస్తానన్నది ఈలోపు దోశలెట్లా వచ్చాయ్ అని నేననుకుంటుండగానే అది చెప్పింది "జెరీనా ఆంటీ టిఫిన్ పంపారు" అని. ఇద్దరం టిఫిన్ చేసి రెడీ అయిపోయి యూనివర్శిటీకి బయలుదేరాం. ఇంటికి తాళంవేసి మెట్లు దిగుతుంటే నర్గీస్ ఎదురొచ్చి "మీకు ఫోన్" అంది నాతో

నాన్నేమో అనుకున్నా. నా వూహ కరెక్టే. నాన్న చేసిన ఎస్టీడీ కాల్ అది.

నా యోగక్షేమాలడిగాక... అమ్మమ్మ వచ్చిందనీ నన్ను చూడాలంటోందనీ... రెండురోజులు సెలవు పెట్టి రావడానికి

వీలుంటుందా అని అడిగాడు. క్లాసులు రెగ్యులర్‌గా జరుగుతున్నాయనీ, రావడానికి కుదరదని చెప్పి... అమ్మమ్మకి ఫోనివ్వమన్నాను. అమ్మమ్మ నిష్టూరమాడింది. "పెళ్ళి చేసుకుని నలుగురు పిల్లల్ని కనాల్సిన వయసులో ఎందుకొచ్చిన చదువులు" అంది.

పెళ్ళి చేసుకుంటాగాని నలుగుర్ని మాత్రం కనననని చెప్పాను.

"పరాచికాలకేంగాని... పిట్ట మెతుకు లేనా... కడుపుకింత అనువుగా తింటున్నావా? " అంది.

పిట్టమెతుకులే అమ్మమ్మా... కడుపు చూసుకుంటే ఫిగరు పాడవుతుంది. ఆనక నన్నెవడు చేసుకుంటాడూ? " అన్నా.

అమ్మమ్మ "ఏం కాలమో! ఏం పిల్లలో" అని నిట్టూర్చి "ఇంతకీ ఇప్పట్లో రానంటావ్ " అంది. వచ్చేనెల సెలవులిస్తారు అప్పుడొస్తాలే అని అమ్మకు ఫోనిమ్మన్నాను. అమ్మతో రెండు మాటలు మాట్లాడి ఫోన్ పెట్టేశాను.

ఇద్దరం హడావిడిగా బస్టాప్‌కెళ్లేసరికి యూనివర్శిటీ కేంపస్‌వైపెళ్లే బస్ జస్ట్ మిస్సయింది. ఇంకో బస్ పట్టుకుని వెళ్ళొచ్చుగాని లేటవుతుంది.

"ఛ... నా సన్నీ పంపించమని డేడీకెన్నిసార్లు ఫోన్‌చేసినా పంపరు" సణుక్కుంది శిల్ప.

"ఎన్నిసార్లు చేశావే? రెండు సార్లేమో చేశావ్" అన్నాను. శిల్ప ఏదో అనబోతున్నంతలో ఓ సియోలో కారు సర్రున దూసుకొచ్చి మా ముందు ఆగింది.

'ఇది దీలీప్ కారు కదూ' అనుకుంటున్నంతలో... డ్రైవింగ్ సీట్లోవున్న దిలీప్ తల బయటకు పెట్టి "యూనివర్శిటీకేగా... రండి డ్రాప్ చేస్తాను" అన్నాడు.

నేను శిల్పవైపు చూశాను. అది నావైపు "డోంట్ మిస్ ద ఛాన్స్" అన్నట్టు చూసింది.

నాకూ ఎక్కాలనే అన్పించిందిగాని ఫార్మల్‌గా "పర్లేదండీ బస్‌లో వెళతాం" అన్నాను.

"నథింగ్ డూయింగ్" అన్నాడతను.

ఇద్దరం బ్యాక్ సీట్‌లో కూర్చున్నాం.

"నువ్ ఫ్రంట్ కెళ్ళవే" అంది శిల్ప.

"అంతొద్దు... ఇది చాలు" అన్నాను హిట్లర్‌లో చిరంజీవిలా.

కారు మోడరేట్ స్పీడ్‌లో మెత్తగా వెళుతోంది. దిలీప్ ఒకటిరెండుసార్లు నాకేసి చూశాడుగాని ఏం మాట్లాడలబ్బా అని ఆలోచిస్తున్నంతలో అతనే నోరు విప్పాడు. అయితే మాట్లాడింది నాతో కాదు శిల్పతో.

"ఎలా వుందండీ ఆరోగ్యం" అన్నాడు.

"ఈ రోగసుందరిని మర్చిపోయాడేమిటా అనుకున్నా... పర్లేదు... గుడ్ రికలెక్టింగ్ పవర్" అంది శిల్ప నాతో గుసగుసగా.

"మిమ్మల్నే... ఎలా వుంది మీ హెల్త్" అన్నాడు మళ్ళీ ఓ సైడ్ టర్నింగ్ ఇచ్చి

అంతవరకూ డైనమిక్‌గా వున్న శిల్ప నీరసంగా సీటుకి చేరబడి విషాదంగా నవ్వి... ఓసారి దగ్గి చెప్పింది "నో ప్రోగ్రెస్"

"మోహన్‌గారి యాటిట్యూడ్‌లో ఏదైనా మార్పొచ్చిందా? "

"ఆ... వచ్చింది" చెప్పింది శిల్ప.

అతను ఒక్కక్షణం వెనక్కి తిరిగి చూశాడు. కళ్లలో కాస్త గర్వం, ఆనందం తొణికిసలాడాయి.

"గుడ్... ఏమంటున్నాడు? " మళ్ళీ స్టీరింగ్ మీదికి దృష్టిసారిస్తూ చెప్పాడు.

"అప్పుడయితే రోజుకో సారి ఐ లవ్ యూ చెప్పేవాడు. ఇప్పుడు గంటకోసారి చొప్పున రోజుకు ఇరవైనాలుగు సార్లు చెబుతున్నాడు"

అతను సడన్‌గా కారాపాడు. శిల్పమీద కోపంతో అనుకున్నాను. కానీ నా అంచనా తప్పని ఎర్రగా వెలుగుతున్న సిగ్నల్ లైట్ చెప్పింది.

అతను వెనక్కి తిరిగి... శిల్పకేసి చూశాడు "ప్రేమమైకంలో పడిన అతనికి

వాస్తవాలు అర్థంకాకపోవచ్చు కనీసం మీరైనా అర్థంచేసుకోండి"

"నన్నేం చెయ్యమంటారు? " నిస్సహాయంగా చూసింది శిల్ప.

"సింపుల్. మీరతని ప్రేమను యాక్సెప్ట్ చెయ్యకండి. ఎందుకంటే అతన్ని పెళ్ళాడి... అతని జీవితాన్నీ, రోగగ్రస్థులైన పిల్లల్ని కని ఈ సమాజాన్నీ నాశనం చేసే హక్కు మీకు లేదు"

"కాస్త కారాపుతారా? " అడిగింది శిల్ప.

అతనాపాడు. శిల్ప దిగి అతనితో చెప్పింది "నేను బస్‌లో వస్తాను. మా అంజూని డ్రాప్ చెయ్యండి"

నేనూ దిగబోతుంటే అది సైగచేసి వారించింది.

అర్థంచేసుకుని సర్దుక్కూర్చున్నాను.

అతను కార్ని పోనిస్తూ "మీ ఫ్రెండ్‌కి నా మీద కోపమొచ్చినట్టుంది" అన్నాడు.

నేను జవాబు చెప్పలేదు.

ఓ నిముషం తర్వాత అతను వున్నట్టుండి అడిగాడు. "నేనో మాటడుగుతాను. నిజం చెబుతారా? "

ఏంటన్నట్టు చూశాను.

"రాత్రి మీకు నిద్రపట్టిందా? "

నా చెంపల్లో వెచ్చటి ఆవిర్లు. "ఉహు" అన్నాను అసంకల్పితంగా.

"నాదీ అదే పరిస్థితి" చెప్పాడతను.

ఎందుకట్లా అన్నానా అన్పించింది.

కుడి చేత్తో స్టీరింగ్ తిప్పుతూనే ఎడంచేతిని షర్ట్‌జేబులోకి పోనిచ్చి మడతపెట్టిన ఓ కాగితాన్ని తీసి నాకందించాడు.

అప్రయత్నంగా అందుకున్నాను.

"రాత్రి మీ గురించే ఆలోచిస్తూ... ఎప్పటికో నిద్రపోయాను. ఓ విచిత్రమైన కలొచ్చింది. ఉదయాన్నే లేచి దాన్ని కాగితం మీద రాశాను. నాకు సాధారణంగా కలలు రావు. వచ్చినప్పుడు నా కట్లా రాసుకోడం అలవాటు. మీరు నా కలని ఇంటర్‌ప్రెట్ చెయ్యగలరేమో చూడండి"

నేను ఆసక్తిగా కాగితం మడతలు విప్పాను.

"నేను టెర్రస్‌మీద నిలబడి ఆకాశంలోకి చూస్తూ వున్నాను. ఆకాశం చీకట్లో నల్లగా వుంది. ఒక్క నక్షత్రం కూడా లేదు. నేనట్లాగే చూస్తున్నా. ఉన్నట్టుండి ఆకాశంలో చిన్న దివ్వెలాంటిది వెలిగింది. క్రమంగా ఆ వెలుగు పెద్దదైపోతోంది. అది నా వైపే వస్తోంది. ఎటుచూసినా వెలుతురు. కళ్ళు జిగేల్మంటున్నాయి. ముఖానికి అరచేతులు అడ్డుపెట్టుకున్నాను. అయినా అది నా కళ్లలోకి చొచ్చుకొని పోతోంది. ఆ కాంతిని భరించలేక చప్పున కళ్ళు తెరిచాను"

చదివేసి కాగితాన్ని మడుస్తుంటే అతనడిగాడు.

"దానర్థం ఏంటంటారు? "

"ప్చ్... నాకేం తోచట్లేదు" పెదవి విరిచాను.

అతనేం మాట్లాడలేదు. నేను "ఆలోచిస్తాలెండి" అన్నాను.

"ష్యూర్... టేక్ యువరోన్ టైమ్"

అతను కారాపాడు. అతను కారాపాక గాని యూనివర్సిటీ కాంపస్ వచ్చినట్టుగా గమనించలేదు నేను.

అతను నాకన్నా ముందే కారు దిగిపోయి డోర్ తెరిచి పట్టుకున్నాడు.

నేను దిగి అతనికి 'థాంక్స్' చెప్పి "మీ కలని నా దగ్గరుంచుకోవచ్చా" అన్నాను మడతపెట్టిన పేపర్ని అతనికి చూపిస్తూ.

"నేను కలలుకంటున్నది మీకోసమేగా" అన్నాడు.

నేన్నవ్వి... కేంపస్‌వైపు అడుగులేస్తూ అనుకున్నాను "మాంచి రొమేంటిక్ ఫూల్"

★ ★ ★

నాకు చాలా ఆనందంగా వుంది విల్సన్ అంకుల్ దిలీప్ కొచ్చిన కల అర్థం చెప్పిన దగ్గర్నుండీ.

నాకూ దిలీప్‌కీ మధ్య జరిగిన ప్రతి విషయాన్నీ నేను వున్నదున్నట్టు కాకపోయినా

సింపుల్‌గా ఎంతవరకు చెప్పాలో అంతవ రకు నేనాయనకు చెబుతూనే వున్నాను.

రాత్రి భోజనాల తర్వాత అంకుల్... ఆంటీ... టెర్రస్‌మీద కూర్చుని... బాతాఖానీ వేస్తుంటే... నేనూ, శిల్పా వెళ్ళి జాయిన్ అయ్యాం. అప్పుడే అడిగాను.... ఆయన్ని... దిలీప్ కల గురించి.

ఆయనో క్షణం ఆకాశం వంక చూసి ఆనక నావైపు తిరిగి గంభీరంగా అన్నాడు "అసలు కలలపట్ల నీ అభిప్రాయమేంటి అంజూ? "

నేనెప్పుడూ కలల గురించి అంత డీప్‌గా ఆలోచించలేదు. వాటి పట్ల నాకు ఓ అభి ప్రాయమంటూ ఏం లేదని అనుకోవాలి. అందుకనే "పర్టిక్యులర్‌గా ఓ అభిప్రాయ మంటూ లేదంకుల్. అయితే కొన్ని కలలు నిజమౌతాయి అన్న మాటను మాత్రం నేన్నమ్ముతాను"

"నేనూ అంతేరా. కలల గురించి నాకు పెద్దగా తెలీదు" అన్నాడాయన.

ఈ మాట చెప్పడానికా ఇంత ఫోజు అను కున్నాను. శిల్పయితే "పోండంకుల్... దీనికా ఇంత బిల్డప్ ఇచ్చారు" అంది.

"డోంట్ గెట్ డిస్కరేజ్డ్. మీకో కలల అనలిస్ట్‌ని పరిచయం చేస్తాగా" అన్నాడా యన.

"ఎప్పుడంకుల్" అడిగింది శిల్ప.

"ఇప్పుడే" అంటూ ఆయన జెరీనా ఆంటి వైపు చూశాడు.

"చాల్లెండి వేళాకోళం" అందామె.

అంకుల్ పరిచయం చేస్తానన్న అనలిస్ట్ ఎవరో అర్థమైంది నాకు.

"మీరు చెప్పగలరా ఆంటీ? " అడిగాను ఆసక్తిగా.

"చెప్పగలరా!" ఆయన రెట్టిస్తూ అన్నాడు. "పెళ్ళికాకముందు నేను మీ ఆంటీకోసం రోజుకు సగటున ఐదారు కలలు కనేవాడ్ని. వాటన్నిటికీ... అర్థం చెప్పింది ఆవిడేగా"

జెరీనా ఆంటీ ఆయనకేసి కోపంగా చూసింది.

"ప్లీజాంటీ... మీకు తెలిస్తే చెప్పండాంటీ" శిల్ప గారంగా అడిగింది.

"మీ ఆంటీ ఎమ్మే సైకాలజీ. ఫ్రాయిడ్ డ్రీమ్ అనాలసిస్‌ని ఔపోసన పట్టింది" చెప్పాడాయన.

"నిజమా ఆంటీ... మీరు ఎమ్మే సైకాల జీనా? " ఆశ్చర్యంగా అడిగాడు.

ఒక మామూలు హౌస్‌వైఫ్‌లా వుండే ఆవిడ దిలీప్ కలకి అర్థం చెప్పిన తీరు చూశాక. "మీరు ఎమ్మే సైకాలజీనా? " అని ఎందుకడిగానా అని ఫీలయ్యాను.

"ఎక్కడో గుండె అట్టడుగుపొరలలో... ఐ మీన్ సబ్‌కాన్షస్‌లో అణిచివేయబడిన కోర్కె లను బయటకుతీసుకువచ్చే సాధనం కల. కలలో వుండే విషయం ఐ మీన్ డ్రీమ్ కంటెంట్ అనేది, ఒక వ్యక్తికి తెలియకుం డానే ఆ వ్యక్తిలోనే దాగిన ఆశకు ప్రతీక అంటాడు ఫ్రాయిడ్. ప్రతి మనిషిలో ఆ కోర్కెలకు కళ్లెంవేసే సెన్సార్స్ వుంటాయి. ఆ సెన్సార్స్ ఆ వ్యక్తిలో ఆ కోర్కె నిద్రాణ మైవున్న సంగతిని ఆ వ్యక్తికే తెలియనివ్వ కుండా అడ్డుపడతాయ్. అయితే నిద్రలో... సెన్సార్స్ కాస్త ఏమరుపాటుకు లోనవు తాయ్. దాన్ని ఛాన్స్‌గా తీసుకుని, అచేతనా వస్థలో వున్న ఆ వ్యక్తి కోర్కెలు స్వప్నా లుగా బయటపడతాయ్. కానీ సెన్సార్స్ ఏమరి వున్నప్పుడు కూడా ఆ కోర్కెలను యథాతథంగా బయటకు రానీయవు. అందుకే ఆ సెన్సార్స్‌కు భయపడిన ఆ కోర్కెలు మారువేషాలలో కలలుగా వస్తాయ్.

ఫరెగ్జాంపుల్... ఒక వ్యక్తి... సము ద్రాన్ని ఈదుతున్నట్టు కలగన్నాడంటే... జీవితంలో ఎదురయ్యే ఎంతటి కష్టాన్న యినా ఎదురీదాలన్న కోర్కె అతని సబ్‌కా న్షస్‌లో వుందని అర్థం.

కలని వున్నదున్నట్టు చెబితే... దాన్ని మేనిఫెస్ట్ డ్రీమ్ అంటారు. దానిలో గుప్తమై

వున్న అర్థాన్ని చెబితే దాన్ని లేటెంట్ డ్రీమ్ కంటెంట్ అంటారు.

దిలీప్ కొచ్చిన కలలో... నల్లటి ఆకాశంలో చిన్న దివ్వె వెలగడం... ఆ కాంతి క్రమంగా ప్రకాశవంతమై అతని కళ్లని మిరుమిట్లు గొల్పడం అనేది మేనిఫెస్ట్ డ్రీమ్.

ఇక దాని అంతరార్థాన్ని గురించి ఆలోచిస్తే... నల్లటి ఆకాశం. అతని మనసు దివ్వె అనేది ప్రేమకు సంకేతం. అది కాస్తగా ఆరంభమై ఉధృతమైంది. ఆ విషయాన్ని అతను వాస్తవంలో గుర్తించలేకపోవడానికి కారణం అతనిలోని సెన్సార్స్. అతనికో ఎయిమ్ వుంది. భవిష్యత్తులో... శారీరకంగా ఎటువంటి లోపంలేని ఒక హెల్దీ సొసైటీని సృష్టించాలన్న తపన. ఆ తపన మాటున అతనిలోని 'ప్రేమ'భావన అణగారిపోయి అచేతనంలో వుండిపోయింది. నిన్ను చూశాక అతని అచేతనంలో ఘర్షణ మొదలైంది. ఫలితంగా అతనిలోని కోర్కె అంటే నీపట్ల వున్న ప్రేమ దివ్వెగా మారువేషం వేసుకుని బయటకు వచ్చింది. అది క్రమంగా కాంతివంతమై అతన్ని వూపిరి సలపనియ్యకుండా చేస్తోంది. దాన్ని కాన్షస్‌లో గ్రహించనీయకుండా అతనిలోని సెన్సార్స్ అడ్డుపడుతున్నాయ్. కానీ ఓ రోజొస్తుంది. అతని సబ్‌కాన్షస్‌లో నీ పట్ల నిద్రాణమైవున్న ప్రేమ అతని కాన్షస్‌ని జయించే రోజు తప్పకుండా వస్తుంది. ఐ విష్ యు ఆల్ ద బెస్ట్" అంది జెరీనా ఆంటీ.

నాకు ఆకాశంలో తేలిపోతున్నట్టుగా వుంది. 'అయితే దిలీప్...నాతో ప్రేమలో పడ్డాడన్న మాట.

ఆంటీకి థాంక్స్ చెప్పి నేనూ, శిల్పా ఇంట్లోకొచ్చేశాం.

చెరో గ్లాసూ పాలు తాగి పడుకున్నాం.

"జెరీనా ఆంటీ అందమైందే కాదు. తెలివైంది కూడా. విల్సనంకుల్ అదృష్టవంతుడు" అంది శిల్పా.

దిలీప్ గురించే ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాను.

ఆ రాత్రి నాకో కలొచ్చింది.

"నాకూ దిలీప్‌కీ పెళ్ళయిపోయింది. నేను నిండు నెలలతో వున్నాను. ఉన్నట్టుండి పెయిన్స్ మొదలయ్యాయి. భయంకరమైన బాధ... వెర్రి కేకలు వేస్తున్నాను. విపరీతమైన దాహం. కాసేపటికి డెలివరీ అయింది. బిడ్డనెవరో నా చేతుల్లో వుంచారు. వాడికి కళ్లులేవు. వాటి స్థానంలో ఒట్టి గుంటలున్నాయ్"

కెవ్వున అరిచి లేచి కూర్చున్నాను. ఒళ్లంతా చెమటతో తడిసి ముద్దయిపోయింది. శిల్పలేచి లైట్ వేసింది. నా వెన్ను తట్టి మంచి నీళ్ళిచ్చింది.

"ఏదైనా పీడకలా? " అడిగింది శిల్ప.

అవునన్నట్టు తలూపి పడుకున్నా. నాకెందుకో అప్పటికప్పుడు ఆ కలని చెప్పాలన్పించలేదు. గుర్తుచేసుకోవడానిక్కూడా నేనిష్టపడలేదు.

శిల్పకూడా... ఇంకేం అడక్కుండా పడుకుంది.



ఉదయాన్నే లేచి యూనివర్శిటీకి రెడీ అవుతున్నానన్నమాటేగాని... మనసేం

బాగోలేదు.

పదేపదే ఆ కల నన్ను వెంటాడుతోంది.

శిల్ప... "ఏంటట్లా వున్నావ్? ఆ కలేంటో చెప్పు" అన్నా కూడా నేను చెప్ప లేదు.

శిల్ప నాకన్నా ముందుగా రెడీ అయి పోయి ముందు గదిలో కూర్చుని న్యూస్‌పేపర్ తిరగేస్తోంది.

నేను జడల్లుకుంటూ బాల్కనీలో నిలబడి వున్నాను. శిల్ప "మైగాడ్... హౌ బార్బేరియస్" అంది పేపర్లోంచి. తలెత్తి బాల్కనీలో వున్న నాకేసి చూస్తూ.

ఏంటన్నట్టు చూశాను.

"చెప్పడానికే నోరాడ్డంలేదంజూ. ఎయిడ్స్ సోకిందన్న కారణంతో ఒక స్త్రీనీ... ఆమె నెలల పసికందునీ కిరోసిన్ పోసి తగలబెట్టారట"

"ఎక్కడ" అన్నాను ఆదుర్దాగా.

చెప్పిందది.

"భర్తలేడా?"

"ఎందుకు లేడు? ఇంకో కూతురు కూడా వుందట. అతని అన్నదమ్ములే ఆమెను తగలబెట్టింది. భర్తనీ, ఆ ఇంకో బిడ్డని మాత్రం ఏం చెయ్యలేదట"

"చూస్తూ వాడెట్లా వూరుకున్నాడు?"

"వాడూరుకోవడం కాదిక్కడ ట్రాజెడీ... గ్రామం గ్రామమే నోరు మూసుకుందట. పైగా తమ గ్రామానికి ఎయిడ్స్ రోగి పీడ విరగడైనందుకు సంతోషించార్ట అక్కడి ప్రజలు"

నేను శిల్ప చేతిలో పేపర్ లాక్కున్నట్టుగా తీసుకుని ఆ వార్తని మళ్ళీమళ్ళీ చదివాను.

కాల్చినా కూడా ఆమె ప్రాణం పోలేదట. కాస్త వూపిరి ఉండగానే ఆమె శవాన్ని బిడ్డతో పాటు పూడ్చిపెట్టారట.

నా ఒళ్ళు గగుర్పొడిచింది.

"నువ్ స్నానానికెళ్లినప్పుడు నేను టిఫిన్ లాగించేశాను. బాగా ఆకలేసింది అంజూ, ఆగలేకపోయా. నువ్ కానీ" అంది శిల్ప టిఫిన్ ప్లేట్ అందిస్తూ.

"వద్దు శిల్పా" అన్నాను.

"ఏం? ఆకల్లేదా?" అంది.

"ఆకలుందో లేదో తెలీట్లా. తినాలని మాత్రం లేదు"

"ఆ న్యూస్ చదివి అప్‌సెట్ అయ్యావా?"

"ఏమో" అన్నాను.

"రోజుకో ఘోరం జరుగుతూనే వుంటుందీ లోకంలో. రోజూ అన్నం తినడం మానేస్తావా?"

"అబ్బ శిల్పా! బయల్దేరు" అన్నాను విసుగ్గా.

"రేపట్నుండీ న్యూస్ పేపర్ వెయ్యొద్దని చెప్తా పేపర్ బోయ్‌కి" కోపంగా అంది.

"సరే" అంటూ నేను బయటకు నడిచాను. శిల్ప సణుక్కుంటూ టిఫిన్ ప్లేట్ తీసేసి నా వెనకాలే వచ్చింది.

బస్టాప్‌లో నిలబడ్డాం. కేంపస్ వైపెళ్లే బస్సూ, దిలీప్ కారూ రెండూ ఒకేసారి వచ్చాయి.

"నీ మిస్టర్ డిసీజ్ కారు చస్తే ఎక్కను" అంది శిల్ప బస్ వైపు అడుగులేస్తూ.

నేనూ శిల్పతోపాటు బస్సెక్కుదాం అనుకుంటూ శిల్ప వెనకాలే నడిచాను.

"ఫీలవుతాడు. నువ్వెళ్లు" అందది.

నాకెందుకో ఇవాళ దిలీప్‌ని చూస్తుంటే చిరాగ్గా అన్పించింది "అయితే అవనీ" అన్నాను.

"ఇదెక్కడి గోడవరా బాబూ! మనం అనుకున్నదేంటీ, నువ్ చేసేదేంటీ. నీతోపాటు రోజూ నేను కూడా అతనికి కంపెనీ ఇస్తే దిలీప్ ఇద్దరితోనూ లవ్‌లో పడే ప్రమాదముంది. అట్లా జరిగిందో, నేను మాత్రం చస్తే నీకోసం త్యాగం చెయ్యను" అంది శిల్ప.

పక్కున నవ్వాను. మనసులో దిగులు అంతా పోయినట్టన్పించింది.

శిల్ప బస్సెక్కేసి కొంటెగా కన్నుగీటింది.

"కళ్లు పీకేస్తాను" అని బెదిరించి దిలీప్ కార్‌వైపు నడిచాను.

"మీ ఫ్రెండ్‌కి నన్ను చూస్తే భయం" అన్నాడు దిలీప్ నవ్వుతూ.

'నీ మొహం' అనుకున్నాను.

సీట్లో నేను సర్దుక్కూర్చున్నాక కార్ స్టార్ట యింది.

"వాటెబౌట్ మై డ్రీమ్? ఏమైనా తోచిందా? " అన్నాడు.

అతనట్లా అడగ్గానే చప్పున నాకొచ్చిన కల గుర్తుకొచ్చింది. వెనువెంటనే న్యూస్ పేపర్లో వచ్చిన సంఘటన మనసులో మెదిలింది.

ఆ న్యూస్ ఇతను చదివుంటాడా? చదివి ఎలా స్పందించి వుంటాడు.

"ఏంటాలోచిస్తున్నారు? " అడిగాడతను.

"నేనివాళ ఓ న్యూస్ చదివాను. ఎయిడ్స్ పేషెంట్ నొకామెను ఆమె బిడ్డతో సహా తగలబెట్టేశారట ఆమె బంధువులే"

"యాఁ... చదివాను" అన్నాడతను.

ఇంకేమైనా అంటాడేమోనని ఒక్క నిముషం వెయిట్ చేసి అతనేం అనకపోవ టంతో నేనే అన్నాను

"దారుణంకదూ!"

అతను గాఢంగా నిట్టూర్చాడు "వినటానికి బాధగానే వుండొచ్చు అజంతా. కానీ ప్రాక్టిక ల్‌గా ఆలోచిస్తే నో అదర్‌గో. ఆ జబ్బు అలాంటిది. అది వచ్చిన వ్యక్తికి సమా జంలో బతికే అర్హత లేదు"

అతను చెప్పేది రైటూ... నా ఆలోచన తప్పా? లేక నా ఆలోచన రైటూ అతను చెప్పేది తప్పా?

నా మెదడో క్షణం స్తబ్దుగా అయిపో యింది. అతను చెప్పేది మెడికల్ లాంగ్వే జ్‌లో నిజమే కావచ్చు కానీ ఒక దారుణ సంఘటన పట్ల స్పందించే తీరు మాత్రం అది కాదన్పించింది.

"ఇంతకీ నా డ్రీమ్‌ని మీరు ఇంటర్‌ప్రెట్ చెయ్యనేలేదు" అన్నాడతను.

నేనతని మాటల్ని పట్టించుకోనట్టుగా కసిగా అన్నాను "ఆమె భర్తనీ... ఇంకో బిడ్డనీ కూడా కాల్చి చంపుంటే సమాజానికి ఇంకా మేలు జరిగేది. ఎందుకొదిలేశారో వాళ్లని"

"అబ్బ... ఇక ఆ విషయం వదిలెయ్ అజంతా" అన్నాడు దిలీప్.

అతని స్వరంలో ధ్వనించిన విసుగుని కనిపెట్టేశాన్నేను.

దిలీప్ కన్న కలకి జెరీనా ఆంటీ చెప్పిన అర్థాన్ని చెప్పాలావద్దా అని కొంచెంసేపు నాలో నేను ఆలోచించుకుని చివరికి చెప్పా లనే నిర్ణయానికొచ్చాను.

ఆంటీ చెప్పిన అనాలసిస్ అంతా చెప్ప కుండా కేవలం కలకి అర్థం మాత్రం క్లుప్తంగా చెప్పాను.

"అయితే నేన్నిన్ను ప్రేమిస్తున్నానన్న మాట" దిలీప్ ఉత్సాహంగా అన్నాడు.

"మీ కల అర్థం అదేనట. ఓ డ్రీమ్ అన లిస్ట్ చెప్పారు"

దిలీప్ నా కళ్లలోకి డీప్‌గా చూశాడు "అయితే ఇంకా ఆలస్యం దేనికి? "

'ఆలస్యం ఎందుకనటం' ఒకవేళ పెళ్లి గురించేమో అనుకున్నా. అనుకున్న వెంటనే నా చెంపలు ఎరుపెక్కాయేమో అన్న అను మానం కలిగి ఆ ఎరుపులు అతని కంట పడకుండా వుండటానికి కర్చీఫ్‌తో ముఖం తుడుచుకున్నట్టు నటిస్తూ చెంపల్ని అందులో దాచాను.

"ఆలస్యం దేనికంటుంటే ఏం చెప్పవే మిటి? " అన్నాడు.

"దేనికి ఆలస్యం? " అన్నాను అతన్నుండి పెళ్లి అన్న పదాన్ని ఎక్స్‌పెక్ట్ చేస్తూ.

నేనూహించింది కరెక్టే. అతను "మనపె ళ్లికి" అన్నాడు. ఇక నా చెంపల ఎరుపుని కర్చీఫ్‌లో దాయడం అసాధ్యమైపోయింది.

ఒక్క జర్క్‌తో కారాగింది. అదేంటో అతను కారాపేవరకూ కేంపస్ వచ్చిన విషయం నాకు తెలీనే తెలీదు. అతని కారె క్కిన ప్రతిసారీ ఇలాగే జరుగుతోంది.

అతని సన్నిధిలో అంతగా మైమరచి పోతున్నానా?

నేను కారు దిగాను. అలవాటుగా థాంక్స్ చెప్పి కేంపస్ వైపు నడవబోతుంటే దిలీప్ పిలిచాడు.

"అజంతా"

"ఊఁ" అన్నాను వెనుదిరిగి.

"ఆ డ్రీమ్ అనలిస్ట్ చెప్పినట్టు నేను నీ ప్రేమలో గాఢంగా పడిపోయాను. నిన్ను విడిచి ఇక ఒక్కక్షణం కూడా వుండలేనేమో అన్పిస్తోంది. నీ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ ఇచ్చావంటే లైన్ క్లియరైపోయినట్టే. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా మన పెళ్లి జరిగిపోతుంది. ప్లీజ్... ఆలశ్యం చెయ్యకు"

నా చేతిని అందుకుని సుతారంగా ముద్దు పెట్టుకుని దిలీప్ వెళ్లిపోయాడు.

అంతకు కొద్దిక్షణాల క్రితం అతని సాన్నిధ్యంలో నేననుభవించిన మైమరపు ఇప్పుడు మచ్చుకైనా నాలో లేదు.

అతను ముద్దు పెట్టిన నా అరచేతి వంక ఆలోచనగా చూసుకున్నా.

అతని ముద్దు నాలో ఎలాంటి పరవశాన్నీ కల్గించలేదన్నది నాకు స్పష్టమైపోయింది.

★ ★ ★

యూనివర్శిటీ లైబ్రరీలో నేనెప్పుడూ అలవాటుగా కూర్చునే నా ఫేవరెట్ ప్లేస్‌లో కూర్చుని నా సబ్జెక్ట్‌కి సంబంధించిన రెఫరెన్స్ బుక్స్ చదువుతున్నాను.

కళ్లు పుస్తకంలో వున్నాయేగాని మనసెక్కడో వుంది.

దిలీప్‌ని కొన్నాళ్లుగా తప్పించుకుని తిరుగుతున్నాను. బస్టాప్ దగ్గరగానీ ఫోన్‌లో గానీ అతనికి చిక్కకుండా మేనేజ్ చేస్తున్నాను.

'నేన్నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నా. నిన్ను విడిచి బతకలేను. సో... నీ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ ఇస్తే... అంతా ఓకే అయితే నేన్నిన్ను పెళ్లి చేసుకుంటా' అన్న అతని మాటల్లో ప్రేమ గాఢంగా కాదుగదా ఆవేశమాత్రంగా కూడా లేదన్పించింది. ఆ రోజు నుండీ నాకతన్ని కలవాలనిగానీ మాట్లాడాలనిగానీ అన్పించటంలేదు. రాత్రి శిల్పకి విషయం చెప్పి "దిలీప్‌తో ప్రాక్టికల్స్ చెయ్యటం వేస్టే. అతని భాషలో అతను నన్నెంత గాఢంగా ప్రేమించినా... నా ఎఫ్ హెచ్‌సి చూడగానే నన్ను సింపుల్‌గా మర్చిపోతాడు. చివరికి నేనే అతన్ని మర్చిపోలేక లేడీ దేవదాసునైపోవాల్సి వస్తుంది. అందుకే ఈ అఫైర్‌ని ఇంతటితో కట్ చేసి పారేస్తున్నా" అన్నాను.

నా నిర్ణయం విన్న శిల్ప మండిపడింది. "నువ్వొట్టి పిరికి పందవి. పనికిమాలిన దానివి. అనుకున్నది సాధించలేని దద్దమ్మవి" అంది.

"ఏమైనా అనుకో" అన్నాను.

"అతను కాదే కలుపుమొక్క... నువ్వే. ముందు నిన్ను పీకెయ్యాలి" అంది.

"పీకేసుకో" అన్నాను.

అదంతటితో వూరుకోలేదు. విషయాన్ని విల్సనంకుల్‌కీ... ఆంటీకీ చివరికి వాళ్ల పిల్లలతో సహా చెప్పి గొడవ చేసింది.

"మాటలకీ మనిషి చేతలకీ సంబంధం లేదమ్మా! దిలీప్ మాటల్నిబట్టి నువ్వతన్ని అంచనా వెయ్యొద్దు. అతని మనసుని రంగం మీదకురానీ. అదేమంటుందో విందాం. అంతవరకూ నువ్వు ప్రొసీడ్ కావడమే మంచిది" అన్నాడు విల్సనంకుల్.

"డేడీ చెప్పింది కరెక్ట్. నువ్ ఫాలో అయిపో అక్కా" అంది నర్గీస్.

"మా కాలేజ్‌లో జవహర్ అని ఓ అబ్బాయి వున్నాడు. అతన్ని లీనా అనే అమ్మాయి ప్రేమించింది. కానీ అతను మాత్రం ఆ అమ్మాయిని ప్రేమించలేదు. లాస్ట్ సమ్మర్‌లో ఆ పిల్ల... పాయిజన్ తాగేసింది. దాంతో జవహర్ దారికొచ్చేసి నేను నిన్ను ప్రేమించటం లేదు అనుకుని నా మనసుని నేనే మోసం చేసుకున్నాని

న్నాళ్లు. నన్ను క్షమించు లీనా... ఐల వ్యూ లీనా' అనేశాడు. ఖచ్చితంగా డాక్టర్ దిలీప్ కూడా అట్లాగే మారతాడు. బెట్" అంది రెబెకా.

"అయితే నేను కూడా పాయిజన్ తాగనా? " అన్నాను.



"ఛ.. అట్లా అని కాదు" అంది రెబెకా.

"తాగినట్టు యాక్షన్ చెయ్యక్కా" అన్నాడు శ్రీకాంత్.

"పెద్దవాళ్ల విషయాలు మీకనవసరం. ముందిక్కడ్నుంచి వెళ్తావా లేదా" అని జెరీనా ఆంటీ బెదిరిస్తే కానీ వాళ్లక్కడ్నుంచి పోలేదు.

నాకు భలే నవ్వొచ్చింది. ప్రేమని ఎద్దేవా చేసి ప్రేమికుల్ని అంటరాని వాళ్లుగా చూసే మనుషుల్నే నేనింతవరకూ ఎరుగుదునుగాని ఇట్లా ఎంకరేజ్ చేసే వాళ్లని ఇదే చూడ్డం. మన సొసైటీ మొత్తం... ప్రేమనిట్లా ఒక వేల్యుబుల్ ఎలిమెంట్‌గా గుర్తిస్తే. ఇక కులమతాలూ... ఆస్తి అంతస్థుల తారతమ్యాలూ అంతరించి ఒక సమ సమాజం ఏర్పడదా అన్పించింది నాకు.



జెరీనా ఆంటీ అడిగింది "ఉన్నట్టుండి ఎందుకూ నీ నిర్ణయాన్ని మార్చుకున్నావ్? నాకు చెప్పవూ? " అంది బతిమాలుతున్న ట్టుగా.

"నాకే తెలీదాంటీ. ఎందుకో ఇదంతా అన వసరం అన్పిస్తోంది" అన్నాను.

"సరే ఆ విషయాన్ని వదిలెయ్. తరు వాత మాట్లాడదాం. వెళ్లి భోంచేసి పడుకో" అన్నారామె.

అట్లా రాత్రి జరిగిన ఆ విషయాలన్నీ ఒక దాని వెంట ఒకటి గుర్తొచ్చి పుస్తకం మీద మనసు లగ్నం కావడంలేదు. ఇక లాభం లేదని ,లేచి పుస్తకాన్ని రేక్‌లో వుంచేసి బయటకు నడిచాను. లైబ్రరీ పోర్ట్ మెట్ల మీద స్వీపర్ నరసమ్మ కూర్చుని కొంగుతో మాటిమాటికీ కళ్లొత్తుకోవడం నా కంట పడింది.

ఈమధ్య వారం పది రోజులుగా ఆమె రావడం లేదు. ఆమె బంధువులెవరో పోయారని. విన్నాను. ఈ రోజే నేనామెను చూడ్డం.

"ఇన్నాళ్లూ రాలేదేం? " అనడిగాను. కూర్చుని వున్న మనిషి మరింతగా చతికిల బడి ముఖానికి కొంగడ్డం పెట్టుకుని బావు రుమంది.

"ఎవరు నరసమ్మా పోయింది? దగ్గరి వాళ్లా? " అన్నాను.

"ఎవరో అయితే నేనిట్టా ఏడుస్తానా? పోయింది సాయానా నా అల్లుడమ్మా" అంది.

"అరెరె! వయసెంతుంటుంది? " అన్నాను.

"ఎంతో యాడిదమ్మా. పట్టుమని పాతి గ్గూడా లేవు"

"అయ్యో పాపం" అన్నాను ఇక ఆమె కూతురి వయసు ఏ ఇరవయ్యో వుంటుం దని అంచనా వేస్తూ.

"ఆడ్ని పాపమంటే మనకు పాపం చుట్టు కుంటాదమ్మా. దొంగ సచ్చినోడు ఆడి దార్న ఆడు పోయాడు. ఇప్పుడన్నాయమయ్యింది నా బిడ్డ బతుకు అజంతమ్మా" అంది.

ఎంత ఆమె బిడ్డ బతుకు అన్యాయమైతే మాత్రం చనిపోయిన మనిషిని ఆమె అట్లా దొంగసచ్చినోడు అనడం నాకు నచ్చలేదు. ఆమెపట్ల జాలి స్థానంలో కోపమొచ్చింది నాకు.

"చనిపోయిన వాడ్ని అట్లా తిట్టకూడదు" అన్నాను.

నరసమ్మ దుఃఖం మటుమాయమైంది. నాకేసి అదోలా చూస్తూ కాళ్లూచేతులూ తిప్పుతూ "ఆడికా ఒక్క తిట్టూ సరిపో దమ్మా! నేబతికినంతకాలం ఆడ్నిట్టా తిట్టిపో సినా వాడు చేసిన పాపం తీరిపోదు. ఒంట్లో మాయరోగం పెట్టుకుని నా బిడ్డ మెళ్లో దర్జాగా తాళిగట్టాడు. ఇయ్యాళ నా బిడ్డ ముండమోసింది. ముక్కుపచ్చలారని నా బిడ్డ బతుకు అట్టాజెయ్యడానికి ఆడికేం అక్కుందో నువ్వే చెప్పు"

నేనేం చెప్పగల్ను? ఆమె ప్రశ్న నా మన సును తూట్లు పొడిచిందన్న విషయం ఆమెకు తెలీదు.

"ఏం జబ్బుతనికి? " నోరు తడారిపోతుం డగా అడిగాను.

"గుండెకు చిల్లుందంట. ఆడబ్బుకూడా ఆ రోగం తోటే పోయాడంట"

"పెళ్లికి ముందు ఇదంతా తెలీదా నీకు? " అడిగాను.

"తెలిస్తే నా బిడ్డ గొంతెందుకోస్తానమ్మా" నరసమ్మ మళ్లీ బావురుమంది.

ఏడుస్తున్న నరసమ్మని అట్లాగే వదిలేసి అక్కడినుండి వడివడిగా వెళ్లిపోయాను.

★ ★ ★

ఆ రాత్రి ఎప్పట్లా టెర్రస్ మీద విల్సనం కుల్, ఆంటీ, నేనూ, శిల్పా కూర్చుని వున్న ప్పుడు జెరీనా ఆంటీ అడిగింది "అంజూ! ఏం నిర్ణయించుకున్నావ్? " అని.

నేనామె ప్రశ్నకు సమాధానం చెప్పకుండా నరసమ్మ అల్లుడి మరణం గురించి

చెప్పాను.

"ఆంటీ నిన్ను అడిగింది నీ డెసిషన్ గురించి" అంది శిల్ప చురుగ్గా.

"నా డెసిషన్‌కీ, నరసమ్మ అల్లుడి మరణానికీ పోలిక వుంది కాబట్టే ఆ విషయం చెప్పాను" అన్నాను.

శిల్పకి ఒళ్లు మండిపోయిందేమో మరి "నీ గుండెకు చిల్లులేం లేవుగాబట్టి పెళ్లవగానే నువ్వేం చచ్చిపోవు. నీ దిలీప్ విడోయర్ కాడు. సరేనా" అంది.

దాని మాటలకు నేనే కాదు... ఆంటీ అంకుల్ కూడా నవ్వేశారు.

నవ్వడం అయ్యాక జెరీనా ఆంటీకి నాకొచ్చిన కల గురించి చెప్పి "పెళ్లయ్యాక నాకేం కాకపోవచ్చు కానీ నాకొచ్చిన కలలో లాగా నా సంతానం అనారోగ్యంగా పుడితే దిలీప్ నన్ను క్షమిస్తాడా?" అన్నాను.

"అజంతా! సైకలాజికల్‌గా నువ్విప్పుడు అప్‌సెట్ అయిపోతున్నావ్. యాంబివలెన్స్ అనే ఒక విచిత్రమైన స్థితిలో నువ్వున్నావ్. దేన్ని చూసి అసహ్యించుకుంటామో భయపడతామో దాన్నే కోరడం ఈ స్థితిలో జరుగుతుంది. దిలీప్ భావాల్ని నీ కాన్షస్ అసహ్యించుకుంటోంది. అదే సమయంలో నీ సబ్‌కాన్షస్ ఇష్టపడుతోంది. నువ్విప్పుడు ఒకే విషయాన్ని అవును, కాదు అంటున్నావ్.

చెప్పానుగా సబ్‌కాన్షస్‌లో నిద్రాణమైన విషయాలు కలలుగా మారువేషాల్లో బయటకొస్తాయని. పైకి మాత్రం నువ్వతన్ని నీ ప్రేమతో మార్చాలనే అనుకుంటున్నావ్. లోపల నీకు తెలియకుండా నీ కాన్షియస్ అతను చెప్పిన సైంటిఫిక్ విషయాల్ని యాక్సెప్ట్ చేసింది. నిన్ను భయపెడుతోంది. అందుకే నీకట్లా కలొచ్చింది. నువ్వు పిరికిదాన్లా పారిపోవాలనుకోవడానికి కారణం కూడా నీ సబ్‌కాన్షస్‌లో నిద్రాణమైవున్న భయాలే" అంది జెరీనా ఆంటీ.

"నా సబ్‌కాన్షస్ అతను చెప్పిన విషయాల్ని యాక్సెప్ట్ చేసిందా? అంటే నేనూ అతనిలా మానవత్వం లేకుండా ఆలోచిస్తున్నానా?" అన్నాను.

"ఎగ్జాట్లీ" అంది శిల్ప "నీ మనసులో విషయాన్ని నీకల బయటపెట్టేసింది"

"నౌ ద కేట్ ఈజ్ అవుటాఫ్ ద బేగ్" అన్నాడు విల్సనంకుల్.

"నో" అన్నాను "అనారోగ్యంతో శాపగ్రస్థ జీవితాలు గడుపుతున్న వారిపట్ల నా దృక్పథం వేరు. దానికీ దిలీప్ దృక్పథానికీ పొంతన లేనేలేదు" ఆవేశంగా అన్నాను.

"ఈ నీ మాటలు నీ కాన్షస్‌కీ, సబ్‌కాన్షస్‌కీ మధ్య జరిగే ఘర్షణకి సంకేతాలు. నీ కాన్షస్ గెలిస్తే నువ్వతన్ని నీ ప్రేమతో మార్చడానికి ప్రయత్నిస్తావ్. నీ సబ్‌కాన్షస్ జయిస్తే నువ్వతని యాటిట్యూడ్‌కు నీకు తెలీకుండానే విలువనిచ్చి అతనికి దూరంగా పారిపోతావ్" అంది జెరీనా ఆంటీ.

ఆ రోజు అర్ధరాత్రి వరకూ నాకు నిద్రపట్టలేదు. బుర్ర వేడెక్కిపోయేటన్ని ఆలోచనలు. ఒక్కటీ ఓ కొలిక్కి రాలేదు. అలసిపోయిన నా మెదడు అర్ధరాత్రి దాటాకనుకుంటా నిద్రలోకి జారిపోయింది.

★ ★ ★

ఆ రోజు ఉదయం నేను అస్సలు వూహించని సంఘటన ఒకటి జరిగింది.

దిలీప్ నేరుగా ఇంటికే వచ్చేశాడు.

అతను కారు దిగి గేట్ తీసుకుని లోపలికి వస్తుండటం బాల్కనీలో నిలబడి వున్న నాకు కనిపించింది.

నేను శిల్పకు విషయం చెప్పి గబగబా మెట్లు దిగి వచ్చేసరికి దిలీప్ విల్సనంకుల్ని నా గురించి అడిగినట్టున్నాడు. అందుకాయన "షి ఈజ్ రిసైడింగ్ ఇన్ ద అప్‌స్టైర్స్.. ఆర్ యు డాక్టర్ దిలీప్?" అంటున్నాడు.

నేను కనబడగానే దిలీప్ "హలో అజంతా" అన్నాడు. అతనికి రెస్పాన్స్ ఇచ్చి

విల్సనంకుల్‌తో చెప్పాను "డాక్టర్ దిలీప్"

"చూడగానే పోల్చుకున్నాను" ఆయన్నవ్వుతూ అన్నాడు.

"మా అంకుల్... విల్సనంకుల్... ఇంగ్లీష్ ప్రొఫెసర్" చెప్పాను దిలీప్‌తో.

దిలీపు, అంకులూ కరచాలనం చేసుకున్నారు. "మీట్ యూ ఎగైన్" అని అంకుల్‌తో చెప్పి... నా వెనకే మెట్లెక్కి పైకొచ్చాడు దిలీప్.

ముందు గదిలో అతన్ని కూర్చోమని చెప్పి... శిల్పకోసం లోపలి గదిలోకెళ్ళాను. అదెక్కడా కనబళ్ళేదు.

"రాస్కెల్... కావాలని ఒక్కదాన్నే వదిలేశావా? తర్వాత చెప్తాలే నీపని" అనుకుంటూ ఫ్లాస్క్‌లో వున్న కాఫీని కప్పులోకి వంచి...తెచ్చి అతనికివ్వబోయాను.

"నో... థాంక్స్" అన్నాడు సీరియస్‌గా.

అతను అలిగాడన్నమాట.

"కాఫీ నేనే స్వయంగా చేశాను" అన్నాను.

"మీరే స్వయంగా తాగండయితే" అన్నాడు.

"ఇంతకీ మీ రాకకి కారణం? " అన్నాను.

"వారంరోజుల్నుండీ తప్పించుకు తిరుగుతున్నారు? ఎందుకో తెలుసుకుందామని వచ్చాను. చెబితే విని వెళ్ళిపోతాను"

"చెబితే నిజంగా వెళ్ళిపోతారా? " అడిగాను.

"వెళ్ళకేం చేస్తాను? " అన్నాడు.

"అయితే చెప్పను"

"ఎందుకని? " అన్నాడు.

"చెబితే మీరెళ్ళిపోతారుగా" అన్నాను.

అన్నాక...ఛ... ఎందుకిట్లా ప్రొవోకింగా మాట్లాడానా అని మథనపడ్డాను.

నాకు తెలీకుండానే చేసిన కాన్వర్సేషన్ అది. ఉన్నట్టుండి దిలీప్ "ఎందుకజంతా అట్లా చేశారు? కనీసం ఫోన్‌లో కూడా నన్ను అవాయిడ్ చేశారెందుకు" అన్నాడు.

ఏమని చెప్పాలో తోచలేదు. మౌనంగా వుండిపోయాను.

అతను అకస్మాత్తుగా లేచి "పదండి" అన్నాడు.

"ఎక్కడికి" ఆశ్చర్యపోయాను.

"ఇవాళ మిమ్మల్నోచోటుకి తీసికెళ్ళబోతున్నా" అన్నాడు.

"సినిమాకా? " అడిగాను.

"నో" అన్నాడు.

"హోటల్‌కా? " అన్నాను.

మళ్ళీ "నో" అన్నాడు.

"గుడికి కదూ? "

"కాదు...కాదు...కాదు. మీరు వూహించలేని ప్లేస్ అది"

"యూనివర్శిటీ టైమ్ అవుతోందే" అన్నాను.

"నాకూ హాస్పిటల్‌కి వెళ్ళాల్సిన టైమ్ అయింది" అన్నాడు.

"అంటే... నీ కోసం... అది మానుకుంటున్నా... సో... నా కోసం నువ్వు ఇది మానుకోవాలీ" అనర్థమని అర్థమైంది.

"రానంటే? " అన్నాను.

అతనో క్షణం నాకేసి ఓపిగ్గా చూసి చెప్పాడు. "బలవంతం చెయ్యను. కానీ బాధపడతాను"

అతని మాటల్లోని సిన్సియారిటీ నాకు నచ్చింది. "జస్టె మినిట్" అని చెప్పి లోపలికెళ్ళాను.

వార్డ్‌రోబ్ తెరిచి జేడ్ గ్రీన్ కలర్ ఇటాలియన్ క్రేప్ శారీ కట్టుకుని...దాని మీదకు అదేరంగున్న వెల్వెట్ బ్లౌజ్ వేసుకున్నాను.

సరిగ్గా... ఆ గదిలోంచి బయటకు రాబోతున్న సమయంలో, "విష్‌యు ఆల్ ద బెస్ట్" అంటూ చేతిలో పొడవాటి కాడున్న బొకే టైప్ ఎర్ర గులాబీతో ప్రత్యక్షమైంది శిల్ప.

"ఎక్కడ చచ్చావ్" అన్నా కోపం పట్టలేక.

"ష్... గట్టిగా అరవకు. నన్ను చూస్తే నీ దీపూకీ... నీ దీపూని చూస్తే నాకూ చెడ్డ చిరాకు. ఐ కాన్ట్ టాలరేట్ హిమ్... హి

టూ కాన్ట్ టాలరేట్ మి. సో... నా ఐడెంటిటీని అతి రహస్యంగా వుంచాను"

"ఇక ఆపు నీ సొద" అన్నాను.

శిల్పా గులాబీని నా చెవి పక్కగా అమరుస్తుంటే వద్దని ఖచ్చితంగా జడమీద పెట్టుకున్నాను.

నేను దిలీప్‌తోపాటు కిందికి దిగి కారెక్కుతుంటే గుమ్మంలో విల్సనంకుల్, ఆయన వెనక జెరీనా ఆంటీ... ఆ వెనక రెబెకా... నర్గీస్... శ్రీకాంత్ నిలబడి మా ఇద్దరికేసీ ఆసక్తిగా చూడ్డం కనిపించింది.

కారు రోడ్డుమీద మెత్తగా పోతోంది. దిలీప్ ఏం మాట్లాడ్డంలేదు. నన్నెక్కడకు తీసికెళ్తున్నాడో అర్థం కావడంలేదు.

"ఎక్కడికో చెప్పండి ప్లీజ్" అన్నాను.

"చెబితేగాని రారా? " అన్నాడు.

నేను నిశ్శబ్దంగా వుండిపోయాను.

"అజంతా... ఎందుకూ నన్నేడిపించావ్ ఈ వారంరోజులూ? " అతని స్వరంలోనే కాదు... మాట్లాడే తీరులో కూడా ఏదో తేడా కొట్టొచ్చినట్టు కన్పించింది.

ఏంటా తేడా! ఆలోచిస్తున్నాను.

"ప్లీజ్ మాట్లాడు" అన్నాడు.

నాకర్థమైంది. అతను నన్ను ఎన్నడూ లేంది ఇవాళ ఏకవచనంలో సంబోధిస్తున్నాడు.

ఇద్దరిమధ్యా వున్న... మైళ్ళదూరం... హఠాత్తుగా చెరిగిపోయిన భావన.

నేను మాట్లాడకపోవడం చూసి అతనే అన్నాడు "పోనీ చెప్పొద్దుగాని ఓ కండిషన్"

'ఏంటది' అన్నట్టుగా చూశాను.

అతను కార్ని రోడ్డు పక్కగా పోనిచ్చి సడన్‌గా ఆపి పూర్తిగా నావైపు తిరిగాడు.

"ఇంకెప్పుడూ నన్నట్లా అవాయిడ్ చెయ్యకు నేను భరించలేను"

అతని కళ్లల్లో లీలగా తడి మెరిసిందో... లేక మెరిసినట్టు నాకన్పించిందోగాని నా గుండె ఒక్కక్షణం లయ తప్పింది.

అతని హృదయాన్ని నా హృదయం అదృశ్యంగా హత్తుకున్న ఫీలింగ్.

అతను సమాధానంకోసం ఎదురుచూడలేదు. తిరిగి కార్ని రోడ్డమీదకు తీసికెళ్లి మెత్తగా పోనిస్తున్నాడు.

ఓ పదిహేన్నిమిషాల డ్రైవ్ తర్వాత... కారు ఓ ఇంటిముందాగింది. చాలా అధునాతనంగా వుందా ఇల్లు. కేవలం ప్రహరీ గోడలూ... గేటూ చూస్తుంటేనే ఆ ఇంటి రిచ్‌నెస్ అర్థమౌతోంది.

వాచ్‌మెన్ హడావుడిగా గేటు తెరిచాడు. కారులోపలికెళ్ళి పోర్టికోలో ఆగింది.

"మా ఇల్లు. దిగండి" అన్నాడు.

లోపలకెళ్లాను అతన్తోపాటు.

"కూర్చోండి" అన్నాడు సోఫా చూపిస్తూ.

మళ్లీ బహువచనంలోకి వచ్చేశాడని గ్రహించి నవ్వుకున్నాను.

అంటే... ఇందాక ఎమోషనల్ స్టేట్‌లో అట్లా అన్నాడన్నమాట.

సోఫాలో కూర్చుని... హాలంతా పరికించి చూశాను. వాల్ టు వాల్ కార్పెట్స్‌తో... ఆయిల్ పెయింట్స్‌తో మహా రిచ్‌గా వుందా హాల్.

నా తలకు సరిగ్గా పైన సీలింగ్‌నుంచి వేళ్లాడుతున్న షాండ్లియర్నిచూస్తూ.

"ఇంతటి వెల్దీమాన్ నాలాంటి ఒక మామూలు అమ్మాయిని ఎందుకు లైక్ చేస్తున్నట్టు? " అనుకున్నాను.

వెంటనే స్ట్రయిక్ అయింది సమాధానం.

అతనికి స్టేటసకన్నా... ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ ముఖ్యం. ఆ అన్వేషణలో మిగతా విషయాల్ని పట్టించుకోవడంలేదు.

లోపల్నుండి ఓ నడివయసావిడ వచ్చింది.

చూడగానే గుర్తుపట్టాను. ఆమె దిలీప్ తల్లి.

"కట్నకానుకలు మాకు వద్దేవద్దు. మీ అమ్మాయినిస్తేచాలు" అన్న ఆవిడ మాటలు చటుక్కున గుర్తుకొచ్చాయి.

దాంతో ఆమె అంటే ఎక్కడలేని గౌరవం

పొంగుకురాగా చప్పున లేచి నిలబడి చేతులు జోడించాను.

ఆవిడ ముఖం వికసించింది.

"కూర్చోమ్మా కూర్చో" అంది నేను లేచినందుకు నొచ్చుకుంటున్నట్టుగా.

అమ్మా, నాన్నల యోగక్షేమాలడిగాక అంది "అన్నీ సవ్యంగా జరిగుంటే ఈపాటికి ఈ ఇంటి కోడలివయ్యేదానివి. ఏంచేస్తాం ఈశ్వరేచ్ఛ అలాగుంది. ఆరోజు మీ మామయ్యొచ్చి... అమ్మాయికి ఇంకా చదువుకోవాలనుందటండీ... ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకోనంటోంది. క్షమించండి అన్నప్పుడు... నాక్కోపం రాలేదమ్మాయ్... నీలాంటి పిల్లని కోడలిగా పొందలేకపోతున్నానే అన్న బాధ కలిగింది"

అంత గొప్పతనం ఏముంది నాలో అనుకున్నా. బహుశా... సుడి అంటారే, అలాంటిదేదైనా వుందేమో నా జాతకంలో.

"మీరు మాట్లాడుతూ వుండండి. నేనిప్పుడే వస్తా"నంటూ దిలీప్ ఎక్కడికో వెళ్లాడు.

నాకక్కడ కొత్తగా, ఇబ్బందిగా వుంది. నన్నట్లా వదిలేసి వెళ్లిన దిలీప్ మీద కోపమొచ్చింది.

"అప్పుడు నువ్వట్లా అనకపోయుంటే... వెంటనే నిశ్చితార్థం, పెళ్లీ జరిగిపోయుండేవి" మళ్లీ ఇందాకటి మాటల్నే ఇంకోరకంగా రిపీట్ చేసిందామె.

దిలీప్ పెళ్లిచూపుల్లో అమ్మాయిల్ని ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ లిమ్మని డిమాండ్ చేసే విషయం ఆవిడకు తెలీదని నాకర్థమైంది.

"వాడి జాతకమేంటోనమ్మాయ్... ప్రతి సంబంధం నిశ్చితార్థందాకా వచ్చి చెడిపోతుంది. కట్నకానుకల గురించి కూడా ఆశపడ్డం లేదు మేము. అయినా కుదరటం లేదు. నీ విషయంలో మాత్రం ఎంత ఆరాటపడ్డాం. మీ సంబంధం తప్పిపోదనే అనుకున్నాం..."

ఆవిడ ధోరణికి ఆనకట్ట వెయ్యాలని అడిగాను. "దిలీప్‌గారి ఫాదర్ ఎక్కడికెళ్లారు? కన్పించరేం?" అని.

"దిలీప్‌గారి ఫాదరేంటి? మామయ్యా అనమ్మాయ్" అందామె.

ఇంతలో వచ్చాడాయన. ఆ హాల్‌కి ఎడ్జెసెంట్‌గా ఎడమవైపున్న గదిలోంచి.

"ఏమండీ... అజంతా అండీ" అందామె ఆయన్తో సంభ్రమంగా.

"అజంతానా!" అన్నాడాయన అర్థంకాక

నేను లేచి నిలబడి నమస్కారం పెట్టాను.

ఆయన నాకేసి పరిశీలనగా చూసి పోల్చుకున్నాడు.

"నువ్వామ్మా బాగున్నావా?" అన్నాడు ఆప్యాయంగా.

"ఇక్కడే చదూతున్నావటగా అబ్బాయి చెప్పాడు" అని కూడా అన్నాడు.

వాళ్ళు మాట్లాడుతుండగానే అరగంట గడిచిపోయింది. ఆ అరగంటలో... కాఫీ, టిఫిన్ల ఆఫర్ కూడ అయిపోయింది.

ఇంకా రాలేదు మహానుభావుడు

"ఇట్లారా అమ్మాయ్" అంటూ దిలీప్ తల్లి నన్ను ఓ గదిలోకి తీసుకుపోయింది.

అక్కడున్న బెడ్ మీద నన్ను కూర్చోమని చెప్పి... ఆ గదిలోనే ఓ మూలగా వున్న ఐరన్ సేఫ్ తెరిచి నగలపెట్టెల్లాంటి వాటిని బయటకు తీసి నా ఎదురుగా బెడ్‌మీద పెట్టి మూతలు తెరిచింది.

నా కళ్లు జిగేల్మన్నాయి. సరిగ్గా చెప్పాలంటే అన్ని నగల్ని ఒక్కసారిగా చూసేసరికి నాకు తల తిరిగినట్టుగా అన్పించింది. ఏదైనా సరే మోతాదు మించితే వెగటే అనుకున్నా.

"ఇవన్నీ... ఈ ఇంటి కోడలికేనమ్మాయి. నాకు ఆడపిల్లల్లేరు. కూతురైనా కోడలైనా దీపూ పెళ్లామే నాకు" అంది.

ఆ తర్వాత ఇల్లంతా తిప్పి చూపించింది. అన్నీ యథాలాపంగా చూస్తున్నా... నా

మనసు మాత్రం దిలీప్ కోసం చూస్తోంది. ఎంతకూ అతను రాకపోవడంతో ఇక నేను బయల్దేరితే మంచిదనిపించింది. మళ్ళీ అతనేమనుకుంటాడోనని ఒకవంక లాగుతూనే వుంది.

నేనట్లా వెళ్ళాలా వద్దా అన్న డైలమాలో వుండగానే దిలీప్ వచ్చాడు.

"సారీ లేటైంది" అన్నాడు ఓ ప్యాకెట్‌ను తల్లి చేతికిస్తూ.

ఆమె... అతనివంక మెచ్చుకోలుగా చూసి లోపలికెళ్ళింది.

ఆ ప్యాకెట్లో ఏముంటుందో నేను గెస్ చేశాను. కాసేపటికి దిలీప్ తల్లీ... ఆమె వెనకాలే పట్టుచీరా, పళ్ళూ... తాంబూలం సర్దిన ట్రేని పట్టుకున్న పనమ్మాయి హాల్లో కొచ్చారు.

నా గెస్సింగ్ కరెక్టేగాని... మరీ పట్టుచీరె ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు.

నేనిబ్బందిగా దిలీప్ వంక చూశాను. అతను నాకేసి గాఢంగా చూస్తున్నాడు. చప్పున కళ్ళు తిప్పుకున్నాను.

అతని తల్లి నా నుదుటన కుంకుమ దిద్ది... చీరె సర్దివున్న ట్రేని... ఆ అమ్మాయి చేతుల్లోంచి అందుకుని నా చేతుల్లో వుంచింది.

అప్రయత్నంగా ఆవిడ కాళ్లకు నమస్కరించాను.

ఆవిడ... 'శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు' అని దీవిస్తుంటే... నాకు చచ్చేంత సిగ్గేసింది, ఆ దీవెన దిలీప్ వింటున్నాడన్న ఫీలింగ్ వల్ల.

"అమ్మా! అజంతాని ఇంటి దగ్గర డ్రాప్ చేసి నేనట్నుంచటే హాస్పిటల్‌కెళ్తాను" చెప్పాడు దిలీప్.

నన్నందరూ గేటువరకూ వచ్చి సాగనంపారు.

"అప్పుడప్పుడూ వస్తూండమ్మా" అంది దిలీప్ తల్లి. "దీపూ అమ్మాయిని జాగ్రత్తగా దింపిరా" అన్నాడు అతని తండ్రి.

నేను వాళ్లకేమీ కానని తెల్సి కూడా నన్నంతగా ఆదరించిన ఆ పెద్దవాళ్లను చూస్తుంటే నా కళ్లు చెమ్మగిల్లాయి. ఆ ఆప్యాయతకూ అభిమానానికీ ఓ రకంగా నన్ను దూరంచేస్తున్న దిలీప్‌ని చూస్తుంటే గొంతు పిసికెయ్యాలన్పించింది నాకు. నోటి కొచ్చినట్టు మాట్లాడి దులిపెయ్యాలన్పించింది.

కానీ నాకతనిమీద ఏం అధికారముందని?

దిలీప్ ఏమిటేమిటో అడుగుతున్నాడు. అన్నిటికీ ఊఁ కొడుతున్నాను. మనసెక్కడో వుంది.

చివరిగా అతనేమడిగాడో, మరి నేనేమన్నానో.

"రియల్లీ..." అన్నాడతను ఇంటిముందు కారాపి.

"ఏమడిగారు? " అన్నానీలోకంలోకొచ్చి

"మీ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ అడిగాను. ఇస్తానన్నారు" అన్నాడానందంగా.

ఒక్కసారిగా నిస్సత్తువ ఆవహించింది. నన్ను నేను కంట్రోల్ చేసుకుని ఒక్కక్షణం ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చినదాన్లా చెప్పాను "తప్పకుండా ఇస్తాను. రేపు సాయంత్రం ఆరింటికి శివాజీనగర్‌లోని శ్రీకృష్ణాలయం దగ్గర మీటవుదాం"

దిలీప్ "థాంక్యూ" అన్నాడు కళ్లు మెరుస్తుండగా.

నేను కారు దిగి గేటు తీసుకుని లోపలికి వెళ్లబోతుంటే పట్టుచీర వుంచిన క్యారీబేగ్‌ని కార్లోనే మర్చిపోయానంటూ, నా వెనకాలే వచ్చి నాకందించాడు దిలీప్. అది అందించాక మళ్ళీ అడిగాడు.

"ఇస్తారుగా? "

"ష్యూర్" చెప్పాను.

★ ★ ★

ఆలయంలో భక్తుల సందడి మొదలైంది. నేను ఆ సందడికి కాస్త దూరంగా కోనేటి

మెట్లమీద కూర్చుని వున్నాను.

మెట్లనిండా పున్నాగపూలు రాలిపడి వున్నాయి. ఆ పూల పరిమళం నిండిన గాలి, అలలు అలలుగా వీస్తోంది.

ఆరు కావటానికి ఇంకో అయిదు నిముషాలుందనగా గుడి బయట దిలీప్ సియోలో ఆగటం ప్రహరీగోడమీంచి కనబడింది నాకు.

అతను కారు దిగి... గుడి ఆవరణలోకొచ్చాడు. నాకోసం అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాడు.

"వెదకనీ కాసేపు" అనుకున్నాను.

చివరికి నేనున్న ప్రదేశం కనిపెట్టేశాడు.

"బ్యూటిఫుల్ స్పాట్" అంటూ వచ్చి నేనున్న మెట్టుకు పైమెట్టు మీద కూర్చున్నాడు.

సిటీలో బిజీ ప్రాక్టీస్ వున్న డాక్టర్... సాయంత్రం ఆరు తర్వాతంటే అవి అతనికి వృత్తిరీత్యా ఊపిరి సలపనివ్వని అవర్స్

అయినా నాకోసం వచ్చాడు.

నాకోసం అంటే నామీదున్న ప్రేమతో వచ్చాడు.



# ఏరిన ముత్యాలు

★ పట్టలేని ఆనందం, కన్నుగానని కోపం, తమాయించుకోలేని తాపం ఎవరి అనుభవంలోకి రావో అతడే యోగి.

– రామకృష్ణ పరమహంస

★ విలువలతో, విధులతో, సద్గుణాలతో, సంస్కారంతో మనిషి తననుతాను సింగారించుకోవాలి

– గాంధీజీ

★ ఏ విషయాన్నైనా ఏకాగ్రతతో పరిశీలించుకో

– సంస్కృతసూక్తి

★ మాట నిలకడ లేనివారితో స్నేహం తగదు.

– పర్షియన్‌సామెత

★ పట్టుబట్ట కట్టడమే కాదు, ధర్మంకొరకు పట్టుపట్టి నిలబడాలి.

– విద్యాప్రకాశానందగిరి స్వామి

★ ఉన్న స్థితినుంచి ఉన్నత స్థితికి చేరడమే ధ్యానం

– ఠాగూర్

★ నా భార్యా బిడ్డలే నా కుటుంబం కాదు, ఈ మానవజాతి అంతా నా కుటుంబమే

– జతీంద్రనాథ్ ముఖర్జీ

★ ఊరికే వాగకు, రైలును నడిపేది దాని కూత కాదు

– హరీ థాంప్సన్

★ మూర్ఖులకే స్త్రీ, పురుష విచక్షణ. సత్పురుషులు ఇద్దరినీ గౌరవిస్తారు

– కాళిదాసు

★ నువ్వు కొన్న ప్రతి మంచి పుస్తకంతోనూ నీ వ్యక్తిత్వం ఒక మిల్లీ మీటర్ పెరుగుతుంది

– హర్‌దయాళ్

★ సరిగ్గా సాగు చెయ్యలేని వారి భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి

– కౌటిల్యుడు

★ తలలు నెరిసిన రాజకీయ నాయకుల నిర్ణయాలకు అందరూ దాసోహం చెయ్యాలనడంలో నాకు నమ్మకం లేదు

– సుభాష్ చంద్రబోస్

★ సంభాషణ అంటే ఎదుటివారిని ప్రశ్నలు వేయడం కాదు.

– డాక్టర్ రాధాకృష్ణన్

సేకరణ: అనంత ప్రభాకర్ దత్తు

ఇవాళేకాదు... ఇలా చాలాసార్లు నాకోసం అతని విలువైన సమయాన్ని వెచ్చించాడు.

అతని మనసు నాకోసం పలవరిస్తుంటే నేగా ఇట్లా వస్తాడు. మరి ఇంతటి ప్రేమా, నా ఎఫ్‌హెచ్‌సి చూడగానే మటుమాయ మౌతుందా?

అట్లా మటుమాయమైతే అది ప్రేమెట్లా అవుతుంది?

"ఏంటి అజంతా ఆలోచిస్తున్నారు? "

అతను మొన్న కార్లో... "తెలియని ఉద్వేగంలో నన్ను 'నువ్వు' అని పిలిచినట్టు ఇప్పుడెందుకు పిలవడు?

"మిమ్మల్నే" అన్నాడు.

నాకు ఉద్వేగంగా అన్పించింది.

ఒకవేళ అతని ప్రేమను సైన్స్ జయించి నన్ను మర్చిపోతే, నేను... నేనసలు తట్టుకోగలనా!

"దిలీప్, నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా? " అడిగాను.

నేనతన్ని ఏకవచనంలో సంభోదించాను. నాకు తెలీకుండానే జరిగిపోయిందది.

"ప్రేమలో అబద్ధం వుండదు" చెప్పాడతను.

నా చేతిలో వున్న గులాబీ రంగు కవర్ వంక చూసుకున్నాను.

లోపల మడత పెట్టిన కాగితంలో వున్నది చదివాక కూడా దిలీప్ నన్నిట్లాగే ప్రేమిస్తాడా.

అప్పుడతని ప్రేమ... అబద్ధమైపోవడానికి ఒక్కక్షణం కూడా పట్టదేమో.

"నా ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ మీకు నచ్చలేదనుకో, అప్పుడు కూడా నన్ను ఇప్పట్లాగే ప్రేమిస్తారా? "

దిలీప్ దెబ్బతిన్నట్టు చూశాడు.

"ప్లీజ్ అట్లా అనకండి. మీ ఎఫ్ హెచ్ సిలో ఏ లోపం వుండదు" అన్నాడతను.

అంతేగాని "లోపం వున్నా సరే నిన్ను ప్రేమించటం మానను" అన్లేదు.

"ఒకవేళ వుంటే? " రెట్టించాను.

"ఉండదు... నాకా నమ్మకం వుంది" అన్నాడతను.

నా ప్రశ్నకతను సమాధానం ఇవ్వటం లేదని నాకర్థమైంది.

నేను లేచాను. గట్టుమీద పెట్టిన పూల సజ్జ అందుకున్నాను.

"పదండి... అర్చన చేయిద్దాం" అన్నాను.

ఇద్దరం గుళ్లోకెళ్ళాం. కొబ్బరికాయ, పూలు, కర్పూరంతో పాటు గులాబీ రంగు కవర్ని కూడా పూజారి చేతికిచ్చాను.

పూజారి దాన్నందుకుంటూ నాకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆ కవర్ని పూజలో వుంచి దీవించి ఇవ్వండి" అన్నాను.

అతను దాన్ని దేవుడి పాదాలముందు వుంచుతూ అర్చన ఎవరి పేర్న చెయ్యాలో అడిగాడు.

ఆ కవర్ వంకే చూస్తున్న నా కళ్ళ ముందు ఒక్కసారిగా నా కుటుంబమంతా కదిలింది.

వరసగా అందరి పేర్లూ చెప్పాను, నా పేరుతో సహా.

అతని పేరు చెప్పాలా వద్దా అని ఒక్క క్షణం హెజిటేట్ చేశాను. అతను నా ఫ్యామిలీ మెంబర్ కాదు గనక చివరికి వద్దనే అనుకున్నాను.

అతనా విషయాన్ని గ్రహించే వుంటే... ఖచ్చితంగా ఫీలవుతాడన్పించింది. అతని వంక చూశాను.

ముఖంలో ఏ భావం లేదు.

అతనా విషయాన్ని పట్టించుకోలేదనుకున్నాను. కృష్ణుని విగ్రహం ముందు దేదీప్యమానంగా వెలుగుతున్న జ్యోతినే చూస్తూ కళ్ళు మూసుకున్నాను.

"క్రిష్ణా! ప్రేమ దైవస్వరూపం అంటారు. నీ ప్రతిరూపమైన ప్రేమ ఏ కాలమానాలకూ... తారతమ్యాలకూ లొంగదని నమ్ముతున్నాను. నా నమ్మకాన్ని వమ్ముచేస్తావో,

నిజం చేస్తావో అది నీయిష్టం.
వమ్ముచేస్తే... నువ్వు లేవు. నీ ప్రతి రూపమైన ప్రేమా లేదనుకుంటాను.
నిజం చేశావో. జంటగా నీ గుడికొచ్చి నీ ప్రేమమూర్తిని దర్శించుకుంటాను"
పూజ ముగించి పూజారి కొబ్బరి చెక్క, కుంకుమలతోపాటు కవర్ని నా చేతిలో వుంచాడు.
ఇద్దరం బయటకొచ్చి గుడిమెట్లమీద కూర్చున్నాం. దిలీప్ కవర్ వంకే చూస్తున్నాడని అర్థమైంది.
కొబ్బరి చెక్కని రాతినేలకేసి కొట్టి ఓ పలుకు అతనికిచ్చి నేను కాస్త నోట్లో వేసుకున్నాను.
కవర్వంక ఓసారి గాఢంగా చూసుకుని అతనివైపు చూశాను.
కవర్ని పట్టుకుని వున్న నా చెయ్యి సన్నగా వణకటం నాకు స్పష్టంగా తెలుస్తోంది.
నేనెందుకింత ఫీలవుతున్నాను. జస్ట్ అతన్నో... యాంటీ లవ్ ఎలిమెంట్గా భావించి మార్చాలన్న ప్రయత్నమేగా ఇది.
శిల్పా, నేనూ ఇలాగే అనుకున్నాం. ఇంత కంటే సీరియస్గా అనుకోలేదు.
ప్లాన్డ్గా ప్రేమించాను. ఓ రకంగా ప్రేమ నటించాను.
అతనిపట్ల నా హృదయం స్పందించి పుట్టిన ప్రేమ నటించాను.
మరి... మరి... నేనెందుకింతగా అప్సెట్ అవుతున్నాను? నేనిట్లా నెర్వస్ కాకూడదు. కానేకాకూడదు.
అట్లా అనుకున్నాక నా మనసు శాంతపడింది. దిలీప్ కవర్ని ఓపెన్ చెయ్యబోతుండటం చూసి కంగారుగా చెప్పాను.
"ప్లీజ్....ఇప్పుడు చూడకండి. ఇంటికి వెళ్ళాక... భోజనం చేసి ప్రశాంతంగా పడుకున్నాక... ఐ మీన్ పడుకోబోయే ముందు చూడండి"
"అలాగే" అతన్నవ్వుతూ కవర్ని మడిచి పోకెట్లో పెట్టుకున్నాడు.
ఇద్దరం లేచి బయటకొచ్చాం.
గుడి బయట ప్రహరీగోడనానుకుని... వరసగా కూర్చుని వున్నారు భిక్షగాళ్ళు.
పర్స్ తెరిచి... దొరికిన చిల్లర తీసి పరిచి వున్న గోనెసంచుల మీద వేశాను.
గుడి ముందో రావిచెట్టుంది. దాని మొదలుకు చేరబడి వున్నాడో వ్యక్తి.
స్ట్రీట్ లైట్ వెలుగులో... అరచేతుల్నుండి మోచేతులవరకూ... పాదాల్నుండి మోకాళ్ళ వరకూ బేండేజ్ చుట్టివున్న... మాసిపోయిన గుడ్డపేలికలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఆ గుడ్డ పేలికల మీద అక్కడక్కడ రసి మరకలు.
అతని ఎదురుగా ఒక స్త్రీ కూర్చుని వుంది. ఆమె బలహీనంగా వుందిగాని అతనిలా వ్యాధిగ్రస్తంగా లేదు.
సత్తుగిన్నెలోని అన్నాన్ని ముద్దలుగా చేసి అతని నోటికందిస్తోంది.
అసంకల్పితంగా ఆగిపోయాను ఆ దృశ్యాన్ని చూస్తూ.
"డిసీజ్ వెట్ లెప్రసీ. ఇంకోరకం లెప్రసీ వుంది. అది కంటేజియస్ కాదు. ఇది మాత్రం కాస్త కంటేజియస్. జాగ్రత్తగా వుండాలి. బట్ బోతార్ హెరిడిటరీ. పేరెంట్స్ నుండి పిల్లలకు జీన్స్ ద్వారా పాసాన్ అవడానికి స్కోపుంది"
నేను తలతిప్పి నా వెనగ్గా నిలబడి వున్న దిలీప్కేసి చూశాను రెండుచేతులూ ప్యాంట్ జేబుల్లో పెట్టుకుని ఆ లెప్పర్ వంకే చూస్తూ చెబుతున్నాడతను.
"అతన్ని కాదు... నే చూస్తోంది" అన్నాను.
"మరి ఆమెనా? " అన్నాడు.
తల అడ్డంగా వూపాను.
"కొంపదీసి వాళ్ళు తింటున్న అన్నాన్నా? " అన్నాడు అదేదో జోకైనట్టు నవ్వుతూ.
అతన్ని చూస్తుంటే నాకు కోపం రాలేదు.
జాలేసింది.

"సరిగ్గా అబ్జర్వ్ చెయ్యండి. మీరనుకున్నవి కాక ఇంకోటి కనబడుతుందక్కడ" అన్నాను.

అతను కళ్ళు చిట్లించి పరిశీలనగా చూసి ఇంకేం కనబడ్డం లేదన్నట్టు పెదవి విరిచాడు.

"అది కంటికి కనబడదు. కేవలం మనసుకు మాత్రమే కనబడుతుంది" అన్నాను.

అతనింకోసారి వాళ్ళకేసి చూసి "అదేదో మీరే చెప్పండి" అన్నాడు.

"ప్రేమ" అన్నాను.

అయోమయంగా చూశాడు.

అతనికుండేది ఎంతటి భయంకరమైన వ్యాధో తెలిసి... తెలిసీ ఆమె అతని నోటికి అన్నాన్ని అందిస్తున్న ఆ దృశ్యంలో, అదృశ్యంగా వున్నది అతిశక్తివంతమైన ప్రేమ. అదే లేకపోతే ఆమె అతన్ని అసహ్యించుకుని దూరంగా వెళ్ళిపోయుండేది" అన్నాను.

అతను అదోలా నవ్వి ముందుకు దారితీస్తూ అన్నాడు, "అదంతా ఏమోగాని ఒక్కటి మాత్రం చెప్పగల్ను. ఓ రకంగా ఆమె సమాజానికి చెరుపు చేస్తోంది. అతన్నుండి ఆ వ్యాధిని తను తీసుకుంటుంది. వారసత్వంగా బిడ్డలకిస్తుంది. వాళ్ళనుండి ఇంకో జనరేషన్. ఇట్ కంటిన్యూస్ లైక్ దట్... 'ఒక అనారోగ్యకరమైన రేపటి సమాజానికి ఈమో, మరి ఈ ప్రేమో... శ్రీకారం చుడుతోంది"

అతనితో మాట్లాడం ఇక అనవసరమన్పించింది "నిన్నయినా... నేడైనా... రేపైనా సమాజం నిలబడి వుండేది ప్రేమ పునాదులమీదే" అని చెప్పాలన్పించింది గాని చెప్పలేకపోయాను.

"మనిషిని మనిషి ప్రేమించకపోతే... కుటుంబం వుండదు. కుటుంబం లేకపోతే... అసలు సమాజమే వుండదు" అని కూడా చెప్పాలన్పించింది గానీ అదీ చెప్పలేకపోయాను.

కార్లో అతను నన్ను మా యింటిదగ్గర డ్రాప్‌చేసి వెళుతున్నప్పుడు ఒకటిమాత్రం చెప్పాను. "నా ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ చూశాక్కూడా... నన్నే ప్రేమిస్తున్నానన్న భావన మీక్కలిగితే... సరిగ్గా వచ్చే నెల ఏడోతేదీ క్రిష్ణాలయంలో ఇప్పట్లా ఆరు గంటలకి నన్ను కలుసుకోండి. ఎదురుచూస్తుంటాను"

అతను వెళ్ళిపోయాడు. మా మధ్య జరిగిన సంభాషణంతా నేను విల్సనంకుల్‌కీ, ఆంటీకీ, శిల్పకీ చెప్పాను.

విల్సనంకుల్, ఆంటీ మాత్రం "నో డౌట్ అంజూ యు విల్ బి ద విన్నర్" అన్నారు.

శిల్ప "నీ బండరాముడేం చేస్తాడో నాకు మాత్రం కాస్త కన్‌ఫ్యూజన్‌గానే వుందే" అంది.

ఆరోజు రాత్రికే నేనూ, శిల్పా యూనివర్శిటీకి సెలవులిచ్చిన సందర్భంగా వూరెళ్లే రైలెక్కేశాం.



తెలతెలవారుతుండగా ట్రైన్ మా వూరి స్టేషన్‌లో ఆగింది. శిల్పా, నేనూ ఒకే ఆటో మాట్లాడుకుని ఎక్కాం. శిల్ప నన్ను మా ఇంటిముందు దింపి వెళ్ళిపోయింది.

తలుపులు వేసే వున్నాయి.

"సాధారణంగా అమ్మ అయిదింటికే లేస్తుందే... ఇవాళేంటి ఆరవుతున్నా తలుపులు బిడాయించేసుకుని వున్నారు? " అనుకుంటూ తలుపు తట్టాను.

రాణి నిద్రకళ్లతో లేచొచ్చి తలుపు తీసింది. గుమ్మంలో నన్ను చూడగానే దాని నిద్రమత్తంతా ఎగిరిపోయింది. ఎగిరి గంతేసి నన్ను వాటేసుకుంది.

"విక్కీ! ఎవరొచ్చారో చూడు" అని కేకలు పెట్టేసింది.

ట్రావెలింగ్ బేగ్ దాని భుజానికి తగిలించి నేను లోపలికెళ్లాను.

విక్కీ కూడా లేచొచ్చి "హాయ్... అక్కా" అంటూ విష్ చేశాడు.

"అమ్మేది విక్కీ" అన్నాను.

"హాస్పిటల్లో వుంది" అంది తనకేమైనా తెచ్చానేమోనని ఎయిర్‌బేగ్ చెక్ చేస్తున్న రాణి.

"హాస్పిటలా? " అన్నాను కంగారుగా.

"యూ...ఫూల్" అని విక్కీ రాణిని తిట్టి నాతో అన్నాడు "ఏం లేదక్కా... నాన్నకు షుగర్ కంట్రోల్‌కావడం లేదని డాక్టర్ ఓ నాల్రోజులు హాస్పిటల్లో వుంచమన్నారు. అమ్మ నాన్నకు తోడుగా అక్కడే వుంది. నేను స్నానంచేసి హాస్పిటల్‌కెళ్తే అమ్మ ఇంటికొస్తుంది"

"ఇవాళ నేవెళ్ళి అమ్మని పంపిస్తాలే. రాణీ కాసిని వేణ్ణీళ్ళు పెట్టు" అన్నాను అలసటగా.

బెడ్‌మీద వాలిపోయాను కాసేపు.

ఓ అరగంటలో స్నానం గీనం ముగించుకుని రెడీ అయ్యాను.

ఈ లోపు రాణీ ఉప్మా చేసింది.

నేను కాస్త తిని... కాస్త బాక్స్‌లో వేసుకుని... ఫ్లాస్కులో పాలు పోసుకుని ప్లాస్టిక్ బుట్టలో సర్దుకుని బయల్దేరాను.

నన్ను చూసి అమ్మ సంతోషపడిపోయింది. చిక్కిపోయానంటూ బాధపడింది.

"నాన్నకు షుగర్ కంట్రోల్ కావడంలేదే అంజూ" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది.

"అబ్బబ్బ రాగానే దాన్ని కంగారుపెడతావేమే. ఇది అప్పుడప్పుడూ వుండేదేగా" అని అమ్మని కసిరి.

"ఏంరా... ఎట్లా వుంది స్టడీ. ఎప్పటి వరకూ హాలిడేస్? " అని అడిగారు.

"వచ్చే నెల ఎనిమిదో తేదీ వరకూ నాన్నా" అన్నాను.

అమ్మ లేచి "సరే మరి... నేనింటికెళ్లొస్తాను. నువ్వు నాన్నగారికి టిఫిన్ పెట్టెయ్" అంది.

"ఏం టిఫినమ్మా? " అన్నాడు నాన్న.

"ఉప్మా. రాణి చేసింది" అన్నాను.

"అబ్బబ్బ ఉప్మాతో చంపుతోందే రాణి" అన్నాడు.

"దాని కంతకంటే ఏం వచ్చు? అయినా నిన్న విక్కీ హోటల్లో ఇడ్లీ కొనుక్కుని వచ్చాడు కదూ" అందమ్మ.

"రేపట్నుండీ మీకిష్టమైనవన్నీ నే చేసి తెస్తాలే నాన్నా" అన్నాను.

"పాయసం తెస్తావురా? " అన్నాడాయన.

నాన్నకి పాయసమంటే ప్రాణం. షుగర్ రాకముందు పండగలకి అమ్మ పాయసం చేస్తే గ్లాసులుగ్లాసులు తాగేవాడు.

నా కళ్లలో నీళ్లు తిరిగాయి.

"పాయసమేంఖర్మ... లడ్డూ కూడా తెస్తుందిలే" అంది అమ్మ వెటకారంగా. ఆ వెటకారంలో ఆవేదనుందని నాకు తెలుసు.

అమ్మ బయల్దేరుతుంటే ఆమెకేసి పరిశీలనగా చూశాను. అమ్మని చూడని ఈ కొద్ది నెలలకాలం ఆమెలో ఏదో విపరీతమైన మార్పు తెచ్చింది.

పదేళ్ళు పై బడ్డ దానిలా వుంది.

"నీలో ఏదో మార్పొచ్చిందమ్మా" అన్నాను.

"డై చేసుకోలేదే. కళ్లు మంటలొస్తున్నాయ్. డాక్టర్ వద్దన్నారు. అయినా అల్లుళ్లొచ్చే వయసు. ఇప్పుడా సింగారం నాకెందుకులే" అని నిట్టూర్చి

"మధ్యాహ్నం లంచ్ విక్కీతో పంపిస్తా"

అంటూ వెళ్ళిపోయింది.

"రిక్షాలో వెళ్లు" చెప్పాను.

నాన్నకు స్టీల్ బాక్స్ మూత తీసి స్పూన్‌తో ఉప్మా తినిపిస్తూ అడిగాను. "ఎప్పుడు నాన్నా డిశ్చార్జ్ చేసేది?"

"ఇవాళో రేపో కంట్రోలవుతుందన్నారు. అవగానే చేస్తామంటున్నారు"

నాన్న ఉప్మా తిని, చక్కెర లేని పాలు తాగి, కాసేపు నాతో బాతాఖానీవేస్తూ అట్లా నిద్రలోకి జారిపోయాడు.

కుర్చీలో చేరబడి నాన్ననే చూస్తూ కూర్చున్నాను

ప్చ్... ఈ తియ్యటి జబ్బులో ఎంత చేదుంది!

అన్నీ తినకూడదు. తినగలిగినవి కూడా కొలత ప్రకారం తినాలి. కడుపుని చేతులారా మాడ్చుకోవాలి. అయినా అప్పుడప్పుడూ షుగర్ కంట్రోల్ కాదు. ఇట్లా హాస్పిటలైజ్ కావాలి.

ఇప్పుడే ఇట్లావుంటే మరో పదీ పదిహేనేళ్ళ తర్వాత పరిస్థితేంటి?

అప్పుడీమాత్రం ఆహారం కూడా తీసుకోకూడదు. ఏ రాగి అంబలో తాగి తృప్తిపడాలి. జీవితాంతం టాబ్లెటో, ఇంజెక్షనో తీసుకుంటూ బతకాలి.

'అమ్మ మాత్రం అల్లుళ్లొచ్చే వయసు' అని తననుతాను సమాధానపరుచుకుంటోంది. లేని ముసలితనాన్ని ఆపాదించుకుంటోంది.

అమ్మకేమంత వయసైందని, మహా అయితే ముప్పయి తొమ్మిదో నలభయ్యో వుంటాయ్. అమ్మకి పదహారో ఏటే పెళ్ళయిందని ఎప్పుడూ అంటూంటుంది. నేనామెకు పద్దెనిమిదో ఏట పుట్టానట. ఇప్పుడు నా వయసు ఇరవై ఒకటి దాటి ఇరవైరెండు. అంటే ఆమెకు ఎగ్జాక్ట్‌గా ముప్పయి తొమ్మిదే. ఇప్పట్లో అయితే కొందరు చదువులూ ఉద్యోగాల్లాంటి వ్యాపకాల్లో పడి ముప్పయిదాటాగ్గానీ పెళ్ళి చేసుకోవటంలేదు.

మరి అట్లాంటప్పుడు అమ్మ కూడా యంగ్ వుమనేగా!

ఆవిడక్కూడా తుమ్మెద రెక్కల్లాంటి జుట్టుని అందంగా జడగా అల్లికుని ఆ వాలుజడలో పూలు తురుముకుని, నాన్నకి అందంగా కనబడాలని వుండదా?

ఇప్పుడైతే అమ్మ జడవేసుకోవడమే మానేసింది. నిజమే, తెల్లబడిన జుట్టుతో జడల్లుకుంటే ఏం బాగుంటుంది? ఎబ్బెట్టుగా వుంటుంది. కాబట్టి అమ్మ వార్ధక్యపు వేషం వెయ్యాల్సిందే!

ఈ దురదృష్టం వీళ్లతో పోదు

అమ్మ తల నెరుపో, నాన్న షుగరో మాకొస్తుంది. లేదా దానిక్కారణమైన జీన్ మాలో సప్రెస్ అయినా అది మా సంతానంలో ఎక్స్‌ప్రెస్ కావచ్చు

ఇంతకన్నా ఏ టీబీనో, కేన్సరో నయం కదూ ఒక్కరితోనే పోతుంది. మహా అయితే టీబీలాంటిది పేషెంట్‌తో డైరెక్ట్ కాంటాక్ట్ పెట్టుకుంటే అంటుకుంటుంది. అతను వాడిన వస్తువులు మనం కాంటాక్ట్‌లో వుంచుకోకపోతే అది రాకపోవచ్చు. ఒకవేళ ఏ గాలి ద్వారానో వచ్చినా అది క్యూరబుల్. దానికి మందుంది.

కానీ... ఈ హెరిడిటరీ డిసీజెస్ అనేవి ఎంత దురదృష్టకరమైనవి!

ఇందుకేనేమో డాక్టర్ దిలీప్ అంత స్ట్రిక్ట్‌గా వుండేది.

ఒన్‌వే హి ఈజ్ రైట్

ఇప్పుడు నేను పెళ్ళిచేసుకుని పిల్లల్ని కనకుంటే ఏం? పిల్లల్నీ వాళ్లతోపాటూ రోగాల్నీ కనే హక్కు నాకెవరిచ్చారు?

నా తల పగిలిపోతోంది. ఇంకా అక్కడే కూర్చుని అట్లాగే ఆలోచిస్తుంటే నా తల్లో నరాలు చిట్లిపోతాయేమో అన్పించింది.

లేచి రూమ్ బయటకొచ్చి, ఆ హాస్పిటల్ వెయిటింగ్ హాల్లో కూర్చున్నాను.

చాలామంది పేషెంట్స్ డాక్టర్ కన్సల్టేషన్‌కోసం వచ్చి టర్న్‌కోసం ఎదురు చూస్తున్నారక్కడ.

వీళ్లంతా షుగరు పేషెంట్లే అనుకుంటుంటే ఎందుకో బాధగా అన్పించింది నాకు.

"మీలో ఎవరైనా పెళ్ళికాని వాళ్లుంటే దయచేసి

పెళ్లిచేసుకోకండి. పెళ్లయిన వాళ్లుంటే పిల్లల్ని కనకండి" అని పెద్దగా అరిచి చెప్పాలన్పించింది నాకు.

★ ★ ★

యూనివర్శిటీ హాలిడేస్ అయిపోయాయి. ఇవాళో రేపో... బయల్దేరాలనుకున్నాం నేనూ శిల్ప.

నాన్న ఆరోగ్యం బాగా కుదుటపడింది. ఇప్పుడు షుగర్ బాగా కంట్రోల్ అవుతోంది.

ఎప్పుడూ జడవేసుకునే అమ్మ ముడి చుట్టుకుని అద్దంలోకి పదిసార్లు చూసుకుని ఈ వెధవ నెరుపు నాకెక్కడ్నించి వచ్చిందో అని ఒకటే సణుక్కుంటుంటే నాన్న "నువ్వెలావున్నా... నాకందంగానే కనబడతావోయ్. నిజం చెప్పాలంటే మన మొదటి రాత్రి నీ ముఖంలో చూసిన మెరుపు ఇప్పటికీ అట్లాగే వుంది" అనడం... దానికి అమ్మ ముసిముసిగా నవ్వుతూ "చాల్లెండి సంబడం పిల్లలు వింటే పరువుపోతుంది. అయ్యగారు షుగరు పేషెంటైనా హుషారుకి మాత్రమేం తక్కువలేదు" అంటూ నాన్న చెవి మెలివెయ్యడం... లాంటి దృశ్యాల్ని చూసిన నేను మళ్లీ మీమాంసలో పడ్డాను.

నాన్న హాస్పిటల్లో వున్న ఆ నాల్రోజులూ తెగవర్రీ అయిపోతూ "ఏం బతుకులు మనవి? చేతినిండా సంపాదించుకుంటూ కూడా కడుపు నిండా తినడానికి లేకుండా... మనం పుట్టకపోయినా బాగుండేది" అంటూ కన్నీళ్లు పెట్టుకున్న అమ్మ ఇవాళ కొత్త పెళ్లికూతురిలా సిగ్గుపడుతోంది. జీవితాన్ని తిరిగీ అందమైన కోణంలోంచి ఆవిష్కరించుకుంటోంది.

ఇద్దరూ 'ఏం లేకపోయినా పర్లేదు. నాకు నువ్వూ నీకూ నేనూ వున్నాం' అనుకుంటున్నారు.

దానిక్కారణం ప్రేమేకదూ! దానికున్న మహత్తరమైన శక్తేకదూ!

హాస్పిటల్లో నాన్న వున్నప్పుడు రైట్ అన్పించిన దిలీప్ నాకిప్పుడు మళ్లీ రాంగ్ అన్పిస్తున్నాడు.

ఎల్లుండి పదో తేదీ.

ఆ రోజు సాయంత్రం ఆరింటికల్లా దిలీప్ రైటో, నేను రైటో తేలిపోతుంది. అంతలోపే ఎందుకీ టెన్షన్ అన్పించింది.

తొమ్మిదో తారీకు సాయంత్రానికల్లా విల్సనంకుల్ ఇంటికి చేరిపోయాం. ఈ హాలిడేస్‌లో దిలీప్ నాకోసం ఒక్కసారి కూడా ఫోన్ చేయలేదట. నేనిక్కడ లేనని అతనికి తెల్సేమోలే అనుకున్నా.

చూస్తుండగానే తెల్లవారింది.

"ఇవాళ యూనివర్శిటీకి వద్దు. సాయంత్రందాకా రెస్ట్ తీసుకుని ఫ్రెష్‌గా గుడికెళ్లు" చెప్పింది శిల్ప.

"అక్కర్లేదు, క్లాసులు మిస్సవటం నాకిష్టం లేదు" అన్నాను.

"నీకస్సలు టెన్షన్‌గా అన్పించటంలేదా? " అంది శిల్ప.

"ఎందుకూ టెన్షన్? " అన్నాను బింకంగా.

నిజం చెప్పాలంటే ఆ టెన్షన్నుండి తప్పించుకోటానికే నేను యూనివర్శిటీకి వెళ్లాలనుకున్న నిర్ణయం తీసుకున్నాను.

సాయంత్రం ఇంటికొచ్చి తలారా స్నానం చేసి ఆకాశం రంగు షిఫాన్ చీర తీసి కట్టుకోబోతుంటే "నీ దీపూ ప్రజెంట్ చేసిన పట్టుచీరె కట్టుకోకూడదూ? " అంది శిల్ప.

"అప్పుడే నీ దీపూ అనకు" చిరాగ్గా అన్నాను.

"సరే డాక్టర్ దిలీప్‌గారిచ్చిన" అని అదంటుంటే

"స్టాపిట్. అది కట్టుకునే అకేషన్ ఇది కాదు" అన్నాను.

"ఫస్ట్‌నైట్‌కి కడతావా?" అంది.

"చీప్ జోక్సెయ్యకు" అన్నాను అసహ్యంగా ముఖం పెట్టి.

అది నా టెన్షన్ని అర్థం చేసుకున్నట్టు కామ్‌గా వుండిపోయింది. అప్పుడన్పించింది నాకు అది కామ్‌గా వుండకుండా జోవియల్‌గా మాట్లాడుతుంటేనే నేను టెన్షన్ ఫ్రీ అవుతానని.

మొత్తానికి రెడీ అయిపోయాను.

ఎప్పట్లా శిల్పా కిందకెళ్లి ఓ గులాబీని తెచ్చి నా జడలో తురిమి నా బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

"జెరీనా ఆంటీ వాళ్ల గులాబీల తోటే సింది నీ ఫ్రెండ్ కోసమే అనుకుంటున్నావా ఏంటి శిల్పా. మాట్లాడితే పువ్వు పట్టుకొస్తావ్" అన్నాను.

"నీ జోక్స్ కాస్ట్‌లీనా?" అంది పోట్లాటకు దిగుతూ.

హాయిగా నవ్వాను.

"ఈ స్పెషల్ అకేషన్లో మాత్రం... నేన్నిన్ను సన్నీలో డ్రాప్ చెయ్యాల్సిందే. జస్ట్ గుడి దగ్గర దింపి వెళ్లిపోతాను. నేనేం స్టే చెయ్యన్లే" అంది రెబెకా.

"ఇది స్పెషల్ అకేషన్ ఎట్లా అవుతుంది రెబెకా! రిజల్ట్ తెలిస్తే.. అప్పుడు ఆ అకేషన్ని సెలబ్రేట్ చేసుకుందాం" అన్నాను.

శ్రీకాంత్ ఆటో స్టాండ్‌కెళ్లి ఆటో తీసుకొచ్చాడు. జెరీనా ఆంటీ నా తల మీద తల్లిలా చేయివేసి "థింక్ పాజిటివ్‌లీ. భయపడకు నువ్ గెలుస్తావ్" అంది.

ఆటో బయల్దేరుతుంటే శిల్పా విల్సనం కుల్ ఫ్యామిలీ మొత్తం బెస్ట్ విషెస్ చెప్పి చేతులూపుతూ నిలబడ్డారు.

ఇన్ని మంచి మనసులు ఇంతగా కాంక్షిస్తున్న విజయం నాకు దక్కుతుందేమో అన్పించింది.

జెరీనా ఆంటీ చెప్పినట్టుగా పాజిటివ్‌గా ఆలోచిస్తూ ఆలయానికి దిలీప్ వచ్చి "నీ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ చూశాను. బట్ స్టిల్ ఐలవ్‌యూ" అని చెబ్తున్నట్టుగా వూహించుకుంటూ ఆటో సీటుకు చేరబడి కూర్చున్నాను.

★ ★ ★

ఆరు దాటేంతవరకూ ఆరాటంగా చూశాను. ఏడు దాటుతుండగా మాత్రం నన్ను నిరాశ నిలువెల్లా కమ్మేసింది.

తొమ్మిదైంది. అయినా ఇంటికి వెళ్లబుద్ధి కాలేదు. వెళ్లి వాళ్లకేం చెప్పాలి.

నా ప్రేమ.. దిలీప్ హృదయంలో ఎటువంటి స్పందనా కల్గించలేకపోయిందని చెప్పాలా?

లేక అతను హృదయ స్పందన అంటే ఏంటో తెలీని జడుడు అని చెప్పాలా?

వాళ్లకు సరే!

నాకు నేనేమని చెప్పుకోవాలి.

"అజంతా నువ్వు ఓడిపోయావ్. ఘోరంగా ఓడిపోయావ్. ఈ మెటీరియలిస్టిక్ వరల్డ్‌లో ప్రేమకీ ప్రేమను నమ్ముకున్న నీలాంటి వాళ్లకీ ఫ్యూచర్‌లో ఇక చోటే వుండబోదు. యు ఆరెపూల్" అని నన్ను నేను నిందించుకోవాలా?

గుడి తలుపులు మూసేసిన పూజారి నాకేసి చిత్రంగా చూస్తూ "రాత్రి పది కావస్తోంది. ఇంకా ఇక్కడే వున్నావేంటమ్మా" అనడిగే వరకూ... నాకు నేనే తెలియని స్థితిలో వుండిపోయాను.

ఆయన మాటల్తో చప్పున లేచి నుంచున్నాను.

"పదమ్మా... వీధి చివరి వరకూ తోడుగా వస్తాను. అక్కడ్నుంచీ ఏదైనా సిటీబస్ పట్టుకుని వెళ్దువుగానీ." అన్నాడాయన.

"అక్కర్లేదండీ... నే వెళ్తాను" అని గుడి బయటకు వచ్చాను. వీధిలోకి వచ్చాగ్గానీ తెలియలేదు. పూజారిగారు మెయిన్‌రోడ్ వరకూ తోడుగా ఎందుకొస్తానన్నారో.

గుడి ముందు ఇదివరకున్న వీధిలైటు ఇవాళ వెలగటంలేదు.

వెనక్కెళ్లి ఆయన తోడు అడుగుదాం

అనుకుంటున్నంతలో దూరం నుండీ ఏదో వెహికల్ వస్తూన్నట్టు కనబడింది.

అది బైక్‌లా వుంది.

ఒకవేళ దిలీప్ బైక్‌లో వస్తున్నాడేమో అనుకున్నా. నా గుండె దడదడ కొట్టుకుంది.

నా వూహ తప్పని ఋజువు కావటానికి నిముషం కూడా పట్టలేదు.

బైక్ మీద వచ్చింది విల్సనంకుల్.

"ఏంటమ్మా! ఇంతసేపు! అంతా కంగారు పడుతుంటే నేను బయల్దేరి వచ్చాను"

అంకుల్‌ని చూడగానే నాకెందుకో దుఃఖం ముంచుకొచ్చింది.

అది ఓడిపోయిన ఉక్రోషం కావచ్చు దిలీప్ ప్రేమ దక్కలేదన్న బాధకావచ్చు.

"ఎక్కమ్మా" అన్నాడాయన.

బహుశా నాకన్నీరు ఆ చీకట్లో ఆయన గమనించి వుండరనుకున్నా.

"మళ్లీ మాట్లాడుకుందాం. ముందు నువ్ కూర్చో" అన్నాడాయన.

దార్లో అన్నాడాయన "తొమ్మిది గంటలప్పుడు శిల్పా టెన్షన్ పట్టలేక... దిలీప్ క్లినిక్‌కి ఫోన్ చేసింది. అతను క్లినిక్‌లో వుంటే నిన్ను ఎటెండ్ అవనట్టూ లేకుంటే నీ లవ్ సక్సెస్ అయినట్టు అనుకున్నాం. అయితే ఫోన్లో నర్స్ చెప్పిన విషయం విన్నాక నువ్ అప్‌సెట్ అయ్యి ఇంతసేపూ ఇంటికి రాలేదని అర్ధమైంది. ఇక ఆగలేక వెదుక్కుంటూ బయల్దేరాను. దార్లో పెట్రోల్ అయిపోవటంతో టేంక్ ఫిల్ చేయించి వచ్చేసరికి లేటయింది"

ఆయన చెప్పిందంతా విని అడిగాను. "ఫోన్లో నర్స్ ఏం చెప్పిందంకుల్?"

దిలీప్‌కి అలయన్స్ చూడ్డానికి ఫ్యామిలీ అంతా అయ్యగారితో సహా విజయవాడ వెళ్లారట" చెప్పాడాయన.

★ ★ ★

"అసలా దిలీప్... నాటైటాల్ హ్యూమన్ బీయింగ్" అంది రెబెకా.

"హ్యూమానిటీనే లేదు" అంది నర్గీస్.

"అతనికి బొత్తిగా లవ్‌సెన్స్ లేదు" అన్నాడు శ్రీకాంత్.

"అట్లాంటి వ్యక్తి నుంచి ప్రేమను ఆశించడంకన్నా ఇసుక నుండి తైలం పిండటం సులభం" అంది శిల్పా.

అందరి కామెంట్స్ నిశ్శబ్దంగా విన్నాక విల్సనంకుల్ అన్నాడు "ఇక మీదట దిలీపూ ప్రేమా అన్న మాటలు ఈ ఇంటి కాంపౌండ్ లోపల వినబడ్డాయో అన్నదెవరైనా సరే బెల్ట్ తెగుతుంది. ఇప్పటికే ఈ డర్టీగేమ్‌తో విలువైన సమయం వృధా అయింది. గప్‌చుప్‌గా ఎవరి గదులకి వాళ్లు వెళ్లిపొండి"

ఆయన స్వరంలో ఇప్పుడు వినిపించినంత కఠినత్వం ఇంతకు ముందెప్పుడూ ధ్వనించలేదు.

ఆ వాయిస్‌లోని డెప్త్‌కి... రెబెకా, నర్గీస్, శ్రీకాంత్ ఎక్కడి వాళ్లక్కడ టెర్రస్ దిగి పారిపోయారు.

వాళ్లంతా వెళ్లిపోయాక ఆయన మా వైపు తిరిగి "చూడండీ! ఏదో తెలివైన వాళ్లుకదా! సాయం చేద్దామని ఇన్నాళ్లూ మిమ్మల్ని ఎంకరేజ్ చేశాను. నేనూ మీతోపాటు పొరపాటు చేశాను. ఇక మీదట అటువంటి పొరపాట్లు జరగడానికి వీల్లేదు. దృష్టంతా చదువుమీదే పెట్టాలి. జస్ట్ యూనివర్శిటీ, ఇల్లూ అంతే దట్సాల్" అన్నాడు.

"అప్పుడప్పుడూ సినిమా థియేటర్" అంది శిల్పా.

"షటప్! అధిక ప్రసంగం చేస్తే ఇల్లు ఖాళీ చేసి పోవాల్సి వుంటుంది" ఆయన స్వరం కొత్తగా వుంది.

నేనూ శిల్పా అవాక్కయ్యాం.

విల్సనంకుల్... ఇట్లా మాట్లాడ్డమా!

ఇంత కఠినంగా ఇంత ఇన్సల్టింగా!

శిల్పా ముఖం అవమానంతో ఎర్రగా కందగడ్డలా అయింది. నాదీ దాదాపు అట్లాగే అయివుంటుందని నాకు తెలుసు.

"గాట్ మై పాయింట్" అన్నాడాయన మా ఇద్దరికేసి ఉరిమి చూస్తూ.

ఇన్నాళ్లూ ఆయన కళ్లనుండి జాలు వారి మమ్మల్ని ఆర్ద్రంగా స్పృశించే ఒక ఫ్రెండ్లీ గెశ్చర్ ఇప్పుడా కళ్లలో మచ్చుకైనా లేదు.

నేనూ శిల్పా లేచి నిలబడ్డాం మా పోర్షన్‌లోకి దారి తీసే మెట్లవైపు నడిచాం.

మొదటి మెట్టుమీద నేనట్లా అడుగు పెడుతుండగానే "అంజూ" అన్న ఆయన స్వరం ఎప్పట్లా ప్రేమగా వినబడింది.

నేనూ శిల్పా ఆశ్చర్యంగా వెనుదిరిగాం.

ఆయన మాకు దగ్గరగా వచ్చి నా కళ్లలోకి గాఢంగా చూస్తూ "మీ నాన్నయితే అచ్చం ఇట్లాగే అరుస్తాడు కదరా" అన్నాడు.

ఆ మాట నన్నెక్కడో తాకింది. ఆయన అంతరంగం అర్థమైంది.

నా కనుకొలుకుల్లో ఓ కన్నీటి బిందువు మెరిసింది.

హఠాత్తుగా ఆయన చేతిని అందుకుని అరచేతిని ముద్దాడాను.

ఆయన మరో చేతిని నా తల మీద వేసి నిమురుతూ అన్నాడు "ఇవాల్టినుండీ నేను మీ నాన్న రోల్ పోషించబోతున్నాను. కోణంగి ఫ్రెండ్స్ మాటలు విని దిలీపుల్నీ గిలీపుల్నీ నీ మనసు గడప తొక్కనిచ్చావో"

"బెల్టు తెగుతుంది" అన్నాను హాయిగా నవ్వుతూ.

★ ★ ★

ఓ నెల రోజులగ్గానీ మామూలు మనిషిని కాలేదు నేను.

ఇప్పుడు నా మనసులోంచి దిలీప్ అనే వ్యక్తిని పూర్తిగా తుడిచేశాను. కనీసం అతని జ్ఞాపకం కూడా నా మనసులోకి రానివ్వనంత మెంటల్ స్టెబిలిటీని సంపాదించుకున్నాను.

శిల్పా ఎప్పుడైనా అతని వూసెత్తి తిట్టబోతే "అంకుల్‌కి చెబ్తా... బెల్ట్ తెగుతుంది" అని జోక్ చేసే స్థాయికి ఎదిగిపోయాను.

ఇప్పుడు దిలీపెవరో, నేనెవరో.

మనసంతా చదువుమీద లగ్నం చేశాను.

ఓ రోజు న్యూస్ పేపర్ తిరగేస్తుంటే లోకల్ ఎడిషన్‌లో దిలీప్ ఫొటో కనబడింది.

కేజువల్‌గా చూశాను.

సర్జరీలో మెళకువలు నేర్చుకోవడానికి ఆర్నెల్లపాటు అమెరికా వెళుతున్నాడట. అతని ఫెలో డాక్టర్స్ అతని విదేశయానం సుఖప్రదంగా జరగాలని కోరుకుంటూ పత్రికా ముఖంగా శుభాకాంక్షలు తెలిపారు.

చదివి పక్కన పడేశాను.

నా మనసేమైనా బాధపడిందేమో నాకు తెలీదు. ఎందుకంటే వెంటనే నేను మరో పేజీలో వున్న సినిమా యాడ్స్‌ని చూస్తూ ఎంజాయ్ చెయ్యడంలో నన్ను నేను ఎంగేజ్ చేసుకున్నాను.

శిల్పా "శరీరాల్ని కొయ్యటంలో కాదు మనసుల్ని కొయ్యటంలో కూడా మెళకువలు నేర్పిస్తారేమో అమెరికాలో. అది కూడా నేర్చుకొస్తే వెరైటీగా వుంటుంది" అంటూ ఏదేదో సణుగుతోంది గాని నేను చెవికెక్కించుకోలేదు.

అసలతని గురించి ఆలోచించటమే నాకిష్టం లేనప్పుడు అతనెట్లా పోతే నాకెందుకు?

టెర్మినల్స్ దగ్గర పడుతున్నాయి. ప్రిపరేషన్ హాలిడేస్ డిక్లేర్ చేశారు.

నాన్న ఇంటికి రమ్మని ఫోన్ చేశారుగాని ఇంటికెళ్లేకన్నా ఇక్కడే వుండి కంబైన్డ్‌స్టడీ చెయ్యడం బెటరని నేను, శిల్పా అనుకోవడంవల్ల నాన్నకు రావటం కుదరదని నచ్చజెప్పాను. నాన్నే ఓసారి ఇక్కడకొచ్చి నన్ను చూసెళ్లారు.

రెండ్రోజుల్లో శిల్పా బర్త్‌డే వుంది.

శారీ కొనాలని ఇద్దరం కలిసి షాపింగ్‌కెళ్లాం.

షాపింగ్ పూర్తి చేసుకుని బయల్దేరబో

తుంటే రోడ్డుమీద ఒక ఆటో స్కూటరూ గుద్దుకున్న సంఘటన జరిగింది.

నిముషాల్లో జనం గుమిగూడిపోయారక్కడ. నేనూ శిల్పా జనంలోకి వెళ్లాం. స్కూటరిస్ట్ కిందపడిపోయాడు గాని దెబ్బలేం తగల్లేదు. ఆటో డ్రైవరూ సేఫ్‌గానే వున్నాడు. అయితే షడన్ జర్క్‌వల్ల ఆటోలో ప్యాసింజర్ ముందుకు తూలడంతో నుదురు ఇనుపకమ్మీకి తగిలి చిట్లింది. రక్తం ముఖం మీదకు కారుతోంది.

"అరె! ఆవిడ దిలీప్ మదర్" అన్నాను.

శిల్ప "అవునా... బాప్‌రే ఆ రక్తం చూడు" అంది.

జనాన్ని తోసుకుని ఆటో దగ్గరికి వెళ్లాం. ఆమె సీట్లో వెనక్కి చేరబడి కళ్లు మూసుకుని వుంది. ఆటోలోకి ఎక్కి కర్చీఫ్‌తో ఆమె నుదుట బలంగా అదిమి పట్టుకున్నాను.

ఆవిడ నేనెవర్నో కూడా గుర్తించే స్థితిలో లేదు. బహుశా స్పృహలో లేదేమో అన్పించింది.

స్కూటరిస్ట్ ఆటో డ్రైవర్ మీదకు దూకుతున్నాడు నానా మాటలంటూ.

ఆటో డ్రైవర్ గట్టిగానే మాట్లాడుతున్నాడు. "మిష్టర్ అర్జంటుగా ఆటో పోనీ. తప్పెవరిదో తరవాత, ముందు ఈవిడ్ని హాస్పిటల్లో అడ్మిట్ చెయ్యాలి" అని శిల్ప గట్టిగా అరిచి మాట్లాడింది.

జనమంతా మమ్మల్నే సపోర్ట్ చేశారు. స్కూటరిస్టుకీ ఆటో డ్రైవర్‌కీ సర్ది చెప్పారు.

అదృష్టం బాగుండి దగ్గర్లో ట్రాఫిక్ ఐలెండ్ లేకపోవడంతో పోలీస్ గొడవ లేకుండా పోయింది.

శిల్ప ఆటో ఎక్కి దిలీప్ నర్సింగ్ హోమ్ అడ్రస్ చెప్పింది.

ఇక్కడికది చాలా దూరం ఈవిడకేమో బ్లీడింగ్ ఆగటంలేదు.

ఇంతలో ఆటో డ్రైవర్ అన్నాడు.

"పక్క సందులో శాంతీ క్లినిక్ వుందమ్మా! అక్కడికి పోనిస్తా. మీరు చెప్పిన చోటుకి వెళ్లేసరికి రక్తం బాగా పోయేలావుంది"

"సరే పద" తొందర చేశాను.

నాలుగే నాలుగు నిముషాల్లో క్లినిక్ ముందు ఆగింది ఆటో.

డ్రైవర్ సాయంతో ఆవిడ్ని లోపలికి తీసికెళ్లాం.

డాక్టర్ ఇమీడియట్‌గా అటెండ్ అయ్యాడు.

గాయానికి స్టిచెస్, డ్రెస్సింగ్ అదీ అయ్యాక మాతో అన్నాడు.

"చాలా చిన్న గాయం. రక్తం ముఖంమీదకు కారడంతో ఆవిడ ప్యానిక్ అయ్యారు. దాంతో స్పృహ పోయింది. అంతే... అంత భయపడాల్సిందేమీ లేదు"

"ఈజ్ షి ఆల్‌రైట్ డాక్టర్?" అన్నాను.

"హండ్రెడ్ పర్సెంట్" అన్నాడు డాక్టర్ నవ్వుతూ.

ఆయనట్లా చెబుతుండగానే నర్సొకామె ఆవిడ చెయ్యి పట్టుకొని నడిపించుకొచ్చి డాక్టర్ కెదురుగా వున్న చెయిర్లో కూర్చోబెట్టింది.

కళ్ళు మూస్తూ తెరుస్తూ అతి నీరసంగా కుర్చీలో వాలిపోయి కూర్చుందావిడ.

ఒక్కసారి మాత్రం నాకేసి చూసి "నువ్వామ్మాయ్" అంది.

అంటే హాస్పిటల్‌కి తన్నెవరు తీసుకొచ్చింది కూడా గమనించలేదావిడ.

"మీరు అనవసరంగా భయపడుతున్నారు. అసలేం జరగలేదు. తలక్కాస్త గాయం..." అని ఆవిడకి ధైర్యం చెబుతూనే ప్రిస్క్రిప్షన్ రాసి నా చేతికిచ్చి అవి ఎట్లా వాడాలో చెప్పాడు. చెప్పాక "మీరావిడకు ఏమవుతారు?" అని మా ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.

ఆవిడ తెప్పరిల్లినట్టుగా కళ్ళు తెరిచి డాక్టర్‌కేసి చూసి "అన్నీ సవ్యంగా వుండుంటే, ఆ పిల్ల ఈపాటికి నా కోడల

య్యుండేది" అంది.

ఆవిడట్లా చెప్పడం నాకస్సలు నచ్చలేదు. ఎప్పటికీ జరిగే అవకాశం లేని విషయాన్ని గురించి నిట్టూర్పులు వదలడం నాకిష్టం లేని పని.

"దెబ్బతగిలింది తలకి కాబట్టి స్కానింగ్ తీయిస్తే మంచిదేమో!" అంది శిల్ప నాతో చిన్నగా.

డాక్టర్‌కి వినబడింది అదన్నమాట.

"ఇన్‌జురీ ఓపెన్‌టైప్ కదమ్మా స్కాన్ అవసరం లేదు. మీరు కావాలంటే అలాగే తీద్దాం" అన్నాడు.

"మీరు వద్దంటే ఎందుకులెండి డాక్టర్" అన్నాను.

"ఆవిడకి బాగా రెస్ట్ అవసరం. తాగడా నికి వేడిగా త్రీ అవర్స్‌కోసారి ఏదైనా ఇస్తూండండి" అన్నాడు డాక్టర్.

ఆవిడ్ని చెరోవైపూ పట్టుకుని నడిపించు కుంటూ కన్సల్టింగ్ రూమ్ బయటకు వచ్చాం ఇద్దరం. ఆవిడ్ని ఇంటిదాకా వెళ్ళి దిగబెట్టాలనుకుంటుంటే "అమ్మాయ్ మీకెం దుకు శ్రమ, వెయిటింగ్ హాల్లో కూర్చుం టాను, ఆయనకు ఫోన్ చెయ్యండి. వచ్చి తీసికెళ్తారు" అందావిడ.

"మళ్ళీ ఆయన్ని కంగారుపెట్టడమెందు కండీ? మాకేం శ్రమలేదు లెండి. మీరేం ఫీల్‌కాకండి" అని చెప్పి హాస్పిటల్ ఆవర ణలోనే వున్న మెడికల్‌షాపులో మందులు కొంది శిల్ప.

హాస్పిటల్ గేట్లో నిలబడి ఆటోని కేకే శాను.

అందరం ఎక్కి కూర్చున్నాక ఆటో కది లింది.

ఓ ఇరవై నిముషాల రైడ్ తర్వాత, ఆటో ఇంటిముందాగింది.

ఆటో ఫేర్ ఇస్తుంటే, "అమ్మాయ్ నేనిస్తా నువ్వాగు" అందావిడ అంత నీరసంలో కూడా.

నేన్నవ్వి ఫేర్ చెల్లించేశాను. ఆవిడ్ని లోప లికి తీసుకెళ్తుంటే తలకున్న కట్టు చూసి వాచ్‌మెన్, పనమ్మాయీ కంగారుపడి పోయారు.

వాళ్ళకు సర్దిచెప్పి, ఆవిడ్ని బెడ్‌రూమ్‌లోకి తీసికెళ్లాం. ఆవిడ నిస్త్రాణగా బెడ్‌మీదకు ఒరిగిపోయింది.

మేమిద్దరం... ఒకరం బెడ్‌మీదా, ఒకరం అక్కడే వున్న చెయిర్లోనూ కూర్చున్నాం.

గుడ్లప్పగించి చూస్తున్న పనమ్మాయికి "కాఫీ పెట్టి తీసుకురా, అర్జంట్" అని చెప్పింది శిల్ప.

ఆ పిల్ల అయిదు నిముషాల్లో పొగలు కక్కే కాఫీ ట్రేని పట్టుకొచ్చింది.

ఆవిడ్ని లేపి, దిండ్లకు ఆనించి కూర్చోబెట్టి కాఫీ కప్పు అందించాను.

నాలుగ్గుక్కలు తాగాక, ఆవిడ కాస్త తేరు కుంది.

నా పాలిట దేవతల్లాగా వచ్చారమ్మాయ్. సమయానికి మీరు లేకుంటే నేనేమయ్యే దాన్నో" అందావిడ.

"కార్లో వెళ్తారు కదా యూజువల్‌గా. ఆటో ఎందుకెక్కారు? " అనడిగింది శిల్ప.

"వుండటానికి రెండున్నాయమ్మాయ్. ఒక టేమో ఆయన ఆఫీసుకి తీసుకెళ్ళారు. రెండోది రిపేర్లో వుంది. మా బావగారికి మనమరాలు పుట్టిందని తెలిసి . ఆగలేక పోయా. ఆయనకు ఫోన్‌చేస్తే కారు పంపారు. వెళ్ళటం కార్లోనే వెళ్లాను. రావటం ఎప్పుడో నిర్ణయించుకోలేక, ఆటోలో వెళ్లొచ్చులే అని డ్రైవర్ని కారు తీసి కెళ్ళిపోమని చెప్పా. నా ఖర్మిట్లాకాలింది" అందావిడ.

"పెద్ద సారుకి ఫోన్ చేస్తానమ్మా" అంది పనమ్మాయి.

"ఒద్దులే... కంగారు పడి పన్లన్నీ వదిలేసి పరుగెత్తుతారు. సాయంత్రం చెబుదాంలే" అందావిడ.

ఇద్దరం ఇక బయల్దేరతామని చెప్పాం. ఆవిడ భోంచేసి వెళ్ళమని బతిమాలింది.

"ఇదా భోంచేసే సమయం... మీకు తగ్గాక ఓ సారొస్తాం లేమ్మా" అంది శిల్ప.

ఏ టైమ్‌లో ఏ టాబ్లెట్ వెయ్యాలో పని పిల్లకి వివరించి చెప్పాను.

నేనట్లా చెబుతున్నప్పుడు ఆవిడ నాకేసి కన్నార్పకుండా చూడ్డం గమనించి "ఏంటమ్మా అట్లా చూస్తున్నారు? " అన్నాను నవ్వుతూ.

"ఇక్కడుండి నన్ను చూసుకోవల్సిన దానివి అప్పగింతలు పెట్టి వెళ్ళిపోతుంటే బాధగా వుందమ్మా" అంది.

నేనావిడ కళ్లలోకి చూశాను.

నన్ను పోగొట్టుకున్నానన్న భావన ఆవిడ కళ్లలో తడితడిగా మెరుస్తోంది.

"నాపట్ల ఈమాత్రం అభిమానం, ప్రేమా నీ కొడుక్కి లేవు కదమ్మా. నన్నేంచెయ్య మంటావ్" అందామనుకున్నాగాని అనలేక పోయా.

నవ్వి వూరుకున్నాను.

"అమ్మాయ్... నేనో మాటడుగుతా, ఏమ నుకోవుగా" అందావిడ.

"అడగండి" అన్నాను.

"మా అబ్బాయికేం తక్కువైందని నచ్చ లేదు నీకు? "

నేను అవాక్కయ్యాను.

ఖచ్చితంగా దిలీప్ ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ గోల పెద్దవాళ్ళకు తెలీదని నిర్ధారణ అయింది నాకు. పైపెచ్చు జరగని పెళ్ళికి కారణాన్ని రివర్స్‌లో చెబుతున్నాడన్నమాట.

"మా అంజూకి మీ అబ్బాయి నచ్చకపోవ డమేంటండీ? మీ అబ్బాయికే మా అంజూ నచ్చలేదు" అంది శిల్ప.

ఆవిడ నమ్మలేనట్టు చూసింది.

"అదేంటమ్మాయ్ నిశ్చితార్థం వరకూ వచ్చాక నేన్నిన్ను చేసుకోను పొమ్మని, నువ్వేకదూ ఫోన్లో అబ్బాయికి చెప్పావ్. పైన మీ మామయ్యొచ్చి అమ్మాయికిప్పుడ ప్పుడే పెళ్లిష్టంలేదూ ఏమనుకోకండీ అని నచ్చజెప్పాకే కదూ, మేం మీ సంబంధం వదులుకున్నాం"

పైకి జరిగింది అంతే కదా! అందుకే ఆవి డకి తెలిసింది ఆవిడ చెప్తోంది, నన్ను నిల దీస్తోంది. నాకా పరిస్థితి ఇబ్బందిగా అన్పించి "శిల్పా ఇక వెళ్దాం" అన్నాను.

శిల్ప అదేం పట్టించుకోకుండా "అయితే మీకు మీ అబ్బాయి పెళ్ళి తప్పిపోవటానికి గల అసలు కారణం తెలీదన్నమాట" అంది ఆశ్చర్యంగా.

నేను శిల్ప కాలు కసుక్కున తొక్కాను.

"నోర్మూసుకో" అన్నాను దానికి మాత్రమే వినబడేలా.

"ఏంటమ్మా ఆ అసలు కారణం" అందా విడ శిల్పవంక ఆసక్తిగా చూస్తూ.

"ఏం లేదండీ. నాకు మేనరికం వుంది. మీతో నిశ్చితార్థం అనుకున్నామా, ఈలోపు మా మేనత్తొచ్చి గొడవ చేసింది. అవన్నీ మీకు చెప్పడం బాగుండదని అట్లా చెప్పారు మావాళ్ళు" గబగబ కోశాను.

మళ్ళీ నోరెత్తబోతున్న శిల్పజబ్బ మీద కందవూడి వచ్చేలా గిల్లి, గుడ్లురిమి, రెక్కప ట్టుకుని దాన్ని బయటకు లాక్కెళ్లాను.

"అమ్మాయ్... వీలు చూసుకుని ఓసారి మళ్ళీ రండి" అందామె వెనకనించి.

"తప్పకుండా వస్తామండీ" అన్చెప్పి పట్టు కున్న రెక్కని వదలకుండా గేటు దాటేవ రకూ అట్లాగే లాక్కెళ్లాను దాన్ని.

నా శారీస్ కవర్ లోపలే మర్చిపోయా నంటూ అది గోలపెడుతుంటే మా వెనకే వచ్చిన పనమ్మాయితో చెప్పి తెప్పించాను. అప్పుడు గుర్తొచ్చింది నాకు దిలీప్ క్లినిక్ ఫోన్ నెంబర్ తెలుసుగాని రెసిడెన్స్‌ది తెలీ దన్న విషయం. పనమ్మాయినడిగి నోట్ చేసుకున్నాను.

ఆటోలో బయల్దేరాక అడిగిందది "ఆ దిలీపంటే అంతలావు ఇదెందుకు నీకు? ఆ మహానుభావుడు ఐడోంట్ లవ్‌యు అని చెప్పేసినా... ఆయనగారి మీద ఈగ వాల నివ్వవేం? క్యా మత్‌లబ్? "

"ఆ బుద్ధవిగ్రహం మీద ఈగవాలితే నాకెందుకూ, కాకి వాలితే నాకెందుకూ?" అంటూ విసుక్కుని "ఈవిడకి చెప్పడం, మళ్ళీ ఈవిడ ఆయనగార్ని నిలదియ్యటం. అతనొచ్చి మా పేరెంట్స్‌కి తెలీనివ్వొద్దని మిమ్మల్ని పెళ్ళి చూపుల్లోనే రిక్వెస్ట్ చేశా కదా, ఇదేం న్యూసెన్స్ అని నన్ను దబాయించడం, ఇవ్వన్నీ నాకు నచ్చవ్. పైపెచ్చు నేనేదో ఆ గ్రీకు వీరుడికోసం పడి చస్తున్నట్టూ, వాళ్ళమ్మ కాళ్లా వేళ్ళాపడి రికమెండ్ చేయించుకున్నట్టూ అతననుకుంటే నా ప్రిస్టేజేం కావాలి" అన్నాను ఆవేశంగా.

"అదా నీ బాధ. నా ఉద్దేశం అది కాదులే, వాళ్లమ్మింత గడ్డిపెడుతుందని" అంది శిల్ప.

"గడ్డి వాళ్ళమ్మే పెట్టాలా? అమెరికా నుంచి వచ్చాక కావాలంటే మనమే ఓ లారీడు పంపిద్దాంలే" అన్నాను.

★ ★ ★

శిల్ప బర్త్‌డే రోజు ఇంటికెళ్ళి పలకరించి స్వీట్ ఇచ్చి వచ్చాం. దిలీప్ మదర్‌కి యాక్సిడెంటయి పదిహేను రోజులైపోయింది. నేనో, శిల్పో ప్రతిరోజూ ఫోన్ చేసి, ఎట్లా వుందో అడుగుతూనే వున్నాం.



"అంతా బాగానే వుందమ్మాయ్... తల మాత్రం విపరీతమైన నొప్పిగా వుంటోంది అని ఓ రోజూ, తలనొప్పి తగ్గిందిగాని అతి నీరసంగా వుంది అజంతా అని ఓరోజూ" అట్లా కంప్లైనింగ్‌గానే చెప్తుండేది.

"నీ కాబోయి, తప్పిపోయిన అత్తగారికి భయం కాస్త ఎక్కువే. ఐయామ్ ఆల్‌రైట్ అని ఒక్కసారీ చెప్పదే" అంటుండేది ఆవిడకి ఫోన్‌చేసిన ప్రతిసారీ శిల్ప.

అదట్లా అన్నప్పుడల్లా "కాబోయి, తప్పిపోయిన అత్తగారంటూ నువ్వంత కష్టపడిపోనక్కర్లేదు. ఆవిడ పేరు హైమావతి" అని కోప్పడేదాన్ని.

ఆ తర్వాత్తర్వాత ఫోన్ చెయ్యడం మానేశాం. స్టడీస్‌లో పడిపోయాం.

చూస్తుండగానే ఎగ్జామ్స్ మొదలయ్యాయి. ఎగ్జామ్స్ జరిగినన్ని రోజులూ జెరీనా ఆంటీ 'నో స్వయంపాకం' అంది. అన్నీ కన్నతల్లిలా ఆమే అమర్చింది.

చివరి ఎగ్జామ్ రాశాక విల్సనంకుల్ ఫ్యామిలీతో కల్సి సినిమాకెళ్ళాం.

మరుసటిరోజు ఊరికి బయల్దేరుతుంటే పిల్లలంతా స్టేషన్‌దాకా వచ్చి సెండాఫ్ ఇచ్చారు.

రైలు కదులుతుండగా అంది శిల్ప "ఓసారి హైమావతిగార్ని మీటవ్వాల్సింది"

"లేనిపోని బంధాలు పెంచుకోవడం నాకిష్టంలేదు శిల్పా. ఆపదలో వుంది, సహాయం చేశాం దట్సాల్. ఇక ఆ పరిచయం అనవసరం" అన్నాను.

అట్లా అన్నాక కాసేపటివరకూ ఏం మాట్లాడాలన్పించలేదు. మన సెందుకో మూగగా అయిపోయింది.

శిల్ప కూడా నన్ను డిస్టర్బ్ చెయ్యకుండా స్టార్‌డస్ట్ తిరగేస్తూ కూర్చుండిపోయింది.

ఎప్పుడు నిద్రలోకి జారిపోయానో నాకే తెలీదు. తెలతెలవారుతుండగా శిల్ప నన్ను కుదిపి లేపింది దిగాల్సిన స్టేషన్ వచ్చేసిందంటూ.



"రాణి ఏదమ్మా? " అన్నాను.

"పైన చదువుతున్నట్టుందే" అందమ్మ.

సాయంత్రం ఆరవుతోంది. సాధారణంగా రోజూ రాణి కంప్యూటర్ క్లాస్‌కెళ్లే టైం అది. ఇవాళ తలనొప్పిగా వుందంటూ క్లాస్‌కెళ్లలేదది.

చల్లగాలి పీల్చుకుందామని అట్లా మేడమెట్లెక్కి వెళ్లాను.

పిట్టగోడనానుకుని అటు తిరిగి నిలబడి దీక్షగా ఏదో చదువుతోంది రాణి. నేనొచ్చిన అలికిడిని కూడా గుర్తించ లేదు. అంత ఏకాగ్రతగా అది చదివేదేమిటో నా కంతుపట్ట లేదు. దగ్గరగా వెళ్లి "రాణీ!" అనిపిల్చాను.

అదట్లా వులిక్కిపడుతుందని నేనూహించలేదు. చప్పున ఆ కాగితాన్ని నలిపినట్టుగా మడిచి చేతిని వెనక్కి దాస్తూ ఇబ్బందిగా నవ్వింది.

దాని వులికిపాటూ, ఇబ్బందీ నాలో ఆసక్తిని రేపాయి.

"ఏంటది? " అన్నాను వెనక్కు దాచిన చేతివంకే అనుమానంగా చూస్తూ.

"అబ్బే! ఏంలేదు. ఏముంది? "

అదలా అంటుండగానే... అది ఊహించని రీతిలో చటుక్కున దాని చేతిని ఒడిసి

పట్టుకుని బలవంతంగా గుప్పిలివిప్పి ఉండలా నలిపివేయబడిన ఆ కాగితాన్ని లాక్కున్నాను.

నేనట్లా చేయకుండా ఉండివుంటే ఖచ్చితంగా రాణి పిట్టగోడమీంచి అవతలకి విసిరివేసి ఉండేదే.

మడతలు విప్పి చదువుతూ ఉంటే.... అది కంగారుగా లాక్కోటానికి ప్రయత్నించింది గానీ నేను దొరకనివ్వలేదు.

"చదవనీ" అన్నాను కఠినంగా.

రాణింకేం మాట్లాడలేదు. గత్యంతరం లేనట్టు తలదించుకుని నిలబడింది.

'నా రాణీ!

నీ హృదయసామ్రాజ్యానికి నేనే రాజుని కావాలి. అట్లా కాలేకపోయిననాడు నేను బతకటం వ్యర్థం.

నిజం రాణీ! నువ్వు లేని నా హృదయం దేవతలేని గుడి. జాబిలి లేని ఆకాశం.

కళ్లు మూసినా... తెరిచినా... నాకు నువ్వే కనిపిస్తున్నావు. నిద్ర రావడంలేదు. అన్నం సయించడంలేదు.

ఐ లవ్ యూ రాణీ! ఐ లవ్ యూ సో మచ్. నా ప్రేమని నువ్వు తిరస్కరిస్తే... నాకు చావే శరణ్యం. నా ప్రాణాలు నీ చేతుల్లో ఉన్నాయి. నువ్వు నాకు లేని నాడు ఈ ప్రాణాలతో నాకు పనిలేదు. అవలీలగా తీసేసుకుంటాను.

నేను చావటమా? బతకటమా? అనేది నీ చేతుల్లో ఉంది.

నాకు ఐ లవ్ యూ చెబుతావో.. శాశ్వతంగా 'బై' చెబుతావో పూర్తిగా నీ ఇష్టం.

బలవంతం చెయ్యను. అయితే ఒక్కటి మాత్రం నిజం. నువ్వు నా ప్రేమని అంగీకరించని మరుక్షణం నేనీ లోకంలో ఉండను.

రేపు సాయంత్రం ఎనిమిదింటికి కంప్యూటర్ క్లాస్ వదలగానే శివాలయం దగ్గర నీకోసం ఎదురుచూస్తూ ఉంటాను. రాలేదో అదే నీ సమాధానం అనుకుని... అక్కడే... స్పాట్ లో ప్రాణాలు తీసుకుంటాను....

రాణీ! నన్ను బతికిస్తావు కదూ?

నీ బాబు

చదవటం పూర్తయ్యాక తలెత్తి రాణివైపు చూశాను.

"నాకేం తెలీదు. నేను వాడివైపుకి కూడా ఎప్పుడూ చూళ్లేదు" రాణి స్వరంలో గిల్టీఫీలింగ్, ముఖంలో భయం స్పష్టంగా కనిపిన్నాయి.

"రాణీ! నాకర్థమయింది. ఇందులో నీ తప్పేం లేదు."

నా మాటలు రాణికి గొప్ప రిలీఫ్‌నిచ్చాయి. రాణిలో భయం సర్దుకుంది.

"వాడొట్టి ఫూల్. ఎన్నిసార్లు ఛీ కొట్టినా నా వెనక పడుతూనే ఉంటాడు. మొన్న చెంపకూడా పగలకొట్టాను. అయినా సిగ్గు లేదు వెధవకి"

నేనాలోచనలో పడ్డాను. ఉత్తరమంతా చస్తా చస్తానని బెదిరించాడు. ఎమెచ్యూర్‌లకి ఆవేశమెక్కువ. ఆలోచన తక్కువ. ఇట్లాంటివాళ్లు అన్నంత పనీ చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఆ ఉత్తరంలో మెన్షన్ చేసిన డేట్ గమనించాను. అది నిన్న రాయబడింది. అంటే ఇవాళ ఎనిమిది తర్వాత వాడు ఆత్మహత్యా ప్రయత్నం చేస్తానంటాడు.

నిజంగా చేస్తాడా?

"రాణీ! వీడేదైనా అఘాయిత్యం చెయ్యడు గదా?"

ఒకవేళ చేస్తే ఆనక జరిగే పరిణామాలు ఊహించటానికే భయపడ్డాను.

"చస్తే చావనీ వెధవని. పీడా వదుల్తుంది. ఇవ్వాళ నేను క్లాస్ ఎగ్గొట్టిందే వీణ్ణి తప్పించుకోడానికి" గొప్పగా అంది రాణి.

"నో... రాణీ! అట్లా అనకూడదు. నీవల్ల ఒక మనిషి చావడం నీకు బాధకదూ!"

"ఇట్లాంటి వాళ్లు చస్తే చావరక్కా" చెప్పింది రాణి.

దాని మాటలు నాకు నచ్చలేదు. చాలా టెన్షన్‌గా ఉంది నాకు.

"పోనీ విక్కీగాడికి చెబ్దామా? వాడికి బ్యాచుంది. సున్నంలోకి ఎముక మిగల కుండా చేస్తారు వాళ్లు" అంది రాణి.

విక్కీగాడూ, వాడికో బ్యాచ్... అంత టెన్షన్‌లోనూ నవ్వొచ్చింది నాకు.

"ఏంటక్కా! అలా చేద్దామంటావా? "

"ఊహూ" తల అడ్డంగా తిప్పాను. కొట్టాల్సినంత నేరం అతనేం చేశాడు అనుకున్నాను.

"పోనీ నాన్నకు చెబ్దామా? పోలీస్ కంప్లయింట్ ఇస్తాడేమో" అంది రాణి.

దానికీ తల అడ్డంగా ఊపాను. "వద్దు రాణీ. నాన్నకు టెన్షన్ పనికి రాదు. షుగర్ పెరిగిపోతుంది."

"మరేంచేద్దామక్కా? "

"ఇప్పుడు టైమెంతయింది రాణీ? " అన్నాను ఆకాశంలో అప్పుడప్పుడే పొడుస్తున్న చుక్కల్ని చూస్తూ.

"ఏడు దాటి ఉండచ్చు" అంది రాణి.

"అయితే పద" అన్నాను.

"ఎక్కడికీ? "

"శివాలయం దగ్గరకి"

"అక్కా" పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు చూసింది రాణి.

అది భయపడుతోందని అర్థమయింది నాకు.

"భయం లేదు రాణీ.... నేనున్నాగా" భుజం మీద ఊరడింపుగా చెయ్యేశాను.

అదింకా అదోలా చూస్తుంటే నన్ను... "బాబు చచ్చిపోవడం నిజంగా నీకిష్టమా? " అన్నాను.

"ఉహూ..." తల గబుక్కున అడ్డంగా తిప్పింది.

"మరి అతను చావకుండా చూడాలా? వద్దా? " అడిగాను.

రాణి నిశ్శబ్దంగా మెట్లు దిగింది నావెనకాలే.

"అమ్మా! శిల్ప ఇంటిదాకా వెళ్లొస్తా" వంటింట్లో ఉన్న అమ్మను కేకేసి చెప్పాను.

"ఇంత చీకట్లోనా? " అంది అమ్మ.

"ఏడేగా! రాణీని తోడు తీసుకు వెడుతున్నాలే." అంటూనే రాణిని తీసుకుని బయటకి నడిచాను.

★ ★ ★

ఏడుగంటలకు ఇంట్లో బయలుదేరిన రాణీ, నేనూ శివాలయం దగ్గరకు చేరుకునే సరికి దాదాపు అరగంట పైనే పట్టింది.

శివాలయం అంతా వెతికినా బాబు కనపడలేదు.

"ఒట్టి చీట్... నేన్రాకపోతే చస్తానని చెప్పి... అసలు వాడే అంతులేడు." అంది రాణి కోపంగా మొహం పెట్టి.

ఓ అద్భుతమైన షో ని చూడబోతున్న అవకాశాన్ని ఆఖరి క్షణంలో జారవిడుచుకున్న ఫీలింగ్ కనపడింది దాని ముఖంలో నాకు.

అప్రయత్నంగా నవ్వుకున్నాను.

"సరే ఎలాగూ వచ్చాం. దేముడికి అర్చన చేయించి వెడదాం పద" అన్నాను.

గుడి బయట ఉన్న స్టాల్‌లో పూజ సామాగ్రి కొని కౌంటర్లో టిక్కెట్టు తీసుకుని అర్చన చేయించాం.

ఇదంతా అయ్యేసరికి.. ఎనిమిదీ పది అయింది.

ఇద్దరం కొబ్బరిముక్కలు తింటూ ఆవరణలో కూర్చున్నాం. అప్పుడొచ్చింది నాకా ఆలోచన.

బాబు... రాణినొక్కదాన్నీ రమ్మన్నాడు. ఇట్లా మందీ మార్బలంతో కాదుగదా?

రాణితోపాటు నేను రావడం చూసి భయపడిపోయి ఎక్కడో దాక్కొని ఉంటాడు. అదే మాట రాణితో అన్నాను.

రాణి అవునన్నట్టు తలూపి ఓమాటంది. "ఇదే నా సమాధానం అనుకుని చావడు గదా? "

నా వెన్ను ఝల్లుమంది.

పాపం! తెలిసీ తెలియని వయసు. పువ్వు పూసినంత సహజంగా అతని మనసులో ప్రేమ పుట్టింది. అది నేరం కాదు. అందుకు చావంతటి శిక్ష పడకూడదు.

నేను చప్పున లేచి నిలబడ్డాను.

"వెళ్దామా?" రాణి కూడా లేచింది.

"లేదు రాణీ! నేను వెళ్లిపోయినట్టు ఏక్ట్ చేస్తా. నువ్విక్కడే కాసేపు కూర్చో బాబు నిన్ను కలుస్తాడేమో"

"ఆ వెధవ నన్ను కలవకపోతే ఏం?" రాణి చిరాగ్గా మొహం పెట్టింది.

నాలో ఉన్న కలవరం రాణిలో లేదు. దీని కోసమా బాబు చావాలి?

"చెప్పినట్టు చెయ్యి" కసిరినట్టుగా అని... అక్కణ్ణుంచి బయటికి వచ్చి ఆటో ఎక్కాను. అయితే నిజంగా వెళ్లాలని కాదు. అల్లా చేస్తే బాబు నేను వెళ్లిపోయానని నమ్ముతాడు. అతనట్లా నమ్మితే గానీ రాణిని ఎప్రోచ్ అవడు.

శివాలయానికి వంద గజాల దూరంలో ఆటోని ఆపి... డ్రైవర్ చేతిలో పది రూపాయలు పెట్టాను. వడివడిగా నడుచుకుంటూ శివాలయం చేరుకున్నాను.

నా అంచనా తప్పు కాలేదు. రాణితో మాట్లాడుతూ కనిపించాడు బాబు.

దొంగలాగ వెళ్లి వాళ్లకు పదడుగుల దూరంలో నిలబడ్డాను.

బాబు ఏమన్నాడో గానీ మా రాక్షసి గొంతు స్పష్టంగా వినిపిస్తోంది. "నువ్వేమైనా అనుకో బాబూ! ఐ కాన్ట్ లవ్ యూ"

"ఇదేనా నీ సమాధానం?" అన్నాడు బాబు.

"ఆ... ఇదే" అందది.

"నన్ను లవ్ చెయ్యవు"

"చెయ్యను"

"నీ మనసు మారదు"

"మారనే మారదు"

"పోనీ ఆలోచించి చెబ్తావా?" ఆశగా అడిగాడు బాబు.

"ఆలోచించను"

బాబు ఒక్క క్షణం స్థబ్దుగా ఉండిపోయి చివుక్కున తీశాడు ప్యాంటు జేబులోంచి ఓ మూడంగుళాల బాటిల్ని.

చకచకా మూత విప్పుతున్నాడు.

నాకర్థమయింది. అది విషమని. చప్పున వెళ్లి బాటిల్ పట్టుకుని ఉన్న అతని కుడి చేతిని గట్టిగా ఒడిసి పట్టుకున్నాను. అతనొక్క క్షణం షాకయినట్టు నాకేసి చూశాడు. మరుక్షణం బాటిల్ నాకు దొరక్కుండా లాక్కోవాలని పెనుగులాడాడు.

"బాబూ! మర్యాదగా ఆ బాటిల్ ఇవ్వు"

"నన్ను చావనివ్వండి ప్లీజ్... నన్ను చావనివ్వండి. రాణి లేని జీవితం నాకక్కర్లేదు. ఆమె లేకుండా నేను బతకలేను" ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్టుగా మాట్లాడుతున్నాడు.

ఎంతకీ అతని చేతుల్లోంచి బాటిల్ విడిపించుకోలేకపోతున్నాను.

ఆ చేతి పట్టు చూస్తుంటే నాకర్థమయిపోయింది, చావాలని అతనెంత బలంగా నిర్ణయించుకున్నాడో.

లాగిపెట్టి ఒక్కటిచ్చాను చెంపమీద. ఆ దెబ్బకు దిగిపోయింది మత్తు. అతని గుప్పిలి వదులైంది. బాటిల్ నాచేతికొచ్చింది.

చెంప పట్టుకుని అలాగే నిలుచుండిపోయాడు. మూసుకున్న అతని కళ్లనుంచి ధారాపాతంగా నీళ్లు కురుస్తున్నాయి.

ఎందుకో చెప్పలేను గానీ బాబు మీద అంతులేని అభిమానం కలిగిందా క్షణంలో. అతని భుజాలమీద మృదువుగా చేతులు వేసి తీసికెళ్లి ఓ పక్కగా కూర్చోబెట్టాను. రాణి నిశ్శబ్దంగా మమ్మల్ని అనుసరించింది.

నేను బాబు పక్కనే కూర్చుని మార్దవంగా అతని తల నిమిరాను. నాకాక్షణంలో నా తమ్ముడు విక్కీనే కళ్లముందు కదిలాడు.

లేత మనసు. చిగురుటాకు. సుడిగాలి వీస్తోంది. తట్టుకుని నిలబడితే మహావృక్ష

మవుతాడు. లేకుంటే నేలకొరిగిపోయి అస్థిత్వం లేకుండా పోతాడు.

అందుకే అతనికి ఆసరా ఇవ్వాలనుకు న్నాను. ఐ మస్ట్ హెల్ప్ హిమ్.

"చూడు బాబూ! రాణి దక్కలేదంటే చచ్చి పోతానంటున్నావ్. మరి చచ్చిపోతే రాణి నీకు దక్కుతుందా? "

బాబు చటుక్కున తలెత్తి ఏదో అనబో యాడు. నేను వారిస్తూ అన్నాను "నీకు రాణిమీదున్నలాంటి ఫీలింగ్ రాణికి నీమీద ఉండాలా అక్కర్లేదా? ప్రేమనెప్పుడూ డిమాండ్ చెయ్యకూడదు. అలా చేస్తే నీకూ గూండాలకీ తేడా లేదు"

బాబు నాకేసి అదోలా చూశాడు. "ఓ మనిషిని బలవంతంగా, బెదిరించి దౌర్జ న్యంగా తీసుకుంటే అది డబ్బయినా, ప్రేమైనా... ఇంకేదైనా సరే గూండాయి జమే అవుతుంది"

బాబు రోషంగా చూశాడు. "నేనేం గూండాయిజమ్ చెయ్యలేదు. చచ్చిపోవాల నుకున్నా"

"ఆహా... రెండింటికీ తేడా ఏంటమ్మా? నువ్వు చస్తావ్. ఎందుకు చచ్చావని పోలీ సులు ఎంక్వయిరీ చేస్తారు. కారణం రాణి అని తెలుస్తుంది. దాన్ని అరెస్టు చేస్తారు. కేసు పెడతారు. అది జైలుకెళ్ళుతుంది. దాని జీవితం నాశనమవుతుంది. సో... గూండా బతికుండి సాధిస్తే, నువ్వు చచ్చి సాధిస్తావ్, అంతేగా? "

బాబు మౌనంగా ఉండిపోయాడు.

"నీ వయసు జస్ట్ పదిహేడు, పద్దెనిమిది ఉంటుంది. ఇంత చిన్న వయసులోనే జీవి తంమీద విరక్తి పుట్టిందా? నువ్వు సాధిం చాల్సినదంతా ఏం కావాలి? "

"రాణి లేకపోయాక ఏం సాధించి ఏం లాభం? "

"అవును.... రాణి చాలా గొప్ప వ్యక్తి. నీ ఉత్తరం చదివి 'వీడో ఫూల్... చస్తే చావనీ' అనుకున్న మనిషి. ఆ మనిషి కోసం... నవమాసాలూ మోసి, కని, పెంచి.. నీమీదే ఆశలు పెట్టుకున్న తల్లిదం డ్రుల్ని మోసం చేసి.. నువ్వు చావడం చాలా న్యాయం.. అవును కదూ? "

బాబు రాణివంక చూశాడు.

"దాన్నేం చూస్తావ్? నన్ను చూడు. నువ్వంటే దానికసలు ఏ ఫీలింగూ లేదు. ఒకవేళ.. నువ్వు రాణికోసం చనిపోయి ఉంటే ఏం జరిగుండేదో తెలుసా? "

అతను ఆసక్తిగా నాకేసి చూశాడు. "రాణి కచ్చితంగా ఏడ్చి ఉండేది కాదు నీకోసం. తనమీదకెక్కడ వస్తుందో అని భయపడిపో యేది. కొన్నాళ్ళపాటు... మా బంధువులి ళ్ళల్లో తల దాచుకునేది. ఆనక సమస్య సమసిపోయాక ఎప్పట్లా హాయిగా ఫ్రెండ్స్‌తో తిరుగుతూ చదువుకుంటూ తన కెరీర్‌ని తను తీర్చి దిద్దుకునేది. తరువాత చక్కగా పెళ్ళి చేసుకుని, పిల్లల్ని కనేది. అంతేగానీ.... నిన్నే తలుచుకుంటూ లేడీ దేవదాసు కానేకాదు. ఎందుకంటే అది నిన్ను ప్రేమించలేదు. ఇప్పుడు చెప్పు.... రాణికోసం నువ్వు చచ్చిపోతావా? "

"అయితే ఎప్పటికీ రాణి నన్ను ప్రేమిం చదా? " అడిగాడు బాబు అనుమానంగా.

"నో. నేను దాని అక్కను కదా! నాకు తెలుసు, దాని మెంటాలిటీ. నీ లెటర్ చదివి నేను ఫీలయ్యి, అయ్యో పాపం, చచ్చిపోతా డేమో అంటే... అదేమందో తెలుసా? 'చస్తే పీడా పోతుంది' అంది"

అలా చెప్పి రాణివంక చూశాను. అది కాస్త ఇరిటేట్ అయి నన్ను కోపంగా చూసింది. నేను దానికి కనుసైగ చేసి ఐస్ చేస్తూ మళ్ళీ బాబుతో "అర్థమైందా? బతి కున్నా అది నిన్ను ప్రేమించదు. చనిపో యినా ప్రేమించదు. సో... రెండింట్లో ఏది బెటరో నువ్వే తేల్చుకో" అంటూ ఇంతక్రితం అతన్నుండి లాక్కున్న బాటిల్ని అతని చేతిలో పెట్టాను.

కొద్దిసేపు ఆ బాటిల్ వైపు తదేకంగా

చూసిన బాబు... దాన్ని చేతిలోకి తీసుకుని రాణికేసి నిరసనగా చూశాడు. నాక్కావల్సిన ఎక్స్‌ప్రెషన్ అదే.

బాబు ఆ బాటిల్ని ఆలయం ప్రహరీ గోడ మీదుగా... చెట్లలోకి విసిరి కొట్టాడు.

"నౌ యు బికేమ్ నార్మల్" అన్నాను.

"థాంక్స్ మేడమ్! నా కళ్లు తెరిపించారు" నాతో అన్నాడు రాణి కేసి కసిగా చూస్తూ.

అతనిలోని అంత ప్రేమా... క్షణాల్లో ఎంత ద్వేషంగా మారింది?

నవ్వుకున్నాను. ఇక నెక్స్ట్... ఆ ద్వేషాన్ని ఫ్రెండ్లీ ఫీలింగ్‌తో న్యూట్రలైజ్ చెయ్యాలి.

అందుకే అన్నాను" నాక్కాదు నువ్వు థాంక్స్ చెప్పాల్సింది, రాణికి"

"ఈవిడగారికా? " ఈసడింపుగా చూస్తూ అన్నాడు.

"యస్! ఈవిడకే. ఎందుకో తెలుసా? సహజంగా ఏ ఆడపిల్లైనా.. తను ఇష్టపడని వ్యక్తినుంచి ప్రేమలేఖ అందుకుంటే దాన్ని ఈవ్ టీజింగ్‌గా భావిస్తుంది. సదరు వ్యక్తి తనను అల్లరి పెడుతున్నట్టుగా భావించి గొడవ చేస్తుంది. ఇంట్లో అన్నదమ్ములకో, ఇన్‌స్టిట్యూట్‌లో ప్రిన్సిపాల్‌కో ఆ లెటర్ చూపించి కంప్లెయింట్ చేస్తుంది. వాళ్ల చేతుల్లో ఆ వ్యక్తి శిక్షించబడాలని కోరుకుంటుంది. కానీ మా రాణి అలా చెయ్యలేదు.

చావు నడ్డు పెట్టి నువ్వు తనని బ్లాక్‌మెయిల్ చేసినా.... అది ఎవరితోనూ చెప్పలేదు. క్లాస్ మానేసి ఇంట్లో కూర్చుని తనలో తను బాధపడిందేగానీ... నీమీద ఎవరికీ కంప్లెయింట్ చెయ్యలేదు. అనుకోకుండా నీ ఉత్తరం నాకంటబడి అది దొరికిపోయిందిగానీ తనకై తను నాకేం చెప్పలేదు. సో... యూ షుడ్ థాంక్ హెర్. నాట్ మీ"

బాబు కాసేపు మాట్లాడకుండా ఉండిపోయాడు. తరవాత ఏమనుకున్నాడో మరి.... రాణివంక చూడకుండానే రాణితో "థాంక్యూ" అన్నాడు.

రాణి కామ్‌గా ఉంటే "వెల్‌కమ్ చెప్పు" అన్నాను.

అది సణిగినట్టుగా "వెల్‌కమ్" అంది.

బాబు వెళ్లబోతుంటే "ఆగాగు.... ఇప్పుడు మనం ఐస్‌క్రీమ్ పార్లర్‌కి వెడుతున్నాం" అన్నాను.

అతను వద్దంటున్నా వినిపించుకోకుండా బలవంతంగా పార్లర్‌కి తీసుకువచ్చాను.

ఓ రౌండ్ ఐస్‌క్రీమ్ కప్పులు ఖాళీ చేశాక ఖచ్చితంగా బాబు కూల్ అయిపోయి వుంటాడనుకుని "ఏం బాబూ! ఇప్పుడు చెప్పు నీ ఆలోచన తప్పా? రైటా? " అని అడిగాను.

"ఏదీ? ప్రేమించడమా? ప్రేమకోసం చావాలనుకోవడమా? " అడిగాడతను.

"రెండోది. ప్రేమించడం తప్పని ఎవరూ అనరు"

రాణి కళ్లద్దాలు తీసి, కర్చీఫ్‌తో గ్లాసెస్ క్లీన్ చేసి మళ్లీ పెట్టుకుంది. ఆ దృశ్యం చూడగానే... నాకు దిలీప్ గుర్తుకొచ్చాడు.

నేను బాబుకేసి ఓ క్షణం చూసి అడిగాను "బాబూ! నిన్నో విషయం అడుగుతాను, ఏమనుకోవుగా" అన్నాను.

"అడగండి మేడమ్!" అన్నాడు.

"మా రాణిని నువ్వు ప్రేమించానన్నావ్, బాగానే ఉంది. ఒకవేళ దానిలో ఏదైనా లోపం ఉందని తెలిసినా నీ ప్రేమలో మార్పు ఉండేది కాదా? "

"ఒక్కటి కాదు మేడమ్! వంద లోపాలున్నా ప్రేమకవి కనబడవు. ఒకవేళ కనబడ్డాయా అది ప్రేమే కాదు"

బాబును మెచ్చుకోలుగా చూశాను.

లోకంలో అందరూ దిలీప్‌లే ఉండరు. ప్రపంచం.. మరీ మెటీరియలిస్టిక్ అవలేదు.

ముగ్గురం లేచి పార్లర్ బయటికి వచ్చాం.

లీవ్ తీసుకుని వెళ్లిపోతున్న బాబు నాకళ్లకు... ఎమెచ్యూర్ బాయ్‌లా కనబళ్లేదా

క్షణం... ప్రేమకు నిలువెత్తు నిర్వచనం చెప్పిన ఋషిలా కనబడ్డాడు.

"వెళ్లొస్తా మేడమ్!" అంటున్న బాబుతో...

"బాబూ! మా రాణి నీకు ప్రేమికురాలు కాలేకపోవచ్చు... ఈ క్షణం నుంచీ మంచి స్నేహితురాలు. ప్రేమ ప్రాణం తీస్తుందేమో గానీ స్నేహం మాత్రం ప్రాణం పోస్తుంది. బీ ఫ్రెండ్లీ విత్ హెర్. ఇద్దరూ కలిసి మాట్లాడుకోండి. కలిసి చదువుకోండి. చర్చించుకోండి. మీరెంచుకున్న ఫీల్డులో మీరు సెటిల్ అయ్యేదాకా మీ స్నేహం కొన సాగితే.... అప్పటికి మీ స్నేహానికి ప్రేమ పరిమళాలు అంటితే... మిమ్మల్నీ, మీ ప్రేమనీ దీవించే మొదటి వ్యక్తిని నేనే అవుతాను"

ఎందుకట్లా చెప్పానో నాకే తెలీదు. చెప్పేశానలా నా ప్రమేయం లేకుండానే.

రాణీ నాకేసి ఆశ్చర్యంగా చూస్తుంటే... "రాణీ! బాబు... ఇవ్వాల్టినుంచీ నీ ఫ్రెండ్" అన్నాను.

బాబు చెయ్యి చాపాడు. తటపటాయిస్తున్న రాణి చేతిని నేనే అతని చేత్తో కలిపాను.

"పాయిజన్ అవసరం లేనిది స్నేహమొక్కటే" అన్న మాటలకు బాబూ, రాణీ ఇద్దరూ నవ్వేశారు.

★ ★ ★

కళ్లు మూసి తెరిచేంతలో వెకేషన్ అయిపోయింది. మళ్లీ విల్సనంకుల్ ఇంట్లో చేరిపోయాం. నేను ఎమ్మే ప్రీవియస్ సిక్స్టీ ఫైవ్ పర్సెంట్ మార్కులతో పాసయ్యాను. శిల్పకి సిక్స్టీ పర్సెంటే వచ్చింది.

"లవ్‌లో ఫెయిలైనా నేనే నయమే... మాంచి పర్సెంటేజ్ తెచ్చుకున్నా" అంటూ శిల్పా నేడిపించాను.

"అంతా నీవల్లే. లవ్‌లో ఫెయిలైంది నువ్వూ విషాదగీతాలు పాడింది నేనూ. దిలీప్ గురించీ నీ గురించీ ఆలోచించీ ఆలోచించీ బుర్ర పాడుచేసుకున్నాను" అంటూ కయ్యిమంది.

విల్సనంకుల్ "ఫర్లేదు, ఇద్దరిదీ మంచి పర్సెంటేజే" అంటూ మెచ్చుకున్నారు.

"నో అంకుల్. నేను ఇంప్రూవ్‌మెంట్ రాస్తాను, దీన్ని డామినేట్ చేసేదాకా జుట్టు ముడివెయ్యను" అంది తల దువ్వుకుంటున్నదల్లా ఆపేసి.

"రాయడం మంచిదే. నీది సైన్స్‌కదా. మంచి స్కోరింగ్ సబ్జెక్ట్. ట్రైటు గెట్ డిస్టింక్షన్" అన్నాడాయన.

మళ్ళీ యూనివర్శిటీకెళ్ళడం, రావడం, చదువుకోవడం, భోంచెయ్యడం, పడుకోవడం, రొటీన్ లైఫ్‌లో బిజీ అయ్యాం.

"ఒక్కసారి హైమావతిగారికి ఫోన్ చెయ్యవే పాపం" అంది శిల్ప వున్నట్టుండి ఓరోజు.

"ప్చ్, వద్దు" అన్నాను.

"దిలీప్ అమెరికానుండి వచ్చేసుంటాడు" అందది మళ్ళీ.

"ఇంప్రూవ్‌మెంట్ రాస్తానన్నావుగా. పుస్తకం తీసి చదువ్" అన్నాను.

"పోనీ నేను రింగ్ చేసి పలకరించనా ఆవిడ్ని?" వదల్లేదది.

"అది నీయిష్టం. ఆవిడ నన్ను ఫోన్లోకి పిలిస్తే మాత్రం, నేనింట్లో లేనని చెప్పు"

"ఎక్కడికెళ్ళావని చెప్పను?"

"హెయిర్‌కటింగ్ సెలూన్‌కెళ్ళానని చెప్పు" కోపంగా అన్నాను.

శిల్ప కింద పోర్షన్‌లోకెళ్ళింది ఫోన్ చేస్తానంటూ. "దిలీప్ అమెరికానుండి వచ్చేసుంటాడు" అన్న శిల్ప మాటలు నా మైండ్‌లో రివైండ్ అయ్యాయి.

ఎందుకో తెలీదు. మనసులో దిగులు నిండిపోయింది.

"నో... నేనట్లాంటి ఫీలింగ్స్‌కి బానిసని కాకూడదు" గట్టిగా నిర్ణయించుకుంటూ ఈమధ్యే చూసిన 'నువ్వేకావాలి'

సినిమాలోని "ఎక్కడ వున్నా నువ్వే నా పక్కన వున్నట్టుంటుంది" పాటని హమ్ చేయడం మొదలెట్టాను.

శిల్ప చెకచెక మెట్లెక్కి వగరుస్తూ వచ్చి నిలబడింది.

హమ్మింగ్ ఆపేసి, దాని వంక ప్రశ్నార్థకంగా చూశాను.

"హైమావతిగారు మెంటల్లీ డిజార్డర్ అయ్యారట" అందది.

"వ్వాట్" అన్నాను విస్తుపోతూ.

"నిజం అంజూ! దిలీపే స్వయంగా చెప్పాడు. అతను అమెరికానుండి వచ్చి పది హేన్రోజులవుతోందట. ఉన్నట్టుండి నాల్రోజుల్నుండీ మతిస్థిమితం కోల్పోయినదాన్లా బిహేవ్ చేస్తోందట"

"మైగాడ్ ఎంత ఆరోగ్యంగా వుండేదావిడ నమ్మలేకపోతున్నాను.

"ఓసారెళ్ళి చూసొద్దాం. నా బర్త్‌డే నాడు మనం వెళితే తలకంత దెబ్బతగిలి వుండి కూడా ఎంత హడావుడి చేసిందీ ఆవిడ! తల్చుకుంటుంటే చాలా బాధగా వుందే" అంది.

వెళ్లాలనే అన్పించింది నాకు. నేను సరే అనేలోగానే శిల్ప మళ్ళీ "ప్లీజ్... ఇట్లాంటప్పుడు ఇంకేం ఆలోచించకూడదు" అంది.

"సరే పద వెళ్దాం" అన్నాను.

ఓ పదిహేన్నిముషాల్లో రెడీ అయిపోయి జెరీనా ఆంటీకి విషయం చెప్పి బయట పడ్డాం.

మేం వెళ్లేసరికి దిలీపూ, దిలీప్ ఫాదరూ ఇంట్లోనే వున్నారు. సాధారణంగా వాళ్ళు ఇంట్లో వుండని టైమ్ అది. అయినా వున్నారంటే, వాళ్ళు డ్యూటీని కూడా పక్కనపెట్టేంత క్రిటికల్‌గా వుందేమో ఆవిడ పొజిషన్ అన్పించింది నాకు.

దిలీప్, అతని ఫాదరూ కూర్చోండి, నిల్చోండి అంటూ ఏవో మర్యాదలు చేస్తున్నారుగాని నేనదేం పట్టించుకోకుండా "ఆంటీకెలావుంది? " అన్నాను ఆత్రంగా.

దిలీప్ మమ్మల్ని నిశ్శబ్దంగా ఆవిడ గదికేసి తీసుకెళ్ళాడు. గది తలుపు మూసి వుంది.

"లోపలికెళ్ళి చూడండి" అన్నాడు.

మెల్లగా తలుపు నెట్టుకుని మేం లోపలికి అడుగుపెట్టేసరికి హైమావతిగారు మోకాళ్ళ మీద తల ఆనించుకుని కిటికీలోంచి తదేకంగా బయటికి చూస్తున్నారు.

మేం వచ్చిన అలికిడికైనా ఇటు తిరగ లేదు.

"ఆంటీ" అంది శిల్ప.

ఆమె రెస్పాండ్ కాలేదు. నేనూ పిల్చి చూశాను. ఉహు... ఆమెలో కదలికే లేదు.

నేను బెడ్ అంచుమీద కూర్చుని నా చేతిని ఆమె భుజంమీద వేశాను.

ఆ స్పర్శ ఆమెలో కదలిక తెచ్చింది.

చప్పున తల తిప్పి నాకేసి చూసింది.

ఆవిడ కళ్ళు దైన్యంగా వున్నాయి. ఆవిడ ముఖంలో కనబడ్డ విషాదానికి నేను చలించిపోయాను.

దిలీప్‌ని పక్కనపెట్టేస్తే, ఈవిడ నన్నెంతగా అభిమానించింది.

నేనే ఈ పెళ్లిని కాదన్నాననుకుని ఎంత బాధపడింది.

కాదన్నానని తెలిసి కూడా ఎంతగా ఆదరించింది.

నాకు తెలియకుండానే... నా కళ్లల్లో చివ్వున ఊరింది కన్నీరు.

"ఆంటీ" అన్నాను ఆర్ద్రంగా.

ఆవిడ నావంక నిరాసక్తంగా చూసింది.

"నన్ను గుర్తు పట్టారా? " అన్నాను.

ఆవిడ అట్లాగే చూస్తోంది. ఆ చూపు నావైపు చూస్తున్నట్టుగా లేదు. ఆమె ఎటో చూస్తుంటే మధ్యలో నేను అడ్డుగా ఉన్నట్టనిపించింది.

"నేను అజంతాని... ఇది శిల్ప... బాగున్నారా ఆంటీ? " అన్నాను మళ్లీ.

"మాట్లాడండి, ప్లీజ్!" అంది శిల్ప.

ఆమె చూపుల్లో ఏ చలనం లేదు. అల్లా

చూస్తూ ఉందంతే.

నేనూ, శిల్పా ముఖాముఖాలు చూసుకుంటుంటే దిలీప్ ఆ గదిలోకి వస్తూ అన్నాడు "మీరట్లా ఎంతసేపు ట్రై చేసినా ఆమె బదులీయదు. కాకపోతే చూపుల్ని ఇంకోవైపు మళ్లిస్తుందంతే"

"అసలు... మాటే లేదా? " అడిగింది శిల్ప.

"మాట్లాడుతుంది. తన కిష్టమయితే... జీవితంలో అన్నీ పోగొట్టుకున్న వ్యక్తిలా నిరాశగా మాట్లాడుతుంది. ఉన్నట్టుండి వెక్కివెక్కి ఏడుస్తుంది" చెప్పాడు.

"ఆహారం? " అన్నాను.

"అక్కడ పెట్టేస్తాం. తింటే తింటుంది. లేదంటే ఎంతసేపయినా అట్లాగే ఉంటుంది."

ఆవిడకేసి చూశాను. ఎప్పుడు తలతిప్పుకుందో మరి, మళ్లీ కిటికీలోంచి బయటకి చూస్తోంది.

ఇద్దరం లేచి దిలీప్ వెనకే వచ్చి హాల్లో కూర్చున్నాం.

"సైకియాట్రిస్ట్‌ని కన్సల్ట్ చేశారా? " అంది శిల్ప.

"ఆ... రోజూ ఇంటికే వస్తున్నాడు. తను నా ఫ్రెండే. ప్రవీణ్ అని సైకో ఎనలిస్ట్"

"ఏమంటారు? " అడిగాను ఆసక్తిగా.

"డిప్రెషన్ అంటున్నాడు. ఆమెలో... ఎందుకో విత్‌డ్రాయల్ నేచర్ ఏర్పడుతోందిట. అందరినుంచీ అన్నిటినుంచీ తనను తాను దూరం చేసుకోవాలన్న ఫీలింగ్ ఆమెలో రోజురోజుకీ పెరిగిపోతోందంటున్నాడు"

"ఉన్నట్టుండి ఆవిడిట్లా కావడం విచిత్రంగా వుందే. అప్పుడు నుదుటికి తగిలిన గాయం వల్లేమైనా..."

అని శిల్ప అంటుండగానే "నో.... అది చాలా మైనర్ ఇన్‌జురీ అని ఆ. డాక్టర్ చెప్పారు. ప్రవీణ్, నేనూ ఇద్దరం ఆయన్ని కలిసి డీటైల్స్ తీసుకున్నాం. బైదిబై.. ఆరోజు అమ్మను హాస్పిటల్లో చేర్చింది మీరే నటకదా? థాంక్స్ ఎలాట్" అన్నాడు.

"ఆ తరవాత నేను స్కాన్ కూడా తీయించానమ్మా డాక్టర్ వద్దన్నా. ఎందుకైనా మంచిదని ఆపని చేశా. మీతో అన్లేదీ విషయం నేను. రిపోర్ట్స్ నార్మల్ అని వచ్చింది" అన్నాడు దిలీప్ ఫాదర్.

పనమ్మాయి కాఫీ తెచ్చింది.

కాఫీ తీసుకున్నానేగానీ తాగబుద్ధెయ్యలేదు.

హైమావతిగారి శూన్యమైన చూపులే గుర్తొస్తున్నాయి నాకు.

"నేను భయపడ్డంతా అయిందిలేమ్మా" అన్నాడు దిలీప్ ఫాదర్ కాఫీ సిప్ చేస్తూ.

నేనాయనకేసి చూశాను. ఆయన మాటలు నాకర్థంకాలేదు.

ఆయన గాఢంగా నిట్టూర్చి అన్నాడు "హైమావతి అమ్మమ్మ గారి మేనత్త కూతురికుందేదట ఈ కంప్లయింట్.

ఆవిడా ఇలాగే... నడివయసులో డిప్రెషన్‌కి గురైందని.... ఆ జబ్బు పేరు... ఏంట్రా దిలీప్... అదీ..." అంటూ ఆగిపోయాడాయన.

"మెలాంకొలియా... అదే... ఇప్పుడీవిడకి వచ్చింది. కొన్నిరకాల మెంటల్ కేసులు వంశపారంపర్యంగా వస్తాయట. ప్రవీణ్ ఇది అట్లాంటిదే అంటున్నాడు".

"అంటే అమ్మమ్మగారి మేనత్త కూతురికి అప్పట్లో త్వరగా నయమైందటనా అంకుల్? " అడిగింది శిల్ప.

ఆయన కళ్లల్లో నీళ్లు ఉబకటం నాకు స్పష్టంగా కనిపించింది. "లేదమ్మా! ఆవిడ ఆ నైరాశ్యాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకుని చనిపోయిందిట"

దిలీప్ ఎందుకోగానీ చటుక్కున లేచి "సారీ... హాస్పిటల్‌లో నేనో పేషెంట్‌ని అర్జంటుగా అటెండ్ అవ్వాలి." అంటూ హడావుడిగా వెళ్లిపోయాడు.

అతను కావాలని వెళ్లిపోయినట్టు అనిపిం

చింది నాకు.

ఇంకాసేపు అక్కడే ఉండి.... మరోసారి హైమావతిగార్ని చూసి ఇంటికొచ్చేశాం.

శిల్ప విల్సనంకుల్‌కీ, ఆంటీకి హైమావతి గారి పరిస్థితిని చెప్పిచెప్పి బాధపడింది. వాళ్లూ ఓసారెళ్లి ఆవిణ్ణి చూసిరావాలనే నిర్ణయానికొచ్చారు.

ఏపని చేస్తున్నా నన్ను హైమావతిగారి దైన్యమయిన చూపులే వెంటాడుతున్నాయి.

ఎందుకామె గుండెల్లో అంత విషాదం?

ఒక్కసారి నోరు తెరిచి నాతో చెబితే ఎంత బాగుండును అనుకున్నాను.



ఎవరికైనా... ఎక్కడైనా... ఏదైనా విశేషం జరిగితే విచిత్రంగా చెప్పుకుంటాం. ఆశ్చర్యంగా వింటాం.

అయితే మన విషయంలో సమ్‌థింగ్ జరిగితే మాత్రం.... అది విచిత్రం కాదు. సమస్య అయి కూర్చుంటుంది. మనసుని చిరాకు పరుస్తుంది.

నా విషయంలో అట్లాగే జరిగింది.

హటాత్తుగా ఓరోజు దిలీప్, అతని ఫాదర్ మా ఇంటికి వచ్చారు. నన్నర్జెంటుగా డాక్టర్ ప్రవీణ్ చూడాలంటున్నాడని చెప్పారు. చెప్పడం కాదు, రమ్మని రిక్వెస్ట్ చేశారు. నాతోపాటు విల్సనంకుల్‌ని కూడా రమ్మన్నారు.

ఆమధ్యోసారి విల్సనంకుల్, ఆంటీ శిల్పను తోడు తీసుకుని హైమావతిగార్ని చూసి రావడంతో ఆయనకూ, దిలీప్ ఫాదర్‌కీ పరిచయం ఏర్పడింది. బహుశా ఆ చనువుతో... ఆయన్నుకూడా పిలుస్తున్నారనుకున్నాగానీ.... ఇంతకీ.... డాక్టర్ ప్రవీణ్‌కి నాతో ఏం అవసరమో అర్థం కాలేదు.

నేనూ, శిల్పా, విల్సనంకుల్ దిలీప్ కార్లోనే బయలుదేరాం.

అందరం హాల్లో కూర్చున్నాం. డాక్టర్ ప్రవీణ్ నన్ను మాత్రమే కన్సల్టింగ్ రూమ్‌లోకి పిలిపించాడు.

అతను చెప్పిన విషయం విన్నాక... నాకేం చెయ్యాలో పాలుపోలేదు.

హైమావతిగార్ని ట్రాన్స్‌లోకి పంపించి... ఆవిడ మాటల్ని రికార్డ్ చేశాడట.

దాన్నిబట్టి ఆవిడ డిప్రెషన్‌కి కారణం నేనేనని తేలిందట. నా ప్రెజన్స్‌ని ఆవిడ గాఢంగా కోరుకుంటోందిట. అందుకని నేను ఆవిడక్కాస్త సాంత్వన చిక్కేవరకూ.. ఆవిడతో ఉండాలట.

అతను చెప్పిన మాటల్ని డైజస్ట్ చేసుకునే ప్రయత్నంలో ఉన్న నాకు అతను రికార్డర్ ఆన్ చేసి... హైమావతిగారి మాటల్ని వినిపించాడు.

'అజంత నాకు బాగా నచ్చింది. ఎన్నో సంబంధాలు చూశాం. నాకీ పిల్ల నచ్చినట్టు ఇంకెవరూ నచ్చలేదు.

చాలా ఆశ పడ్డాను... ఆ అమ్మాయి నా కోడలవుతుందని. ఆఖరిక్షణంలో... నాకీ పెళ్లి వద్దన్నది.

చదువుకోవాలట. మేనరికం ఉందట.

ఏంటో చెబుతుంది. బలవంతంగా ఒప్పించడం బావుండదు. బతిమలాడడం నాకు గిట్టదు.

నాకు దెబ్బ తగిలినప్పుడు ఎంత సేవ

చేసింది. నాక్కూతురుంటే అట్లాగే చేసే దేమో!

ఆ పిల్ల నాక్కావాలి.... కానీ కుదుర దందే...

మేనరికం ఉందని చెప్పేసిందిగా.

నాకు బాధగా ఉంది. మనసంతా ఒకటే దిగులు. అజంత నా కోడలు కాదన్న భావన నా గుండెల్ని తొలుస్తోంది.

ఎటు చూసినా ఆ పిల్ల ముఖమే.

నట్టింట్లో తిరుగుతున్నట్టు ఉంది.

కానీ.... అజంత... నా యింటికి రాదు... ఎవరింటికో వెళ్తుంది.

నాకు... దిగులుగా ఉంది. ఏంవ ద్దనిపిస్తోంది. నాకు దేనిమీదా లేదు. అంతా శూన్యంగా ఉంది. అజంతా లేన ప్పుడు ఇక నాకేం అక్కర్లేదు. నాకేమీ అక్క ర్లేదు...."

ప్రవీణ్ రికార్డర్ ఆఫ్ చేశాడు.

"విన్నారుగా. మీమీద మనసుతో ఆమె మనసు దెబ్బతిన్నది. క్రమంగా.... మీరు లేకుంటే ఇక ఎన్ని ఉన్నా వ్యర్థమే అన్న భావనకు... ఆమె లోనైంది. అన్నిటిమీదా ఇంట్రెస్ట్ పోగొట్టుకుంది. నైరాశ్యంలోకి వెళ్లి పోయింది. డిప్రెషన్‌కి గురైంది. నాకేమీ వద్దు. ఎవ్వరూ అక్కర్లేదు అన్న విత్‌డ్రా యల్ ఫీలింగ్... ఆమె సబ్‌కాన్షస్‌ని ఆక్యుపై చేసింది. ఫలితంగా మెలాంకొ లియా అనే మానసిక వ్యాధికి గురైంది." చెప్పాడతను.

"ఇప్పుడు నన్నేం చేయమంటారు డాక్టర్?" అన్నాను.

"మీరావిడని అనుక్షణం వెన్నంటి ఉండి... మీరు తన మనిషే అన్న భావనని ఆవిడలో కలిగించాలి. అట్లా చేస్తే రికవరీ ఉండొచ్చు మియర్ మెడిసిన్స్ చాలవు. ఆవిడ హెల్త్ బాగుపడడం అన్నది మీ చేతుల్లో ఉంది"

నేనేమిటీ? వాళ్లింట్లో ఉండడమేంటి?

తల్చుకుంటే నాకంతా అయోమయంగా ఉంది.

ప్రేమ, అభిమానం అనే పదాలకు అర్థం కాదు గదా కనీసం స్పెల్లింగ్ కూడా తెలీని దిలీప్ ఎదురుగా మసులుతూ... ఆతడి తల్లిని నేను మామూలు మనిషిని చెయ్యాలా?

నేనూ. జాలిపడగలను. సానుభూతి చూపించగలను. బట్.... దానికీ ఓ హద్దుంటుంది.

"ప్లీజ్ హ్యూమానిటీ బేసిస్ మీద ఆలో చించండి. మిమ్మల్ని అల్లా అడిగే హక్కు నాకు లేదు. బట్ అవసరం ఉంది... అవ సరంలో అభ్యర్థన ఉంది. మీరు కాదంటే నా పేషెంటు త్వరలోనే చనిపోతుంది" అన్నాడు డాక్టర్ ప్రవీణ్.

చనిపోతుంది అన్నమాట నామనసు నెక్కడో తాకింది.

"డాక్టర్!" అన్నాను ఆదుర్దాగా.

"ఫ్యాక్ట్ అదే" చెప్పాడతను.

"మా అంకుల్‌తో... నా ఫ్రెండ్స్‌తో మాట్లాడాక చెబుతాను." అన్నాను లేస్తూ.

"మీరుండండి. వాళ్లనే ఇక్కడకు పిలిపి స్తాను" అంటూనే ఆయన ఇంటర్‌కమ్ బటన్ నొక్కి వాళ్లను లోనికి పంపించమని చెప్పాడు.

అందరూ లోపలికి వచ్చారు.

నాకు చెప్పిన విషయాలన్నీ మళ్లీ... విల్స నంకుల్‌కీ... శిల్పకీ... రిపీట్ చేశారు డాక్టర్. రికార్డర్‌లోని హైమావతిగారి స్వరాన్ని వినిపించారు.

అంతా విన్నాక విల్సనంకుల్ నన్నడిగారు "ఏం నిర్ణయించుకున్నావమ్మా?"

"నాకేం తోచటంలేదంకుల్" అన్నాను.

"నా భార్య ప్రాణం నీ చేతుల్లో ఉందమ్మా" అన్నాడు దిలీప్ ఫాదర్.

నేను దిలీప్‌కేసి చూశాను. అతని ముఖంలో ఏ ఎక్స్‌ప్రెషన్స్ ఉన్నాయో మరి... తల దించుకుని కూర్చునున్నాడు.

"చావు బతుకుల్లో ఉన్న ఒక పేషెంట్‌కు

సహాయ పడ్డానికి ఇంతగా ఆలోచించాలా?" డాక్టర్ ప్రవీణ్ స్వరంలో కాస్త ఇరిటేషన్ ధ్వనించింది.

నాకు చురుక్కుమంది.

ఈవిడ.... దిలీప్ అనబడే యాంటీ లవ్ ఎలిమెంట్‌కి తల్లికాకుండా ఉంటే మీరడిగిన వెంటనే నేను హెల్ప్ చేసి ఉండేదాన్ని అని చెప్పాలనిపించింది. కానీ సభ్యత కాదని ఊరుకున్నాను.

"ఏమ్మా! ఏంచెయ్యాలనుకుంటున్నావ్?" అడిగాడు దిలీప్ ఫాదర్ దీనంగా.

నేను ఇబ్బందిగా విల్సనంకుల్ వైపు చూశాను.

"మేం పర్సనల్‌గా డిస్కస్ చేసుకుని ఓ నిర్ణయానికి వస్తాం డాక్టర్" అన్నాడాయన డాక్టర్ ప్రవీణ్‌తో.

అందరం లేచాం.

"లెట్ యువర్ ఆన్సర్ బీ పాజిటివ్" డాక్టర్ ప్రవీణ్ విల్సనంకుల్ హాండ్ షేక్ చేస్తూ అన్నాడు.

మేం వద్దంటున్నా వినకుండా దిలీప్ మమ్మల్ని తన కార్లో ఇంటిదగ్గర డ్రాప్ చేశాడు.

దిలీప్ కారు దిగి నాకు క్లోజ్‌గా వచ్చి నిలబడి అన్నాడు "అజంతా! అమ్మ నా ప్రాణం. ఆమెకేమైనా అయితే భరించే శక్తి నాకు లేదు"

దిలీప్ కళ్లల్లో తడి.

అతని కేసి విడ్డూరంగా చూశాను. అతను గబగబా వెళ్లి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు.

కారు స్టార్టయ్యాక శిల్ప అంది "నౌ ఐ హేవ్ ఎ బోన్ టు పిక్ విత్"

నాకర్థం కాలేదు.

"అమ్మంటే ప్రాణంటగా.... నాకూ మోహనంటే ప్రాణం అని చెబ్తాను. నాతో వాదించి ఎట్లా గెలుస్తాడో చూస్తా" అందది.

"నా మోహనా? అతనెవరూ?" అన్నాను.

"విల్సనంకుల్" అందది.

మోహన్ మేం కావాలని సృష్టించిన క్యారెక్టరనీ, అతని రోల్‌ని అప్పట్లో విల్సనంకుల్ పోషించారనీ గుర్తొచ్చి నవ్వేశాను.

★ ★ ★

అర్ధరాత్రి హఠాత్తుగా మెళకువచ్చి చూశాను. నా పక్కనే పడుకున్న శిల్ప గాఢ నిద్రలో ఉంది.

గదంతా మందంగా పరుచుకుని ఉన్న నీలంరంగు బెడ్‌లైటు కాంతిలో పరిసరాలన్నీ కొత్తగా అనిపిస్తున్నాయి. అసలా గదే.... పరిచయం లేని ప్రదేశంలా ఉంది.

బెడ్ పక్కనున్న స్విచ్ నొక్కాను. ఛమక్ మంటూ వెలిగింది ట్యూబ్‌లైటు.

దాంతోపాటు నా మెదడులో కూడా వెలిగిందో బల్బ్.

ఇది.... మేం రోజూ అలవాటుగా పడుకునే విల్సనంకుల్ వాళ్ల పైపోర్షన్ గది కాదు.

డాక్టర్ దిలీప్ వాళ్లింట్లో మాకు కేటాయించిన గది.

నిన్ననే... విల్సనంకుల్ వాళ్లింట్లోంచి ఇక్కడికి షిఫ్టయ్యాం.

నాకింకా నమ్మశక్యంగా లేదు.

నా ఫ్యామిలీ హిస్టరీకార్డ్ చూశాక 'ఐ లవ్ యూ' అని చెప్పకపోతే పోయాడు, కనీసం మర్యాదకయినా 'సారీ అజంతా! ఐ కాన్ట్ లవ్ యూ' అని చెప్పడం కూడా అనవసరం అనుకుని ఆ సాయంత్రమే పెళ్లి చూపులకు ఊరేగిన ఒక మనసులేని మనిషి ఇంట్లో మానవతా దృక్పథంతో నన్ను నేను కించపరుచుకుని.. ఇట్లా వచ్చి ఉన్నానంటే....

నాలో ఏదో లోపం ఉంది.

ఏంటది? ఆత్మాభిమానం. యస్. అది లేదు నాకు.

"అతన్ని గౌరవించకు. కానీ... 'అమ్మ నా

ప్రాణం' అన్న అతని ఫీలింగ్‌ని గౌరవించు' అన్న విల్సనంకుల్ మాటని తోసెయ్యలేకా...

"నువ్వు లేని లోకమే శూన్యమనుకుని, విరాగిలా మారి, మానసికంగా కుంగిపోయిన ఆవిడ్ని కేవలం 'ఆమె దిలీప్ తల్లి' అన్న ఒక్క కారణం చేత నిర్లక్ష్యం చేస్తావా? ఇది న్యాయమేనా?" అన్న శిల్ప ప్రశ్నకు జవాబు చెప్పలేకా.... నేనిట్లా వచ్చాను. వచ్చానే కానీ గిల్టీఫీలింగ్ వదలటంలేదు.

ఈ విషయంలో అమ్మానాన్నల పర్మిషన్ తీసుకుంటానన్నాను. విల్సనంకుల్ వద్దన్నారు. "జస్ట్.... ఇల్లు మారుతున్నట్టు రాయి చాలు. ఇవన్నీ వింటే నీ స్టడీస్ పాడవుతాయని వాళ్లు కంగారు పడతారు. నిజానికి జరిగేది అదేకదా... ఇల్లు మారుతున్నావ్.... కాకుంటే ఓ మనిషికి సాయం చెయ్యడానికి. అంతేగా" అన్నాడు.

"అంతే అంకుల్! వాళ్లింట్లో నెలకంటే ఎక్కువ వుండను. అదీ పేయింగ్ గెస్ట్‌గా శిల్పతో కలిసి. ఈలోపు ఆవిడ రికవర్ అయ్యారా సరే.... లేదంటే... నేనేం చెయ్యలేను. మనింటికి వచ్చేస్తాను. కాకుంటే ఒక్కటి.... ఈ నెలరోజులు మాత్రం ఆవిడ్ని సిన్సియర్‌గా అటెండ్ అవుతాను. ఆవిడ డిప్రెషన్‌కి నేను కారణమయ్యాను కాబట్టి... నా శాయశక్తులా.... ఆవిడ్ని మామూలు మనిషిని చెయ్యడానికి ప్రయత్నిస్తాను" అని చెప్పి నిన్న సాయంత్రం ఇక్కడికి షిఫ్ట్ అయ్యాం.

దిలీప్ ఇంట్లోనే... మా ఇద్దరికీ ఓ గది కేటాయించారు. ఆలోచిస్తూ అలాగే నిద్రలోకి జారిపోయాను.

ఉదయాన్నే లేచి స్నానం అదీ కానిచ్చి హైమావతి గారి గదిలోకి వెళ్లాను.

ఆవిడ అప్పటికే లేచి కూర్చుని ఎప్పటిలా కిటికీలోంచి తదేకంగా బయటకి చూస్తోంది.

నా వెనకాలే వచ్చిన పనమ్మాయినడిగాను "ఆంటీ స్నానం చేశారా?" అని.

"ఆ... స్నానం అయ్యిందమ్మా" అందా పిల్ల.

థాంక్‌గాడ్ అదిమాత్రం పేచీ పెట్టకుండా చేస్తుందావిడ.

"నువ్వు టిఫిన్ చేసి పట్రా రాజీ" అని చెప్పానా అమ్మాయికి.

తరవాత ఆవిడ బెడ్ మీద కూర్చుని డాక్టర్ ప్రవీణ్ ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం.... ఆవిడ భుజాలమీద ఆప్యాయంగా చేతులు వేసి ముఖాన్ని నావైపు తిప్పుకుని "ఆంటీ" అన్నాను ప్రేమగా.

ఆవిడ నాకేసి నిర్నిమేషంగా, నిరామయంగా చూస్తోంది.

"నేనాంటీ అజంతను" అన్నాను.

అప్పటికీ ఆ కనుపాపల్లో చలనం కనబడలేదు. మెల్లగా ఆవిడ తల నిమిరాను. అరచేతిని ముద్దాడాను.

చాలా ఆప్యాయంగా ఆదరణగా మాట్లాడ్డం మొదలెట్టాను. నేనే అజంతనని, ఇక ఆమెతోనే వుంటాననీ నమ్మకంగా చెప్పాను. అరగంట ప్రయత్నం తర్వాత ఆమె చూపుల్లో ఏదో మార్పొచ్చినట్టనిపించింది నాకు. అంతవరకూ ఎటో చూస్తున్న ఆవిడ నావైపు చూస్తున్నట్టుగా అనిపించింది. అది నిజమో, నా ఫీలింగో మరి. రాజీ టిఫిన్ ప్లేట్ తెచ్చి స్టూల్ మీద పెట్టింది.

ఇడ్లీ ఓ ముక్క తుంచి చట్నీలో అద్ది ఆమె నోటి కందించబోయాను.

అంతవరకూ నావైపు చూస్తున్నదల్లా చటుక్కున ముఖం తిప్పుకుని, మళ్లీ కిటికీలోంచి బయటకు చూడ్డం మొదలెట్టింది.

"రోజూ అంతేనమ్మా అమ్మగారు. మనం పెడితే తిన్రు. ఆ ప్లేటు అక్కడే వుంచేసి రండి. బుద్ధిపుట్టినప్పుడు తింటారు" అంది రాజీ.

"ఖచ్చితంగా తింటారా?" అడిగాను రాజీని.

"ఒక్కోసారి తింటారమ్మా. ఒక్కోసారి సాయంత్రమైనా తిన్రు" చెప్పిందా అమ్మాయి

నాలో ఓ పట్టుదలలాంటిది కల్గింది. ఇంతమంది నా మీద ఇన్ని హోప్స్ పెట్టుకుని ఈవిడ్ని బాగుచేస్తానన్న ఆశతో



వుంటే, ఆఫ్టాల్ టిఫిన్ తినిపించలేకపోతే ఇక ఈ ఇంటికి నే రావడంలో అర్థం ఏముంది అన్పించింది.

సరిగ్గా... ఒక గంటసేపు బుజ్జగించానా విడ్ని. నా ప్రయత్నం ఫలించింది.

ఆవిడ చిన్న పాపాయిలా నోరు తెరిచింది.

ఓ పసిబిడ్డకు గోరుముద్దలు పెట్టినట్టు టిఫిన్ ఆమె నోటికందించాను.

మంచినీళ్ళు తాగించి ఆవిడ మూతిని శుభ్రంచేస్తున్నప్పుడు గమనించాను. గుమ్మానికవతల నిలబడి దిలీప్ మా యిద్దర్నీ చూస్తున్నాడని.

అతని కళ్లలో కృతజ్ఞత మెరవడం నాకు స్పష్టంగా కన్పించింది.

★ ★ ★

"అన్‌బిలీవబుల్ ప్రోగ్రెస్" అన్నాడు



డాక్టర్ ప్రవీణ్. అతని స్వరం నిండా సంతోషం.

హైమావతిగార్ని నేను అటెండ్ అవడం మొదలు పెట్టి పది హేనురోజులైంది.

ఇప్పుడావిడ చూపుల్లో నిరాశలేదు. ముఖంలో విషాదం లేదు.

ఒక్కక్షణం నన్ను గుర్తుపడుతుంది. కాసేపు సంతోషంగా వుంటుంది. మరు క్షణం ఎందుకో వెక్కిళ్లు పెట్టి ఏడుస్తుంది ఎప్పుడైనా "నువ్వు నిజంగా అజంతవేనా" అని అపనమ్మకంగా చూస్తుంది.

ఇంకోసారి "అజంతా నన్ను వదిలి వెళ్ళి పోతావ్ కదూ? " అంటూ భయంగా అడుగుతుంది.

"ఆమెలో చాలా మార్పు వచ్చింది. ఒట్, అజంత తనను వదలి వెళ్ళిపోతుందేమో అన్న ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్ ఆవిడ్ని పూర్తిగా కోలుకోనివ్వటంలేదు. అజంత తన్ను వదిలిపోదన్న సెక్యూరిటీని ఆమె మనసుకు మనం ఇవ్వగలిగితే, డెఫినిట్లీ షి విల్ రికవర్ వితిన్ ఫ్యూ డేస్" అన్నాడు డాక్టర్ ప్రవీణ్ ఓరోజు ఇంటికొచ్చి ఆవిడ్ని చెకప్ చేశాక.

డాక్టర్ అట్లా అంటున్నప్పుడు నేనెందు కట్లా చేశానోగాని అనుకోకుండా దిలీప్‌కేసి చూశాను.

దిలీప్ ఎప్పట్నుండి చూస్తున్నాడో మరి, నాకేసి తదేకంగా చూస్తున్నాడు.

నాకేమిటోగా అన్పించి అక్కడ్నించి లేచె ళ్ళిపోయాను.

అప్పుడే కాదు. ఆ తర్వాత ఎన్నోసార్లు దిలీప్ నా వంక అట్లా చూడ్డం గమనించా న్నేను. ఆ విషయాన్ని శిల్పాతో అంటే "వాళ్లమ్మ అమ్మమ్మ మేనత్త కూతురి మానసికరోగం ఇతనిక్కూడా వస్తుందేమోనే" అంది.

చూస్తుండగానే నెలరోజులు పూర్త య్యాయి.



ఆ రోజు దిలీప్ హాస్పిటల్ నుండి వచ్చే సరికి రాత్రి బాగా పొద్దుపోయింది.

అప్పటికి అందరూ భోజనాలు చేసి పడుకున్నారు. శిల్పా నేను మాత్రం భోంచేశాం గాని పడుకోలేదు. మా రూమ్‌లో చదువు కుంటున్నాం. మా గది కిటికీలోంచి డైనింగ్ హాల్ కనబడుతోంది. రాజీ వడ్డిస్తుంటే భోంచేస్తున్నాడతను. ఉన్నట్టుండి అతని తల్లి గదిలోంచి బయటకొచ్చింది. వచ్చి దిలీప్ ఎదురుగా కూర్చుంది.

దిలీప్ ఆశ్చర్యంతో, ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోతూ "అమ్మా" అన్నాడు.

మేమూ ఆశ్చర్యపోతూ పుస్తకం పడేసి గది బయటకొచ్చాం.

ఆవిడ డిప్రెషన్‌కి గురైంతర్వాత తనంత టతనుగా గది విడిచి బయటికి రావడం ఇదే మొదటిసారి. దిలీప్ లేచి తల్లికి దగ్గరగా వచ్చి అన్నాన్ని ఆప్యాయంగా ఆమె నోటికందించబోయాడు.

ఆమె నోరు తెరిచిందిగాని, అది అతనందిస్తున్న అన్నంముద్ద కోసం కాదు. అతన్నే తదేకంగా చూస్తూ.

"నాకు... నాకు అన్నం వద్దు. అజంత కావాలి" అంది మెల్లగా.

దిలీప్ చేతిలోని అన్నం ప్లేట్లోకి జారిపోయింది. తల్లికేసి స్తబ్దంగా చూశాడు.

ఆవిడ లేచి నిశ్శబ్దంగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఆ ఇంటికొచ్చిన నాలుగోరోజు ఉదయం అనుకుంటా విల్సనంకుల్ దగ్గర్నుంచి ఫోనొచ్చింది నాకు. మా నాన్న ఫోన్ చేశాడట. అమ్మమ్మ పడి పోయిందిట. కాలు ఫ్రాక్చరయిందట. వీలైతే నన్ను ఇట్నించిటే వెళ్ళి ఆమెనోసారి చూసి రమ్మన్నాడట. మా అమ్మ కూడా బయలుదేరిందట.

"అయ్యయ్యో! పెద్ద వయసులో ఫ్రాక్చరంటే అతుక్కోవటం కష్టంకదా అంకుల్" అన్నాను అమ్మమ్మను తల్చుకుని బాధపడుతూ.

"ఏం కాదులేమ్మా. నువ్వు కంగారుపడకు ఓసారెళ్లి చూసిరా" అన్నారంకుల్.

"అంకుల్! నేనూ, శిల్పా దిలీప్ ఇంట్లో వుంటున్నట్లు నాన్నకు..."

"చెప్పలేదమ్మా. ఒక్క నెల భాగ్యానికి ఈ మార్పులూ చేర్పులూ చెప్పి వాళ్ళని కంగారు పెట్టడమెందుకని చెప్పలేదు. నువ్విoట్లో లేవని మాత్రం చెప్పాను" అన్నాడాయన.

"మంచి పని చేశారంకుల్. నేనీరాత్రికే బయల్దేరతాను"

"శిల్పను తోడు తీసికెళ్తావా?"

"దానిష్టం అంకుల్. వస్తానంటే తీసికెళ్తా. లేదంటే నేనొక్కత్తినే వెళ్తా"

"ఎట్లా వుందమ్మా అక్కడ పరిస్థితి?" అన్నాడాయన.

ఆయనడిగేది హైమావతిగారి గురించనుకుంటూ "పెద్ద ప్రోగ్రెస్ లేదంకుల్. అయితే ఒకటిరెండు సార్లు నేను ఆహారం ఇస్తే తీసుకుంది. నిన్న సాయంత్రం మాత్రం ఎప్పుడూ ఎటో చూస్తున్నట్టు వుండే మనిషి, కాసేపు నాకేసి తదేకంగా చూసింది. నేనైతే విన్లేదుగాని నిద్రలో ఓసారి నా పేరు పలవరించిందని పనమ్మాయ్ చెబుతోంది"

"ఆమె పరిస్థితి సరేమ్మా, నీ పరిస్థితి నేనడిగేది. అడ్జెస్ట్ అయ్యావా ఆ ఇంట్లో. నీకేం ఇబ్బందిగా లేదుకదా!"

ఆ ఇబ్బంది ఎవరి గురించో నాకర్థమైంది.

"మీరడిగేది దిలీప్ గురించేగా అంకుల్. అతని ప్రెజన్స్ని నేను ఫీలయితేకదా ఇబ్బంది పడ్డానికి. ఇక అడ్జెస్ట్ అవడం అంటారా! వేరే వూరు వెళ్లినప్పుడు కంఫర్టబుల్ హోటల్ రూమ్ దొరికితే ఎట్లా అడ్జెస్ట్ అవుతామో... ఇదీ అంతే"

"గుడ్... మరి వుంటాను. వూరికి బయలుదేరేముందు ఫోన్ చెయ్" చెప్పి పెట్టేశారాయన.

ఆ మధ్యాహ్నం దిలీప్ ఫాదర్తో చెప్పాను విషయం.

"అరెరె... అట్లాగా, వెళ్ళి చూసిరామ్మా" అన్నారాయన.

శిల్పా, నేనూ ఇద్దరం వెళ్ళాలా లేక శిల్ప వుండిపోయి హైమావతిగార్ని చూసుకోవాలా అన్న విషయంమీద డిస్కస్ చేసుకున్నాక, శిల్ప వుండటమే బెటర్ అనుకున్నాం.

ఆ నిర్ణయానికి దిలీప్ ఫాదర్ కూడా సంతోషించారు.

ఆ రాత్రి ఎనిమిదిగంటల ట్రైన్కు నేను బయలుదేరుతున్నానని తెలిసి, క్లినిక్నుంచి త్వరగా వచ్చేశాడు దిలీప్. నేను అక్కర్లేదంటున్నా వినకుండా స్టేషన్కి కార్లో డ్రాప్ చేశాడు. ట్రైన్ కదిలే వరకూ అక్కడే వున్నాడు.

'కర్టెసీ మాత్రం బాగానే తెలుసు మిష్టర్ డిసీజ్ గారికి' కసిగా అనుకున్నాను.

తెలతెలవారుతుండగా బందర్లో

దిగాను. అమ్మ కూడా వుందక్కడ. నిన్ననే దిగిందట.

అమ్మమ్మ నన్ను చూసి కళ్ళనీళ్ళు పెట్టేసుకుంది.

కుడికాలు మోకాలివరకూ ప్లాస్టర్ వేశారు. కదల్లేని పరిస్థితి. అన్నీ మంచంమీదే.

"ఇక లేచి నేనడుస్తానటే" అంటూ ఒకటే గోల.

"నడవటంకాదు. పరిగెత్తుతావ్. బెట్" అన్నాను.

అమ్మమ్మ నేనిచ్చిన భరోసాతో తృప్తిపడింది. ఇక తన కాలి గోల వదిలేసి నా పెళ్ళిగోల మొదలెట్టింది.

దిలీప్‌ని తలుచుకుని తలుచుకునీ మురిసిపోవడం, నన్ను దగ్గరకు పిలుచుకుని మరీ చీవాట్లెయ్యడం హాబీగా మార్చుకుంది. అప్పటికే నేనక్కడకు వచ్చి రెండురోజులు గడిచిపోయాయి.

మొదటిరోజు అంతగా అనుకోలేదు గాని రెండోరోజునుండీ హైమావతిగారు ఒకటే గుర్తుకొస్తున్నారు.

ఏమైనా తింటోందో లేదో పాపం అని పదినిముషాలకోసారైనా అనుకుంటున్నాను.

ఇది నాకే చిత్రంగా వుంది. దిలీప్ ఓ రకంగా నా శత్రువు. నన్ను ప్రేమించి అవమానించిన వ్యక్తి. న్యాయానికి అతనిపొడ కూడా సహించకూడదు నేను. కానీ అతని కళ్ళముందే అతనింట్లోనే సెటిలవ్వాల్సి వచ్చింది. ఏదో ముళ్ళమీద వున్నట్టుగా కాదు. ఇన్‌వాల్వ్ అయిపోయి మరీ వుంటున్నానా? కాకుంటే నా అమ్మమ్మ.... నా స్వంత మనుషుల మధ్య వుంటూ కూడా హైమావతిని తలుచుకోవడం ఏమిటి?

ఏదో తెలీని అటాచ్‌మెంట్ నన్నక్కడ నిలవనీయటంలేదు.

ఆ రాత్రి బయల్దేరతానంటే అమ్మమ్మ ససేమిరా అంది.

నేనటూ ఇటూ కొట్టుమిట్టాడుతుండగానే నా సమస్యను సాల్వ్ చేస్తున్నట్టుగా వచ్చింది ఫోన్ కాల్ శిల్పనుంచి.

నేను బందరు బయల్దేరేటప్పుడే ఎందుకైనా మంచిదని శిల్పకి మా అమ్మమ్మగారి ఫోన్ నెంబర్ ఇచ్చి వచ్చాను.

హైమావతిగారు రెండురోజుల్నుండి పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టడంలేదట. నిన్న రాత్రి అక్షరాలా గంటసేపు వెక్కివెక్కి ఏడ్చిందట.

అమ్మమ్మ కాదుగదా! ఇక ఎవరు చెప్పినా వినదల్చుకోలేదు. ఆ ఫోన్‌కాల్ యూనివర్శిటీనుండి వచ్చిందనీ అర్జంట్‌గా అటెండ్‌కావాలనీ అమ్మమ్మనీ మిగిలిన వాళ్ళనీ సమాధానపరచి రైలెక్కేశాను.



నన్ను చూడగానే హైమావతిగారు సంతోషంతో నవ్విన నవ్వుని జీవితాంతం మరిచిపోలేను నేను.

ఎంతో ఎడబాటు తరువాత కన్నతల్లిని చూసిన పసిపాప పాలనవ్వులా వుందది.

ముందు బత్తాయి రసం తాగించాను. చాలా నీరసంగా వుందామె. వేడివేడి ఇడ్లీలు, కారప్పొడీ, నెయ్యీ వేసి తినిపిస్తుంటే. వద్దనుకుండా తినేసిందామె. అట్లా మంచంమీద ఒదిగి పడుకుంది.

"ఇక నువ్వెళ్ళి స్నానం అదీ కానిచ్చిరా

టిఫిన్ తిందువు" అంది శిల్ప.

అప్పటిగ్గాని గుర్తురాలేదు నాకు. రైలు దిగగానే స్నానమైనా చెయ్యకుండా హైమావతిగారి సేవలో పడిపోయానన్న విషయం.

నేనావిడ బెడ్ మీంచి లేవబోతుంటే గట్టిగా నా కొంగు పట్టుకుందావిడ.

ఇక లాభంలేదని ఓ పావుగంట ఆమె దగ్గరే వుండిపోయాను. నన్నే చూస్తూ అట్లాగే నిద్రలోకి జారిపోయింది.

స్నానం అదీ కానిచ్చి టిఫిన్ చేస్తుంటే దిలీప్ ఫాదరు మా అమ్మమ్మ యోగక్షేమాలడిగి తెలుసుకున్నారు.

దిలీప్ ఒంటరిగా నన్ను పట్టుకుని "సారీ" అన్నాడు.

"దేనికీ? " అన్నాను నిజంగానే అర్థంకాక.

"మీ అమ్మమ్మకి కాలు విరిగి మీరు వెళితే ఆవిడ్ని అటెండ్ కానీకుండా మా అమ్మ కోసం మిమ్మల్ని హడావుడి పెట్టాల్సివచ్చింది" అన్నాడు.

"ఇట్సోకే. ఎక్కడ నా అవసరం ఎక్కువో అక్కడకి వచ్చేశాను. ఇందులో మీరు సారీ చెప్పాల్సిందేం వుంది? "

అతనోక్షణం నావైపు డీప్‌గా చూశాడు. "అట్లా అనుకోగలగడం మీ మంచితనం" అన్నాడు.

నాకు నవ్వొచ్చింది. ఎట్లాగో ఆపుకున్నాను.

'ఫరవాలేదే! నీకు కంటేజియస్ డిసీజెస్ పేర్లూ, హెరిడిటరీ డిసీజెస్ పేర్లేకాక మంచితనం, మనసూలాంటి పదాలు కూడా తెలుసా?' అని అడగాలన్పించిందిగాని అడగలేదు.

★ ★ ★

అందరం కూర్చొని భోజనాలు చేస్తున్నాం.

"రాజీ... ఆవకాయేదీ? "

డైనింగ్ టేబుల్ మీద ఆవకాయ బాటిల్ కోసం వెదుకుతూ అడిగింది శిల్ప.

"చిన్నయ్యగారు దాన్ని తీసెయ్యమన్నారమ్మా" అంది పనమ్మాయి.

నేను చిత్రంగా దిలీప్‌కేసి చూశాను. దిలీప్ ఆసరికే శిల్పనూ, శిల్ప దిలీప్‌నూ ఒకర్నొకరు చూసుకుంటున్నారు.

"ఆమధ్య మీరు నా క్లినిక్కి వచ్చినప్పుడు గేస్ట్రిక్ ట్రబుల్ కూడా వుందని చెప్పినట్టు గుర్తు నాకు" అన్నాడు.

"ఆఁ... వుందీ" వుంటే ఏం అన్న స్టయిల్లో అందది.

"మీరు మా ఇంటికొచ్చి వారం రోజులై వుంటుంది. వచ్చినప్పటినుండీ గమనిస్తున్నాను. చట్నీలే ఎక్కువగా తింటున్నారు. ఆవకాయ మరీనూ" అన్నాడు.

"అంటే... నా శ్రేయస్సు కోరి మీరు ఆవకాయ బాటిల్ని తీయించేశారన్నమాట" అంది శిల్ప.

"ఆవకాయే కాదు. ఇక ఏ చట్నీ ఇక్కడ మీకు కనబడదు" నవ్వాడతను.

నేను చూస్తుండగానే శిల్ప కళ్లలో చివ్వున నీళ్ళూరాయి.

"అరె! అదేంటి? " అన్నాడు దిలీప్ బిత్తరపోతూ.

"డాక్టర్" అంది ఉద్విగ్నంగా.

"అసలు...నేనిట్లా ఆవకాయా, గోంగూరా, ఉసిరికాయాలాంటివి ఎందుకు ఎక్కువగా తింటున్నానో తెలుసా? "

దుఃఖాన్ని ఆపుకోటానికన్నట్టు ఓ ఫోజ్ ఇచ్చి చెప్పింది శిల్ప "నా మోహన్‌కోసం. కారాలెక్కువ తింటే గేస్ట్రిక్ ట్రబుల్ కాస్తా అల్సర్‌గా మారుతుంది. అల్సర్ నా ప్రాణం తీస్తుంది. నేను త్వరగా చావాలి డాక్టర్. నేను చస్తే గాని మోహన్ నన్ను మర్చిపోడు. నన్ను మర్చిపోతేగాని ఇంకో పెళ్ళి చేసుకోరు. అందుకే డాక్టర్ నా ఈ ప్రయత్నం. రాజీ ఆవకాయ పట్రామ్మా" అంది శిల్ప కొంగుతో కళ్ళొత్తుకుంటూ.

నాకు నవ్వు రాబోయింది. దాన్నాపుకొనే ప్రయత్నంలో పొలమారింది.

దిలీప్ మంచినీళ్లగ్లాసు అందించాడు. అందుకుంటూ శిల్పకేసి చూశాను.

రాజీ తెచ్చిపెట్టిన బాటిల్లోంచి ఆవకాయ ముక్కల్ని వేసుకుని, అన్నాన్ని ఎర్రగా కలుపుకుంటోంది.

నేన్నీళ్ళు తాగటం అయ్యాక అది దిలీప్‌ని ఓ మాట అడిగింది. "మీరు అక్కినేని నాగేశ్వర్రావు నటించిన దసరాబుల్లోడు సినిమా చూశారా డాక్టర్? "

దిలీప్ చూడలేదన్నట్టు తల అడ్డంగా ఊపాడు.

"ఓల్డ్ పిక్చర్‌లెండి. మొన్న టీవీలో వేస్తుంటే చూశాను. అందులో ఇద్దరు హీరోయిన్లు. చంద్రకళ, వాణిశ్రీ. ఇద్దరికీ హీరో అంటే ప్రేమ. కానీ హీరోకి వాణిశ్రీ అంటే ఇష్టం. ఆ విషయం చంద్రకళకు తెలుస్తుంది. అదేకాకుండా ఈలోపు మరో విషయం కూడా తెలుస్తుందామెకు. తనకు బ్లడ్ కేన్సర్ అని. కానీ ఆమె తండ్రి హీరోకీ ఆమెకీ బలవంతంగా పెళ్ళి నిశ్చయిస్తాడు. ఇది చంద్రకళకు ఇష్టం వుండదు. హీరో వాణిశ్రీనే చేసుకోవాలని పట్టుబడుతుంది. చంద్రకళ తండ్రి ఒప్పుకోడు. వాణిశ్రీ ఒప్పుకోదు. అందుకే ఆమె ఓ ఉపాయం ఆలోచిస్తుంది. డాక్టర్ తినకూడదని చెప్పిన పచ్చళ్లూ, పళ్లూ, మిరపకాయ బజ్జీలు, వడియాలు ఎక్కువగా తినేసి పెళ్ళినాటికి జబ్బు ఎక్కువ చేసేసుకుంటుంది. పెళ్ళి పీటల మీద హీరో ఒళ్లో తలపెట్టుకుని రక్తం కక్కుకుని చచ్చిపోతుంది. వండ్రఫుల్ ఐడియా కదూ! అప్పట్నించీ నేనూ ఈ ప్రాక్టీస్ చేస్తున్నాను. ఎవరు చెప్పినా మనసు మార్చుకోవటంలేదు మోహన్. అందుకే నేనూ చంద్రకళలా పెళ్ళిపీటలమీద మోహన్ ఒళ్ళో తలపెట్టుకుని రక్తం కక్కుకుని..... అన్నట్టు డాక్టర్! గేస్ట్రిక్ అల్సర్‌కి బ్లడ్‌కేన్సర్ లోలాగా రక్తం కక్కుకునే ఫెసిలిటీ వుందంటారా? "

అక్కడే వుంటే మళ్ళీ నాకు పాలమారటం, దిలీప్ నీళ్లందించడం, చెడ్డ చిరాకన్పించి అక్కడ్నుంచి లేచెళ్ళిపోయాన్నేను.

కాసేపటికి ఆవకాయతో సుష్టుగా లాగించి గదికొచ్చిన శిల్పని అక్కసుగా చూస్తూ "నీకేం పీకల్దాకా మెక్కావ్. నవ్వలేక నేనే సరిగా తిన్లేదు" అన్నాను.

"అదేంకాదులేమ్మా, దిలీప్ ఇచ్చిన మంచినీళ్ళు తాగేసరికి తమరికి కడుపునిండిపోయింది. అదీ విషయం" అంది.

"సిగ్గులేదూ. ఇంకా అతన్ని గురించి నాతో అట్లా మాట్లాడ్డానికి. నాకూ, అతనికీ ఎటువంటి అనుబంధం లేదు. ఇకమీదట వుండబోదు" ఖచ్చితంగా చెప్పాను.

ఓ అరగంట తర్వాత "అమ్మా! పాలు" అంటూ వచ్చింది రాజీ.

పాలు తీసుకున్నాక శిల్ప చెప్పింది రాజీకి "రాజీ! రేపు టిఫిన్‌కి మిరపకాయ బజ్జీలు చెయ్యమ్మా"

రాజీ శిల్పకేసి జాలిగా చూసి "అట్లాగేనమ్మా" అంటూ వెళ్ళిపోయింది.

ఆ ఉదయం బ్రేక్‌ఫాస్ట్ మేమందరం టొమాటోబాత్ తింటుంటే, శిల్ప మాత్రం ప్లేటునిండా మిరపకాయబజ్జీలు పెట్టుకుని కూర్చుంది.

"ప్చ్... శిల్పగారూ" అన్నాడు దిలీప్ వారిస్తున్నట్టుగా ముఖం చిట్లించి.

"త్వరగా పోవాలి డాక్టర్. అదీ మా మోహన్ ఒళ్లో తల పెట్టుకుని... రక్తం..."

"రాజీ... ఈ బజ్జీలు నిన్నెవరు చెయ్యమన్నారు? " దిలీప్ మండిపడ్డాడు.

"శిల్పమ్మగారే సార్" అందామ్మాయి భయపడిపోతూ.

"ఇంకెప్పుడూ చెయ్యకు" ఆ పిల్లకో అల్టిమేటమ్ ఇచ్చి శిల్ప ముందున్న బజ్జీల ప్లేట్‌ని అమాంతం లాగి సింక్‌లో పడేశాడు.

ఆ పని చేసేశాక "మీ మోహన్ని నాకో సారి ఫోన్ చెయ్యమని చెప్పండి" అన్నాడు శిల్పతో అక్కడ్నుంచి వెళ్ళిపోతూ.

శిల్ప నాకేసి, నేను శిల్పకేసి బ్లాంక్‌గా

చూసుకున్నాం.

★ ★ ★

"నా శిల్ప... అంత నిరవధికంగా ఆవకాయ, మిరపకాయ బజ్జీలూ తింటానిక్కారణం మీరే డాక్టర్" అన్నాడు మోహన్ అలియాస్ విల్సనంకుల్.

దిలీప్ శిల్పతో "మీ మోహన్ని నాకోసారి ఫోన్ చెయ్యమనండి" అన్న వెంటనే అది విల్సనంకుల్ ఇంట్లో రెక్కలు కట్టుకుని వాలింది.

అంకుల్‌కి అన్ని విషయాలు చెప్పి, రాత్రి తొమ్మిదిపైన దిలీప్ క్లినిక్‌నుంచి వచ్చే సమయానికి మళ్ళీ అప్పట్లా మోహన్ పాత్రకు డబ్బింగ్ చెప్పమని కోరింది.

"అమ్మాయ్ అప్పట్లో అయితే నా గొంతు అతనికి కొత్త. ఇప్పుడు కనిపెట్టేస్తాడేమో" అన్నాట్ట అంకుల్.

"అబ్బే... దిలీప్ అంతదూరం ఆలోచించడులే అంకుల్" అని చెప్పి ఒప్పించింది.

ఇప్పుడు విల్సనంకుల్ దిలీప్‌తో మాట్లాడుతుంటే హైమావతిగారి రూమ్‌లో వున్న ఇంటర్‌కమ్‌లోంచి వింటున్నాం రిసీవర్ని వంతులవారీగా లాక్కుంటూ.

"యూ... మీన్" అన్నాడు దిలీప్.

"మీరేగా డాక్టర్, మోహన్ని చేసుకోవద్దూ, అతని జీవితాన్ని మీ రోగాలతో నాశనం చెయ్యొద్దూ, పిల్లల్ని కని సమాజాన్ని పొల్యూట్ చెయ్యొద్దూ అంటూ శిల్పకి క్లాసు పీకింది. దాంతో ఆమెకి బ్రెయిన్ వాష్ అయిపోయింది. అటు మనసులోని ప్రేమని చంపుకోలేకా, ఇటు నన్ను పెళ్ళిచేసుకోలేకా కుళ్ళిపోతూ, నా ఒళ్ళో తల పెట్టుకుని రక్తం కక్కుకుని చనిపోవాలన్న నిర్ణయానికొచ్చింది. ఆ నిర్ణయమే ఆమెనట్లా ఆవకాయకూ, బజ్జీలకూ బానిసని చేసింది" మోహన్ అలియాస్ విల్సనంకుల్ గొంతు గాద్గదికమైంది.

"చూడు మిస్టర్" దిలీప్ గొంతు మృదువుగా వుంది "యాజె డాక్టర్ నేను చెప్పాల్సింది చెప్పాను. నేను చెప్పింది నూటికి నూరుపాళ్ళూ నిజం కూడా. కానీ నిజాన్ని గ్రహించకుండా మీరు నన్ను నిందిస్తున్నారు. ఆవిడేమో నా తప్పిదాన్ని ఎత్తిచూపిస్తున్నట్టు, నా ముందు కూర్చుని కారం తింటూ కన్నీళ్లు పెట్టుకుంటోంది. దిసీజాల్ నాన్సెన్సిబుల్"

"నో డాక్టర్... నాన్సెన్సిబుల్ కాదు. ఇట్స్ వెరీ సెన్సిబుల్"

"ఎవరి అభిప్రాయం వాళ్ళది. ఇప్పుడు మిమ్మల్ని ఫోన్ చెయ్యమంది కూడా ఇది చెప్పటానికే. మీ అభిప్రాయం ప్రకారం మీరు నడుచుకోండి. మధ్యలో నా ఒపీనియన్‌కి విలువివ్వాల్సిన అవసరం మీకుగానీ, శిల్పగారిగ్గాని లేదు. మీరు ముందుగా అనుకున్నట్టే, ఆవిడ్ని పెళ్ళిచేసుకోండి. చావును కొనితెచ్చుకోవాలనుకునే ఆమె ప్రయత్నాల్ని చూడలేకపోతున్నా. మీ దార్న మీరు పొండి. మీ విషయంలో నేనే సలహా ఇవ్వదల్చుకోలేదు"

"మరి మాకు పుట్టబోయే పిల్లలు ఫ్యూచర్ సొసైటీని..."

"ఓ హెల్ విత్ ద సొసైటీ. ప్లీజ్ యు గో ఇన్ యువర్ ఓన్ వే" దిలీప్ చిరాగ్గా చెప్పాడు.

"మైగాడ్... మీరేనా... ఇట్లా అంటున్నది" విల్సనంకుల్ ఫోన్లో ఆశ్చర్యపోతున్నారు.

"ఆఁ... నేనే"

"మీరేదో కన్‌ఫ్యూజన్‌లో వున్నట్టున్నారు డాక్టర్. ఎనీ పర్సనల్ ప్రాబ్లెమ్?"

"మీరేదైనా అనుకోండి. శిల్పని పెళ్లిచేసుకోండి. దట్సాల్"

దిలీప్ ఫోన్ కట్ చేశాడు.

"యాహూ" అంది శిల్ప.

దిలీప్‌లో వున్నట్టుండి ఇంత మార్పా! నాకూ ఆశ్చర్యంగానే వుంది.

"గురుడు లైన్లోకొస్తున్నాడు. గెట్ రెడీ

అంజూ" అంది శిల్ప.

నాకు చురుక్కుమంది. "లైనెప్పుడో చెరిపేశాను. ఇక వెయ్యను"

"అదేంటి... అతన్లో ఈ మార్పునేగా నువ్వు కోరుకుంది"

"కోరుకున్నాను ఒకప్పుడు. ఇప్పుడు కోరుకోవటంలేదు"

"అబ్బా. నువ్వు కోరుకున్నప్పుడు జరగనిది కోరుకోనప్పుడు జరుగుతోంది. డిఫరెన్సేంటి? " శిల్ప విసుక్కుంది.

"ఇట్ మేక్స్ ఆల్ ద డిఫరెన్స్" చెప్పాను కసిగా.

"ఓహో... హృదయం అద్దంలాంటిది. క్రిష్టాలయంలో అవాళ ముక్కలైంది. ఇవాళ అతకదు అంటావ్. అంతేకదూ అంజూ"

"అంతే" అన్నాను.

"క్విక్‌ఫిక్సు... ఫెవికాలూ నీకు తెలియనివి కావు"

"సెలో టేప్ కూడా తెలుసు. నోటికి అడ్డంగా అంటిస్తాను"

శిల్ప ఓ క్షణం నాకేసి జాలిగా చూసి "తలచినదే జరిగినదా దైవం ఎందులకూ?



జరిగినదే తలచితివా శాంతిలేదు నీకూ" అనే పాట హమ్ చేస్తుంటే.

నాకు దాని గొంతు పిసికి చంపాలన్నంత కోపం ముంచుకొచ్చిందిగాని, దాన్ని కాపాడ్డానికా అన్నట్టు, కర్చీఫ్‌తో నుదుటిమీద తుడుచుకుంటూ అమ్మను చూడ్డానిక్కాబోలు దిలీప్ ఆ గదిలోకి వచ్చాడు.

శిల్ప పాటని హఠాత్తుగా ఆపేసి ఎంతో సేపట్నించి ఆ పని చేస్తున్నట్టు హైమావతి గారి కాళ్ళు పడుతూ కూర్చుంది.

దిలీప్ శిల్పకేసి అభిమానంగా చూశాడు.

"గంటనుంచీ కాళ్ళు పడుతుంటే ఇప్పుడే నిద్రలోపడ్డారు. లేపకండి" అంది శిల్ప దిలీప్‌తో.

దిలీప్ తల్లి నుదుటిని ఆప్యాయంగా స్పృశించి గది బయటకు వెళుతూ ఓసారి వెనక్కి తిరిగి చూశాడు "శిల్పా! ఓసారి రండి" శిల్ప కడుపులో మంటకు గింగిరాలు తిరుగుతున్నట్టుగా అభినయిస్తూ అతని వెనకే వెళ్లింది.

"మీరూ రండి" అన్నాడు వాళ్ళతోపాటు వెళ్ళాలా వద్దా అని తటపటాయిస్తున్న నన్ను చూసి.

హాల్లోకి వెళ్ళాక మా యిద్దర్నీ చూస్తూ "కూర్చోండి" అన్నాడు. ఇద్దరం సోఫాలో కూర్చున్నాం. మా ఎదురుగా వున్న సోఫాలో అతనూ కూర్చున్నాడు.

ఒక్కక్షణం తటపటాయిస్తున్నట్టుగా చూసి అన్నాడు "మోహన్‌గారితో మాట్లాడాను"

"ఇక్కడకొచ్చారా?" సంభ్రమంగా అడిగింది శిల్ప.

"లేదండీ.. ఫోన్‌లో" అన్నాడతను.

శిల్ప ముఖం అంతలోనే దిగాలుగా అయిపోయింది.

'ఏం... ఎక్స్‌ప్రెషన్స్! సినిమా ఫీల్డ్‌కెళ్ళావనుకో... అన్ని భాషల్లో అమాంతం బుక్కయిపోతావ్' అనుకున్నా శిల్పని చూస్తూ.

దిలీప్ రెండు మూడుసార్లు గొంతు సవరించుకుని చెప్పాడు. "శిల్పగారూ! మీరికమీదట అవీ ఇవీ తిని చేజేతులా ఆరోగ్యం పాడుచేసుకోనవసరంలేదు"

"మరి నా మోహన్ ఒళ్లో తలా... రక్తం" అర్థోక్తిలో ఆపేసింది.

"ఆ అవసరం ఇకలేదు. మీ మోహన్ని మీరు లక్షణంగా పెళ్ళిచేసుకోండి"

"డాక్టర్" అందది ముఖంలో వెయ్యి బల్బులు ఒక్కసారిగా వెలిగి పోతుండగా 'నాకు తెలీకుండా దీనికెవడైనా బోయ్ ఫ్రెండ్ వున్నాడా ఏంటబ్బా' అని నాకే అనుమానం వచ్చేంత రీతిలో ఇచ్చిందా ఎక్స్‌ప్రెషన్ని.

"మోహన్‌తో ఆ విషయమే మాట్లాడాను"

శిల్ప కాసేపు వెయ్యిబల్బుల కాంతిని ముఖంమీద అలాగే మెయిన్‌టెన్‌చేసి ఆనక సగం బల్బుల్ని ఆర్పేస్తూ అడిగింది "మరి సమాజం?"

"దాన్ని గురించి డాక్టర్‌గారు చూసుకుంటార్లే! నీ పెళ్ళి గురించీ నీ మోహన్ని గురించీ నువ్వు చూసుకో"

చటుక్కున అనేశాను. అసంకల్పితంగా వచ్చేశాయామాటలు నా నోటినుండి.

ఆ మాటలన్నప్పుడు దిలీప్ నావంక చూసిన చూపును తల్చుకుని 'ఎంత వెధవ పని చేశానా' అని ఆ రాత్రంతా బాధపడుతూనే వున్నా.

ఎందుకంతగా బాధపడ్డానంటే ఎవరో రచయిత, "ఎవరూ ప్రేమించకపోయినా ఫరవాలేదు కొందరిచేత దారుణంగా తిట్లయినా తినాలి. అది కూడా లేదంటే మన వునికిని ఎవరూ గుర్తించనట్టే" అన్న మాటల్ని పాటించలేకపోయినందుకు.

ఇప్పుడనవసరంగా దిలీప్‌ని పరోక్షంగా తిట్టి అతని ఉనికి నేను గుర్తించినట్టయింది.

ఛీ...ఛీ... అనుకున్నా ఓ వెయ్యిసార్లు.

ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు నాకు.

"నాకు అన్నం వద్దు... అజంత కావాలి" అన్న హైమావతిగారి మాటలే నా చెవుల్లో

గింగురుమంటున్నాయి.

ఈ ఇంటికి నా రాకవల్ల సమస్య సాల్వ్ కావడం కాదు... మరింత జటిలమయ్యేట్టుందనిపించింది నాకు.

"శిల్పా... మనం రేపు వెళ్ళిపోతున్నాం" అన్నాను.

"ఆవిడ ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నారు. ఈ సమయంలో వెళ్ళటం... అంత వైజ్ కాదేమో" అంది శిల్ప.

"పోనీ... నాలా వేషం వేసుకుని నువ్వుండు" అన్నాను కసిగా.

"అది కాదు అంజూ"

"నువ్వేం మాట్లాడకు నోర్మూసుకో" అన్నాను.

శిల్ప బదులివ్వలేదు. మళ్ళీ నేనే అన్నాను.

"ఇంకొన్నాళ్లు వున్నామంటే... ఆవిడకి నాతో అటాచ్‌మెంట్ మరింత పెరుగుతుంది. అప్పుడొదిలి వెళ్ళటం ఇంకా ప్రమాదం. ఏదో ఒకరోజుకు వెళ్ళాల్సిన వాళ్ళమే కాబట్టి ఇప్పుడు వెళ్ళడమే తెలివైన పని"

"సరే... ఉదయాన్నే దిలీప్‌కి చెప్పెయ్" ఆవులిస్తూ అందది.

ఉదయం... దిలీప్ టిఫిన్‌చేసి... హాస్పిటల్‌కి బయల్దేరబోతుంటే "ఎక్స్‌క్యూజ్ మి" అన్నాను. ఏంటన్నట్టు చూశాడు.

"ఇవాళ... మధ్యాహ్నం నేనూ, శిల్పా వెళ్ళిపోతున్నాం" అని చెప్పి అతని ముఖంలో ఫీలింగ్స్ స్టడీ చేశాను.

షాక్ తగిలినట్టు చూశాడు.

"నెల దాటింది" అన్నాను, ఇచ్చిన గడువు పూర్తయిందన్నట్టు.

అతనేదో ఆలోచనలో పడ్డాడు.

ఉండమని బతిమాలతాడేమో అనుకున్నాను.

ఎటువంటి పరిస్థితుల్లో కూడా అందుకు ఒప్పుకోకూడదు అనుకుంటూ... పర్స్ తెరిచి పదిహేనువందలు తీసి చేతిని అతని ముందుకు చాపాను. మా పేమెంట్"

"పేమెంటా?" అన్నాడు అర్థం కానట్టు.

"ముందే చెప్పాను. పేయింగ్ గెస్ట్‌గా తప్ప వుండనని" గుర్తుచేశాను.

"ఓఁ... అవునుకదూ!" అన్నాడేగాని డబ్బు తీసుకోడానికి మాత్రం చేయి చాపలేదు.

"తీసుకోండి" అన్నాను.

"మీతో కాస్త మాట్లాడాలి. తర్వాత తీసుకుంటా" అన్నాడు.

"మీరు హాస్పిటల్‌నుండి వచ్చేంతవరకు మేముండమేమో" అన్నాను.

"ప్లీజ్..." అన్నాడు.

"సర్లెండి" అన్నాను.

అతనెళ్ళిపోయాడు. డబ్బుతీసి పర్స్‌లో పెట్టుకున్నా.

అతను ఇవ్వబోతున్న డబ్బును తీసుకోలేదుగాని వద్దనలేదు. తర్వాత్తీసుకుంటానన్నాడు. వెళ్ళిపోతానంటే వుండిపొమ్మనలేదు. కాస్త వెయిట్ చెయ్యండి, తర్వాత వెళ్దురు అన్నాడు.

ఎందుకో నాక్కాస్త బాధగా అన్పించింది.

"దుర్మార్గుడు... వెళ్తామంటే... వెళ్ళిపొమ్మంటాడే" అంది శిల్ప.

శిల్ప మాటలతో నా బాధ ఎగిరిపోయింది.

"ఏం వదల్లేకున్నావా?" అన్నాను ఉక్రోషంగా.

మధ్యాహ్నం ఒంటిగంటకు దిలీప్ కారు వచ్చి డ్రైవ్ వేలో ఆగింది. అతను భోంచేస్తుంటే గమనించాను. ఎందుకోగాని వర్రీడ్‌గా వున్నాడు.

నేనూ శిల్పా బట్టలు సర్దుకుంటున్నాం.

రాజీ వచ్చి "సారు పిలుస్తున్నారు" అంది నాతో.

"ఎక్కడున్నాడు?" అన్నాను.

"తోట్లో వున్నారు" అంది.

"తోటంటే పచ్చదనం. గ్రీన్‌కలర్ ఈజ్ ద సింబల్ ఆఫ్ లవ్. నాకేదో అనుమా

నంగా వుంది అంజూ" అంది శిల్ప.

ఆ బిల్డింగ్ ప్రహరీలోపల వున్న ఖాళీ జాగానిండా ఎన్నో చెట్లూ... పూల మొక్కలూ వున్నాయి. దాన్నే తోట అంటుంది రాజీ.

అశోక వృక్షాలకు బోగన్ విల్లా తీగలు పెనవేసుకుపోయి.... పొదరిల్లులా ఏర్పడ్డ చోట... లాన్‌లో వున్న పసుపురంగు గార్డెన్ చెయిర్లో... కూర్చుని వున్నాడతను.

మిట్టమధ్యాహ్నమైనా ఆహ్లాదకరమైన నీడ పరుచుకుని వుంటుందక్కడ.

ఆకులు వడలకుండా వాచ్‌మేన్ మొక్కల మీద నీళ్లు స్ప్రే చేసినట్టున్నాడప్పుడే. ఎండలో ఆకులు తళతళలాడుతున్నాయి.

ఆ ఇంటికి... వాచ్‌మెన్ కమ్ గార్డెనర్ అతనే. అప్పుడప్పుడూ రాజీ కూడా గార్డెనర్ అవుతూంటుంది.

నేను అతను కూర్చుని వున్నచోటికి వెళ్ళగానే "కూర్చోండి" అన్నాడు.

అతనికెదురుగా వున్న చెయిర్లో కూర్చున్నాను.

అతను కాసేపు మొక్కలకేసీ... ఆకాశంకేసీ... తోచనట్టు కాసేపు, ఆలోచిస్తున్నట్టు కాసేపూ చూశాడు.

మధ్యమధ్యలో నాకేసి కూడా చూస్తున్నాడు.

మొత్తానికేదో చెప్పాలనుకుని చెప్పలేకపోతున్న ఫీలింగ్ ఆ ముఖంలో కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

"చెప్పండి" అన్నాను.

ఏదో చెప్పబోయాడు. మళ్ళీ విరమించుకున్నాడు. మళ్ళీ ప్రయత్నించాడు. మళ్ళీ ఫెయిలయ్యాడు.

"ఎందుకంత టెన్స్ అవుతున్నారు? ఫీల్ ఫ్రీ... విషయం చెప్పండి" అన్నాను.

"నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు.

"వ్వాట్? " అన్నాను.

"ఎందుకంత ఆశ్చర్యపోతారు. నేను మిమ్మల్ని పెళ్ళాడాలనే నిర్ణయానికొచ్చాను" అన్నాడు.

నా ఫ్యామిలీ హిస్టరీ కార్డ్ చూసి... నామీదున్న ప్రేమను సైతం చంపుకున్న మనిషి. ఇప్పుడు అదేదో అతిమామూలు విషయమైనట్టుగా నాతో పెళ్ళి... కావాలా వద్దా అనే నిర్ణయం... కేవలం అతనిదే అయినట్టుగా... ఎంత సింపుల్‌గా నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను అంటున్నాడు.

"ఏమంటారు? " అన్నాడు.

"మీరట్లా అడిగుండాల్సింది కాదంటాను" అన్నాను.

అర్థం కానట్టు చూశాడు.

"మీరు నన్ను చేసుకుంటారా? అని అడగడం రైట్. ఎందుకంటే నా ఎఫ్. హెచ్. సి. చూసి మీరు నాతో పెళ్లికి 'నో' అనుకున్నప్పుడే 'నేను మిమ్మల్ని చేసుకుంటాను' అనే అర్హత కోల్పోయారు" అన్నాను.

అతనదేదో జోక్ అన్నట్టు నవ్వాడు "ఓకె.... మీరు నన్ను చేసుకుంటారా? " అన్నాడు.

"చేసుకోను" ఖచ్చితంగా చెప్పాను.

"ఎందుకని? " అన్నాడు ఆశ్చర్యంగా.

"నా ఎఫ్. హెచ్. సి. మీకు నచ్చనప్పుడు మీరేం నిర్ణయం తీసుకున్నారు? " అడిగాను.

అతను మాట్లాడలేదు. నాకు తెలుసు. అతను నోరు తెరిచే ప్రయత్నం చెయ్యలేదని.

"ఇప్పుడు మీ ఎఫ్. హెచ్. సి. నాకు నచ్చలేదు. సో... మన పెళ్ళి విషయంలో మీరానాడు తీసుకున్న నిర్ణయాన్ని నేనివాళ తీసుకుంటున్నా తప్పా? " అన్నాను.

తప్పని అతనెట్లా చెబుతాడు. మౌనమే శరణ్యం అన్నట్టుగా వూరుకున్నాడు.

"వెళ్లొస్తాను" లేచాను.

అతని కళ్లలో కలవరం స్పష్టంగా కనపడింది.

"ప్లీజ్... అజంతా! నన్నర్థం చేసుకోండి. చెప్పాగా. అమ్మంటే నాకు ప్రాణంతో సమానం. మీరు లేకుంటే ఆమె నాకు దక్కదు. కనీసం ఆమె కోసమైనా మీరొప్పుకోవాలి" అంటూ ఆపాడు.

"ఇప్పుడు మీ అమ్మగారికి వచ్చింది మానసికవ్యాధి. ఆవిడకది... ఎవరినుంచో సంక్రమించింది. రేపు మీ పిల్లలకు రావచ్చు సో... నన్ను పెళ్ళాడి, పిల్లల్ని కని ఫ్యూచర్ సొసైటీని అనారోగ్యం పాలు చేసే హక్కు మీకు లేదు. మీ యూజెనిక్స్ చెప్పేది అదేగా" అన్నాను.

అప్పుడన్నాడు దిలీప్ "అన్నిటికన్నా... అమ్మ నాకు ముఖ్యం"

"కీపిటప్" అని చెప్పి వచ్చేశాను.

అప్పటికే శిల్ప... సూట్‌కేస్‌లు సర్దటం ముగించి కుర్చీలో చేరబడి రెస్ట్ తీసుకుంటోంది.

నన్ను చూడగానే "నా అనుమానం నిజమైందా? " అన్నది.

"ఆcహాc... సెంట్ పర్సెంట్" అంటూ జరిగిందంతా చెప్పాను.

"పాపం... అమాయకుడు. ఎర్రటి ఎండలోనా ఇట్లాంటి కబురు చెప్పడం. ఏ చల్లని సాయంకాలమో... చెబ్తే... ఫలితం వుండేదేమో" అందది.

"చల్లని సాయంకాలమైనా, శ్రావణ మంగళవారమైనా నా సమాధానం ఇదేగాని... నువ్ బయల్దేరు" అన్నాను.

"ఇంకోవారమైనా వుండకూడదామ్మా" అన్నాడు దిలీప్ ఫాదర్.

వుండేదాన్నేమో దిలీప్ అట్లా అడక్కుండా వుంటే... ప్రస్తుతం మాత్రం "సారీ అండీ కుదరదు. రోజూ... వచ్చిపోతుంటాలెండి" అన్నాను.

నేను వెళుతున్నట్టు హైమావతిగారికి చెప్పొద్దన్నారు. సరేనన్నాగాని... ఆమెకు చెప్పకుండా వెళ్ళాల్సిరావడం మనసుకు వెలితిగానే అన్పించింది.

రాజీ... కారు డిక్కీలో మా లగేజ్ పెట్టేసింది.

ఓసారి కిటికీలోంచి... ఆవిడకేసి చూశాను.

నా కోసం పరితపించే ఒక హృదయం... నా నిష్క్రమణను పసిగట్టకుండా నేను తనకున్నానన్న భరోసాతో హాయిగా నిద్రపోతోంది.

నా కళ్లలో చివ్వున వూరాయి నీళ్లు.

"వెళ్ళక తప్పదమ్మా. అర్థం లేని ఈ బంధాన్ని... అనవసరంగా కొనసాగించడం నాకిష్టం లేదు. నా ఆబ్సెన్స్‌ని నువ్వు భరించగలిగితే నీకు నయమైనట్టే. భరించి నిలబడాలని దేవుడ్ని కోరుకుంటున్నా"

డైనింగ్ టేబుల్ మీద దిలీప్ చూసేలా డబ్బును వుంచాను. కార్లో వెళ్లి కూర్చున్నాను.

"మీకెందుకు శ్రమ? డ్రైవర్ని పంపించండి. చాలు" అన్నాను డ్రైవింగ్ సీట్లో కూర్చోబోతున్న దిలీప్‌తో.

అతనేం బదులు చెప్పకుండా కారు స్టార్ట్ చేశాడు.



నా పెళ్లి నిశ్చయమైంది.

ఎవరితోనో కాదు... దిలీప్‌తో.

ఇప్పుడు నేను విల్సనంకుల్ ఇంట్లో లేను. చదువుని అర్ధాంతరంగా ఆపేసి ఇంటికొచ్చేశాను.

పెళ్ళింకా రెండురోజులే వుంది. అసలు ముహూర్తాలు పెట్టుకున్నదే నాలుగురోజుల క్రితం. అమ్మమ్మ కాసుల పేరుతో సహా దిగింది. మామయ్య, అత్తయ్యా... పట్టు చీరెలకనీ, నగలకనీ... బయటి పనులన్నీ నెత్తినేసుకుని పరుగు పందాలు వేసుకుంటున్నారు.

ఈ పెళ్ళి ఇట్లా నిశ్చయం కావడంలో నా పాత్ర ఎంతో నాకర్థం కావటంలేదు.

ఆరోజు... దిలీప్ ఇంటినుండి వచ్చేశాక విషయం అర్థం చేసుకున్న హైమావతిగారు హిస్టీరియా పేషెంట్‌లాగా రెచ్చిపోయారట. చేతికందిన వస్తువులన్నీ విసిరిసిరి కొట్టి... తన ఒంటిని తనే గాయపర్చుకుని ఫిట్స్ వచ్చినట్టు పడిపోయారట.

డాక్టర్ ప్రవీణ్.... ఆమెను ఇమ్మీడియెట్‌గా హాస్పిటల్లో అడ్మిట్ చేసుకుని సెడేషన్ ఇచ్చారట. మెలకువ వచ్చినప్పుడల్లా అల్లరి చేయడం, నాకోసం ఏడవటం, తిరిగి సెడేషన్ ఇవ్వగానే మత్తుగా పడుకోవటం జరుగుతోందట. ఈ విషయాలన్నీ ఆ తెల్లవారి దిలీప్ ఫాదర్ విల్సనంకుల్ ఇంటికొచ్చి ఏకరువు పెట్టారట. ఆయన వచ్చినప్పుడు నేనూ శిల్పా ఇంట్లోలేం యూనివర్శిటీకి వెళ్లాం. రాగానే విల్సనంకుల్ యూనివర్శిటీకి వచ్చి విషయం చెప్పి హాస్పిటల్‌కి బయలుదేరమన్నారు.

ఆవిణ్ణి చూసి ఇంటికి బయలుదేరుతుంటే... దిలీప్ ఫాదర్ చప్పున నా చేతులు పట్టుకుని "అమ్మా నువ్వు మా ఇంటి కోడలవక తప్పదు తల్లీ" అన్నాడు.

నేను సున్నితంగా ఆయన చేతులు వదిలించుకుని "సారీ... కావాలంటే... ఇంకో నెల్రోజులు మీ ఇంట్లో వుంటానంకుల్ ఆంటీని మామూలు మనిషిని చేస్తాను" అన్నాను.

"నెల తర్వాత నువ్వెళ్ళిపోతావ్. ఇదే పరిస్థితి మళ్లీ ఎదురైతే? " అన్నాడాయన.

"మళ్లీ ఇంకో నెలుంటుందిలెండి" అంది శిల్ప నాకేసి చూస్తూ. అది వెటకారమేమో అన్పించింది.

దిలీప్ ఫాదర్ విల్సనంకుల్‌ని దూరంగా తీసుకు

వెళ్లి చాలాసేపు మాట్లాడారు.

ఇంటి కొచ్చేశాక అంకుల్, ఆంటీ...

'నా నిర్ణయం చాలా దారుణం' అన్నారు.

"అతన్నసలు పెళ్ళి చేసుకోవాలనేదేగా నీ ఎయిమ్. అదిప్పుడు నెరవేరబోతుంటే కాదంటావెందుకు? " అంది శిల్ప కూడా.

"దిలీప్ నన్ను ప్రేమిస్తే పెళ్లిచేసుకోవాలన్నది నా ఎయిమ్ గాని, అతనేదో కారణంతో స్వార్థంగా నన్ను కావాలనుకున్నప్పుడు అతన్ని చేసుకోవటం నా ఎయిమ్ కాదు" కఠినంగా అన్నాను.

"అంటే నిన్ను ప్రేమించే వాళ్ళకే నువ్వు విలువిస్తావ్? " అవునా అన్నట్టు చూసింది జెరీనా ఆంటీ.

అవునన్నాను.

"మరి దిలీప్ తల్లి. నిన్ను ప్రేమించడమే కాదు నీకోసం పిచ్చిదైపోయింది. ఆమె ప్రేమకు విలువే లేదంటావా? " అందామె.

నేను సమాధానం ఇవ్వలేదు.

"ఒక ప్రాణం పోయినా ఫర్వాలేదుగాని ఆమెగారి ఆత్మాభిమానం మాత్రం దెబ్బతినకూడదు. దీన్ని స్వార్థం అనరా ఆంటీ? అడగండి" అంది శిల్ప.

నేనక్కడ నుండి లేచి వెళ్ళి తలుపులు మూసుకుని పడుకున్నాను.

ఆ మర్నాడనుకుంటా అమ్మా, నాన్నా వూర్నుండి వచ్చారు.

నన్ను చూడాలనేమో అనుకున్నాగాని అసలు కారణం తర్వాత తెలిసింది.

దిలీపూ, అతని ఫాదరూ నిన్న మా వూరెళ్ళి విషయమంతా చెప్పారట. నన్నెలా

గైనా పెళ్ళికి ఒప్పించమని రిక్వెస్ట్ చేశారట.

ఇక అక్కడందరిదీ ఒకపార్టీ అయింది. నేనొక్కదాన్నే ఒంటరి పోరాటం సాగించాను.

నన్నందరూ... ఒక మనిషి ప్రాణాన్ని నిలువునా తీయబోతున్న హంతకినన్నంత దారుణంగా మాట్లాడారు.

చివరికి అమ్మ "అంత గొప్ప వ్యక్తి కోరి నీ చెయ్యందుకుంటానంటే నీకిదేం పొయ్యే కాలం" అంది.

"ఎంత గొప్ప వ్యక్తి?" అన్నాను వ్యగ్యంగా.

"కనీసం నీకంటే గొప్పవాడేగా. బిజీ ప్రాక్టీస్ వున్న డాక్టర్, పైగా బోలెడంత ఆస్తి వుంది. అతనికేం తక్కువే?" అందమ్మ.

"ఒక్కటే తక్కువ, అది మనసు" అన్నాను.

నాన్న నవ్వాడు "నీ కుందామ్మా మరి మనసు?" అన్నాడు.

నేను దెబ్బతిన్నట్టు చూశాను "అదే నాన్నా నాకున్న ఆస్తి" అన్నాను గర్వంగా.

"రైట్ మరి మాట్లాడకుండా దిలీప్‌ని చేసుకో. అతనికోసం కాదు, చావు బతుకుల్లో వున్న ఒక ప్రాణిని అదీ నీ కోసం కలవరించే ప్రాణిని కాపాడ్డం కోసం. పెద్ద మనసు చేసుకుని ఈ పెళ్ళికొప్పుకో" అన్నాడు నాన్న.

నాన్న మాటల్లో వెటకారం లేదు, అథారిటీ లేదు, నిష్ఠూరత లేదు.

కేవలం మనసుంది.

అప్పుడొచ్చింది ఏడుపు నాకు. నాన్న గుండెలకు హత్తుకుని తనివితీరా ఏడ్చేశాను. అలా ఏడుస్తూనే దిలీప్‌ని నేనెందుకు కాదంటున్నానో చెప్పేశాను. ఇంత కాలం అతను చెప్పిన యూజెనిక్స్ గురించి మీకు చెప్పనిది మిమ్మల్ని బాధపెట్ట లేకే అని కూడా చెప్పాను.

అంతా విని నాన్న ఇందాకట్లాగే నవ్వాడు.

"నువ్వెంతసేపటికీ అతని గురించే ఆలోచిస్తున్నావ్. నిన్ను అభిమానించే అతని తల్లి గురించి ఆలోచించటం లేదు" అన్నాడు.

బాగా ఆలోచించాను. ఓ నిర్ణయానికొచ్చాను. దాని ఫలితమే ఈ పెళ్ళి.

డాక్టర్ ప్రవీణ్ నా నిర్ణయాన్ని అభినందించాడు. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా పెళ్ళి జరిగిపోవాలన్నాడు.

అందుకే ఆఘమేఘాలమీద మూహూర్తం పెట్టేసుకున్నారు.

★ ★ ★

మా పెళ్ళి నిశ్చయమైన నాలుగు రోజుల్లోనే ఆవిడ బాగా కోలుకుందట. అస్తమానం శుభలేఖనే చూస్తూ గడిపేస్తోందట. విల్సనంకుల్ ఫోన్ చేసి చెప్పాడు నాకు.

వాళ్ళ ఫ్యామిలీనంతా రెండ్రోజులు ముందుగానే పెళ్ళికి రమ్మంటే. "మగపెళ్ళి వాళ్ళం మేము. పెళ్ళి కొడుకుతోపాటే వస్తాం" అంది జెరీనా ఆంటీ ఫోజుగా.

పెళ్ళి రోజు రానే వచ్చింది. రాత్రి పదిన్నరకి ముహూర్తం. మగపెళ్ళివాళ్ళు వచ్చేశారని, మధ్యాహ్నం మూడు గంటలకే కబురు మోసుకొచ్చింది రాణి.

మా ఇంటి కెదురుగానే ఓ ఇల్లు ఖాళీగా వుంటే దాన్ని విడిదిల్లుగా ఇచ్చారు.

పెళ్ళి అక్కడికి దగ్గర్లోనే వున్న కల్యాణ మంటపంలో

విల్సనంకుల్ ఫ్యామిలీ అంతా ఇంట్లో మనుషుల్లా కలిసిపోయారు.

సాయంత్రం ఏడప్పుడు శిల్ప వచ్చి "అంజూ! హైమావతి ఆంటీ నిన్నోసారి చూడాలంటున్నారు. ఓసారి వస్తావా?" అంది.

ఆవిడ్ని చూడాలంటే విడిదింటికి వెళ్ళాలి. పెళ్ళి కూతుర్నయి వుండీ అట్లా వెళితే,

అందరూ నవ్వుకుంటారు. అందుకే వద్దన్నాను.

"సరే... ఆవిడ్నే ఇక్కడికి తీసుకు రమ్మంటావా!" అంది.

"ఆవిడ బలహీనంగా వుంది కదా!" అన్నాను.

"నించుంటే పడిపోయేలా వున్నారు" అంది.

ఓక్షణం ఆలోచించి "సరే పద" అన్నాను.

సాధ్యమైనంత వరకూ ఎవరూ చూడకుండా విడిదింటి వైపు నడిచాను శిల్పతో కల్సి.

అప్పటికే అత్తయ్య గమనించి "ఈ కాలం పిల్లలకి సిగ్గేలేదమ్మా. తాళికట్టకుండానే మొగుడ్ని చూడ్డానికి బయల్దేరింది" అంటూ మేలమాడింది.

అదేం కాదులే అని కోప్పడి విషయం చెప్పాను.

అయినా విన్పించుకోకుండా నవ్వుతూనే వుంది.

హైమావతిగార్ని పడుకోబెట్టిన గది దగ్గర పడుతున్నప్పుడు "శిల్పక్కా, నిన్ను అమ్మ అర్జంటుగా పిలుస్తోంది. ఆకులూ వక్కలూ కనబడ్డం లేదట" అంటూ విక్కీ వచ్చాడు.

"సర్లే... నువ్వెళ్లు. నేనావిడతో మాట్లాడుతూ వుంటాలే" అని దాన్ని పంపించాను.

గదిని సమీపించాను. తలుపులు దగ్గరేసున్నాయి. అక్కడెవరూ లేరు.

ముహుర్తానికి ముందే భోజనాలు ఏర్పాటుచేయటంతో దాదాపుగా మగ పెళ్ళివాళ్లంతా కల్యాణమంటపానికి వెళ్ళిపోయారు.

తలుపుమీద చేయివేసి నెట్టబోతూ ఉలిక్కిపడి ఆగిపోయాను. పెద్దపెట్టున నవ్వుతున్న విల్సనంకుల్ గొంతు విన్పించింది. ఆ నవ్వుతో మరో రెండు గొంతులు శృతి కలిశాయి.

అందులో ఒకటి హైమావతిగారిది. రెండవది ఆమె భర్తది.

నెలరోజులు వాళ్ళింట్లో వున్నాను. వాళ్ళ నవ్వటం కాదు దగ్గినా ఆ గొంతుల్ని పోల్చుకోగలను.

మొత్తానికి అందరం కలిసి బ్రహ్మాండమైన ప్లాన్ వేశాం. అసలీ ఐడియా శిల్పది. ఆ అమ్మాయిది బుర్ర కాదు. జస్టెకిట్ ఆఫ్ ఐడియాస్" అంటున్నాడు విల్సనంకుల్.

"బంగారంలాంటి పిల్లను కాదంటాడా! ఆ శిల్ప చెప్పేవరకూ, వీడి తల తిక్క వేషాలు మాకు తెలీకపోయె. ఏ పిల్లను చూసొచ్చినా వీడికి పెళ్ళి కుదరదేమిటా అని ఎంత బెంగ పడ్డాను! ఎంతమంది దేవుళ్ళకు ఎన్ని మొక్కులు మొక్కాను. చివరికి ఏ దేవతో శిల్ప రూపంలో వచ్చి మా సన్నాసికి ఈ పిల్లను కుదిర్చిపెట్టింది" అంటోంది దిలీప్ తల్లి.

"మొత్తానికి భలే నటించావే" అన్నాడు దిలీప్ ఫాదర్.

"అజంత నా మనసుకు నిజంగానే అంతగా నచ్చిందండీ. వస్తే గిస్తే, ఆ పిల్లే నా యింటి కోడలుగా రావాలని పెళ్ళి చూపుల్లో చూసిన్నాడే అనుకున్నా" అంటోందామె సంతోషంగా.

"ష్... అరవకండి. అజంతనోసారి పిల్చుకు రమ్మని శిల్పకు చెప్పాను. వచ్చినా వస్తుంది" అన్నదావిడ.

"కరక్టే" అన్నాడు దిలీప్ ఫాదర్.

"అమ్మాయి విన్నాపర్లేదుగాని దిలీప్ విన్నాడంటే కొంప మునిగిపోతుంది. ఆ మూడు ముళ్లూ పడ్డాక మన్నాటకం తెలిసినా ఇంకేం చెయ్యలేడు. వెధవకు ఎంత అభిమానమో నేనంటే, నాకోసం గాదూ, ఈ పెళ్ళికి ఒప్పుకున్నాడు" అందావిడ మళ్ళీ.

నా కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్టయింది.

దిలీప్‌కోసం కాదు నేనీ పెళ్ళికొప్పుకుంది. కేవలం ఆవిడకోసం. నా మీద ప్రేమతో పిచ్చిదైపోతుందన్న జాలితో, అభిమానంతో, బట్ ఆవిడ ప్రేమాభిమానాలు నాటకం. తన కొడుకు పెళ్ళికోసం, ఆవిడ ముచ్చటగా

ఆడుకున్న నాటకం.

విల్సనంకులూ, శిల్పా నా మనుషులనుకున్నాను. నా ఆత్మాభిమానాన్ని ఎందుకింతగా దెబ్బతీశారు?

నాకన్నా దిలీప్‌ని వాళ్ళు ఎక్కువగా అభిమానించారా!

ఒక్కసారిగా దిలీప్ నా కళ్లముందు నిలబడ్డాడు.

అమ్మంటే అతనికి ప్రాణం. కేవలం ఆ ఒక్కకారణంతో అతను నన్ను చేసుకోవడానికి ఒప్పుకున్నాడు.

తన తల్లి ఆడేది కేవలం నాటకం అని తెలిస్తే ఈ నిర్ణయం మార్చుకుంటాడా?

గిరుక్కున వెనుదిరిగాను.

నా వెనకే నిలబడి బిత్తర చూపులు చూస్తోంది శిల్ప.



"జరిగిందిది. ఇందులో మీ తప్పేం లేదు. మీ మీద నాకు కోపం కూడా రావటం లేదు. మీ ప్రిన్సిపుల్స్ మీవి. ఆవిడేదో నాటకాలాడి మీ పెళ్ళి చెయ్యాలనుకోవడం కూడా తప్పుకాదేమో! తల్లిగా అది ఆవిడ ఆరాటం. బట్, మొదట్లో మీ ప్రిన్స్‌పుల్స్‌కి ఆ తర్వాత మీ అమ్మగారి నటనకీ, నన్ను నేను బలిచేసుకోవటానికి మాత్రం నేను సిద్ధంగా లేను"

ఎంత బేలెన్స్‌డ్‌గా వుందామన్నా నాకు చేతకాలేదు. విపరీతమైన ఆవేశంతో నా గొంతు వణికింది.

అతను నాకేసి అభావంగా చూశాడు.

నన్ను నేను కంట్రోల్ చేసుకున్నాను "ఈ పెళ్ళి ఆగిపోయినా, ఇక మీ అమ్మకేం కాదు. సో... మీరిక ఆవిడ్ని తీసుకుని వెళ్ళిపోవచ్చు ఆవిడ్నేమీ అనకండి. ఇదంతా మీ మీద ప్రేమతోనే చేసింది" అన్నాను.

అతనింకా అట్లాగే చూస్తున్నాడు.

నేను చెప్పాల్సింది అయిపోయిందన్నట్టుగా గదిగుమ్మం దాట బోయాను.

నా కొంగు దేనికో తగులుకుని నన్ను వెనక్కి లాగింది.

విడిపించుకుందామని వెనక్కు తిరిగాను.

నా కొంగు చిక్కుపడింది దిలీప్ చేతిలో.

అతను నాకు దగ్గరగా వచ్చాడు. కళ్లలోకి కళ్లు పెట్టి చూస్తూ పిల్చాడు అప్పుడెప్పుడో, ఒకానొక ఆవేశంలో ఉద్వేగంలో పిలిచినట్టు ఏకవచనంలో "అంజూ" అంటూ.

నేను ఒక్క అడుగు వెనక్కువేయబోయాను.

అతని చేయి బలంగా నన్ను ముందుకు లాక్కుంది.

"నాకీ విషయాలన్నీ ముందే తెలుసు. ఆరోజు "నన్ను పెళ్ళిచేసుకుంటావా" అని అడిగాను చూడు ఆ ముందురోజే తెలిసింది నాకు అమ్మ అనారోగ్యం నాటకమని. డాక్టర్ ప్రవీణ్, నాన్న మాట్లాడుకుంటుంటే విన్నాను. మనసులోనే వుంచుకున్నాను"

నేను కన్నార్పకుండా అతన్నే చూస్తున్నాను.

"గొడవ చెయ్యకుండా మనసులోనే ఎందుకుంచుకున్నానో అడగవేం?" అన్నాడు.

నేనడగలేదు.

అతనే అన్నాడు "అప్పటికే నా మన

సులో, ఓ భావన పుట్టింది. అంతకుముందు మనం కలిసి తిరిగాం. హోటళ్లకెళ్లాం. ఆలయాల కెళ్లాం. ఎంతోదగ్గరగా మసిలాం. కానీ ఆ దగ్గరితనంలో కూడా నా మనసులో పుట్టలేదీ భావన. ఎప్పుడైతే నిన్ను కాదన్న నా యింట్లోకి నీకేమీ కాని నా తల్లి కోసం నీ అభిమానాన్ని చంపుకుని అడుగు పెట్టావో ఆ క్షణాన పుట్టిందా భావన. నువ్ నా మనసుకు చాలా దగ్గరగా వచ్చినట్టన్పించింది. అప్పట్నుంచీ నా మనసులో పుట్టిన భావనకీ, నా ప్రిన్స్‌పుల్స్‌కీ వార్ మొదలైంది. ఆ భావన రోజురోజుకీ బలం పుంజుకుని నా ప్రిన్స్‌పుల్స్‌ని తుత్తునియలు చేయసాగింది. ఆ భావనకి నేను ప్రేమ అని పేరు పెట్టుకున్న రోజే మా అమ్మ ఆడే నాటకం నాకు తెలిసిపోయింది. మామూలుగా మండిపడి గొడవపడాల్సిన నేను, నాకు తెలీకుండానే మిన్నకుండిపోయాను. క్రమంగా నాకు తెల్సిపోయింది. నేన్నిన్ను గాఢంగా కోరుకుంటున్నానని. యూజెనిక్స్ కాదు కదా ఆ దేవుడు కూడా ప్రేమని జయించలేడని. అయినా అహం అడ్డొచ్చి, నా తల్లిని వంకగా చూపించి నిన్ను పెళ్ళాడాలనుకున్నాను. నేనడిగిన వెంటనే నువ్వొప్పుకుని వుంటే అమ్మ నాటకం అప్పుడే బయటపడేది. నువ్వొప్పుకోలేదు. అందుకే ఆవిడ్నట్లా కంటిన్యూ చెయ్యనిచ్చాను, లేదంటే నువ్వు నాకు దక్కవన్న భయంతో. ఇప్పుడు నాలో ఆ అహం కూడా లేదు. కేవలం నీ పట్ల అంతులేని అనురాగం తప్ప"

నేను దిలీప్‌కేసి నమ్మలేనట్టు చూశాను.

అతను నాలో నమ్మకాన్ని పెంచటానికా అన్నట్టు నన్ను హృదయానికి హత్తుకున్నాడు. "నీకోసారి ఓ కల చెప్పాను గుర్తుందా? ఆ కల నన్ను అమెరికాలో వున్నన్ని రోజులూ వెంటాడింది. ఎందుకట్లా అది నన్ను వెంటాడిందో ఇప్పటికి తెలిసింది నాకు"

"మైగాడ్" అరిచేసింది శిల్ప. "మరీ ఇంత పబ్లిగ్గా... ఇట్లాంటి సీనా. కట్ కట్ కట్"

అదిరిపోయి అతన్నుండి విడివడ్డాను. గ్రూప్ ఫోటోలోలా నిలబడి వున్నారంతా అక్కడ.

"అయితే దిలీప్! మా శిల్పని నేను నిరభ్యంతరంగా పెళ్ళిచేసుకోవచ్చంటారు" అన్నాడు విల్సనంకుల్.

"అంకుల్" అంది శిల్ప బిత్తరపోయి.

"నేన్నీమోహన్ని శిల్పా, విల్సన్ని కాను" అన్నాడాయన గంభీరంగా.

"ఓహో నేన్నీ రోగసుందరిని కదూ" అంది వెంటనే తనూ గంభీరంగా గొంతు పెట్టి.

నేనూ, దిలీప్, జెరీనా ఆంటీ ఫక్కుమని నవ్వాం. ఆ ఇద్దరి సంభాషణలో వున్న జోకేమిటో అర్థంకాక మిగతా వాళ్ళంతా తెల్లముఖా లేశారు.

విల్సనంకుల్ దిలీప్ భుజం తట్టి "కంగ్రాచ్యులేషన్స్ మైబోయ్! ఇప్పటికైనా సరైన నిర్ణయం తీసుకున్నావ్. కులమతాలకూ, ఆస్తి అంతస్థులకే కాదు, సైన్స్ అండ్ టెక్నాలజీ క్కూడా అతీతమైంది ప్రేమ అని నిరూపించావ్" అన్నాడు.

శిల్ప హైమావతిగారి పక్కన నిలబడి "ఎంతన్యాయమో చూడండాంటీ. ఐడియా నాది. యాక్టింగ్ మీది. టోటల్‌గా కష్టపడి ప్రేమ గొప్పదని నిరూపించింది మనం. పేరు మాత్రం వాళ్ళకి. నాన్సెన్స్" అంది.

అందరూ నవ్వుతుంటే అమ్మమ్మ ఎక్కడినుంచో వూడిపడి "ఇదేంటే విడ్డూరం. అవతల ముహూర్తానికి వేళవుతుంటే ఇంకా అలంకారాలే కాలేదు. ఇట్లాగే కూర్చుంటారా ఏం పీటలమీద? కానీండి, కానీండి. ఒసేవ్ అంజూ, కాసులపేరు వేసుకోడం మర్చిపోబోకేవ్" అంటూ హడావుడి చేసేసింది.

# ఏరిన ముత్యాలు

★ అన్ని భయాలకంటే మరణభీతికి సమాధానం చెప్పలేం. మరణించినవాడికి ప్రమాదం సంభవిస్తుందనే భయం లేదు.

– ఐన్‌స్టీన్

★ డేగలు మౌనంగా ఉన్నప్పుడు చిలకలు కిలకిలలాడడం మొదలెడతాయి

– విన్‌స్టన్ చర్చిల్

★ ఆచరణ లేని సత్యసూక్తులు విషపూరితాలుగా మారిపోతాయి

– ఆరెండ్

★ ఎక్కువగా నిదురించేవారికీ, అధికంగా మేలుకుని ఉండేవారికీ ధ్యానం నిలవదు

– ఆండ్రీమొరై

★ ఆలోచనకీ, ఆచరణకీ అంతరం అంత మవుతే ఉదారత లభిస్తుంది

– విలియమ్ జేమ్స్

★ చేతనైనవాడు చేస్తే చేతకానివాడు బోధనకి ఉపక్రమిస్తాడు

– డయోజనీస్

★ విజయం సాధించేదాకా ఆటలో ఓడిపోయినట్టు కాదు

– జార్జిక్రాబ్

★ ఈ క్షణం కూడా అనంత కాలంలో భాగమే

– డన్‌కన్ స్టీవర్ట్

★ పరిణతి చెందడానికి అడ్డదారులు లేవు

– లూయిస్ బ్రాండైన్

★ వివాదం ఎంతకూ తెగలేదంటే అర్థం తప్పు రెండువైపులా వుందని

– ఓల్టేర్

★ నీ గొప్పతనంపై నీ నమ్మకం కంటే గొప్పపనులు సాధించేందుకు ఉత్తమసాధనం మరొకటి లేదు

– డా॥మారెఖస్

★ అన్నిజాతులకీ అర్థమయ్యే భాష డబ్బు

– శామ్యూల్ జాన్‌సన్

★ సూర్యుడికేసి తిరిగి నిలబడు, నీ నీడ నీకు కనిపించదు

– హెలెన్ కెల్లర్

★ బంధువుల్ని దేముడు ఇస్తాడు, స్నేహితుల్ని మనమే ఎంచుకుందాం

– వాట్సమమ్ ఫోర్ట్

★ నువ్వు నవ్వితే ప్రపంచమంతా నీతో కలిసి నవ్వుతుంది

– విల్‌కాక్స్

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతుర ప్రపంచం

## ప్రముఖుల ముచ్చట్లు

రాత్రి 7 గంటలకు విఖ్యాత రచయిత మార్క్‌ట్వైన్ ప్రసంగిస్తారని విరివిగా ప్రచారం జరిగింది. అయిదువేల మంది ఆయన అభిమానులు అత్యంత ఉత్సా యిత వస్తారని నిర్వాహకులు వెల్లడించారు. మరుసటి రోజు ట్వైన్ సభకు వచ్చారు. ప్రసంగం వినడానికి 500 మంది మాత్రం వచ్చారు. వేదికపై నిలబడిన ట్వైన్ ప్రేక్షకుల




హంతో ఆడిటోరియమ్ చేరుకున్నారు. వారు ఎంతసేపు ఎదురు చూసినా ఆ రచ యిత సభకు రాలేదు. చివరికి నిర్వాహ కులు కొన్ని అనివార్య కారణాల వలన ట్వైన్ రాలేకపోయారనీ, ఆ మరుసటి రోజు రాత్రి 7 గంటలకు ఆయన వచ్చి ప్రసంగి స్తారనీ ప్రకటించారు.

మర్నాడు వెయ్యిమంది మాత్రమే అక్కడ హాజరయ్యారు. ఆరోజున కూడా ట్వైన్ రాలేదు. ఆ మర్నాడు రాత్రి 7 గంటలకు రచ

మొహాల్లోకి పరీక్షగా చూశాడు. వారంతా కోపంగా, చిరాకుగా ఉన్నారు. ఆయన ప్రసం గాన్ని ప్రారంభించారు.

"సభకు నమస్కారం. మొన్నటి రోజు నేను సభకు రాలేకపోయాను. నిన్నటి రోజు మాత్రం ఉద్దేశపూర్వకంగానే రాలేదు. ఎందుచేతనంటే హెచ్చుగా గుమిగూడిన జనం ముందు ప్రసంగించడం నాకు ఇష్టం ఉండదు. రెండు రోజులు నేను రాకపో యినా నాపై ఎంతో అభిమానంతో వచ్చిన మీవంటి శ్రోతలే నాకు కావలసింది. సాహ త్యంపై అభిమానం, భావుకత ఉన్నవారు

కాబట్టే మీరు నిరుత్సాహం చెందకుండా సభకు వచ్చారు" అన్నాడు.

ఆడిటోరియమ్ అంతా ప్రేక్షకుల చప్పట్లతో మారుమోగింది. ప్రేక్షకులలో చిరాకు కరిగిపోయింది. కోపం మాయమయింది. అంతా వికసించిన వదనాలతో మార్క్‌ట్వైన్ ప్రసంగాన్ని కుతూహలంతో వినడానికి ఆయత్తమయ్యారు.

✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱

సర్ ఆస్టిన్ చాంబర్ లెయిన్ బ్రిటిష్ ప్రధానిగా ఉన్న కాలంలో మనదేశపు ముద్దు బిడ్డ, మహామహుడు అయిన రైట్ ఆనరబుల్ వి.ఎస్.శ్రీనివాస శాస్త్రి ఇంగ్లాండులో పర్యటనకు వెళ్లారు.

ఒకరోజున ఆయన ప్రసంగం ఆక్స్‌ఫర్డ్‌లో ఉంది. అక్కడికి వెళ్లడానికి ఆస్టిన్ నిరాకరించాడు. అయితే అంతకుముందు శాస్త్రిగారి ప్రసంగం విని ముగ్ధులైన, ఆస్టిన్ మంత్రివ




ర్గంలోని సభ్యులు కొందరు ఆస్టిన్‌కు పదే పదే చెప్పారు... ఆస్టిన్ ప్రసంగానికి తప్పక హాజరు కావలసినదని.

శాస్త్రి ప్రసంగానికి, మంత్రి వర్గ సమావేశానికి మధ్య ఒక గంట వ్యవధి ఉంది. చివరికి ప్రధాని శాస్త్రి ప్రసంగానికి హాజరయ్యాడు. మహత్తరంగా ఉన్న శాస్త్రి ప్రసంగంలో లీనమై తన్మయత్వంలో కూర్చుండిపోయాడు ఆస్టిన్... కొంతసేపటికి ఆయన చేతికున్న వాచీ చూశాడు. అప్పటికే అర గంట ఆలశ్యమైంది. క్యాబినెట్ మీటింగ్ ప్రారంభంకావలసిన సమయం.

ఆస్టిన్ ఆశ్చర్యం చెందాడు తన మంత్రులందరూ తన వెనకే కూర్చుని ఉండడం చూసి. శాస్త్రిగారి ప్రసంగం పూర్తయిన పిమ్మట ప్రధాని సరాసరి వేదికపైకి వెళ్లి శాస్త్రిని హృదయపూర్వకంగా అభినందించి....

"సార్! మీ అద్భుతమైన ప్రసంగం వినడంకొరకు ఎన్ని క్యాబినెట్ మీటింగ్‌లనయినా త్యాగం చెయ్యొచ్చు. ఇంత గొప్ప ప్రసంగాన్ని ఇదివరలో నేను ఎక్కడా వినలేదు" అన్నాడు.

✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱✱




జ్ఞానపీఠ బహుమతి గ్రహీత శివరామ్ కారంత్ కన్నడ సాహిత్యాకాశంలో ఒక ధృవతార వంటివాడు. ఆయన 46 నవలలు, 65 నాటకాలు, అనేక వాల్యూముల వ్యాసాలు, అసంఖ్యాకమైన సైన్సు పుస్తకాలు, మూడు ఎన్‌సైక్లోపీడియాల వాల్యూములు, మూడు వాల్యూముల బాలప్రపంచం, నాల్గు వాల్యూముల విజ్ఞాన ప్రపంచం, యక్షగానాలపై 2 సాధికారిక గ్రంధాలు, ఒక నిఘంటువు, పిల్లలకు 150 పుస్తకాలు రచించారు.

సాహిత్య, సంగీత అకాడమీల పురస్కారాలు, అనేక విశ్వవిద్యాలయాలు అందచేసిన డాక్టరేట్‌లు ఆయన్ను అలంకరించాయి. ఎమర్జెన్సీ సమయంలో కారంత్ తనకు ప్రభుత్వంవారిచ్చిన పద్మభూషణ్ బిరుదును తిరస్కరించాడు. ఆయన కర్నాటకలోని అనేక గ్రామాల్లో సంచరించి, అస్పృశ్యుల జీవితాలను వివిధ కోణాల్లో పరిశీలించాడు. ఆ అనుభవసారాన్ని పొందుపరిచిన విఖ్యాత నవల 'చోమనదుడి' రాశాడు.

ఆ మహత్తరమైన నవలను కేవలం 5 రోజుల్లో పూర్తి చేశాడు కారంత్. ఆ నవల వ్రాతప్రతికి తొలిసారిగా లభించిన మెప్పుకోలు పాఠకులనుంచి రాలేదు.... ఒక ఆవునుంచి వచ్చింది. కారంత్ వ్రాతప్రతిని తన ఇంటి వరండాలో పెట్టి మంచినీళ్లు తాగడానికి ఇంట్లోకి వెళ్లాడు. అంతలో ఆకలితో ఉన్న ఒక ఆవు వచ్చి ఆ కాగితాలని కరిచి పట్టుకుని పరుగుతీసింది. అలా పరుగుతియ్యడంలో కొన్ని పేజీలను నమిలివేసింది. చిత్రమేమిటంటే మంగుళూరులో ఆవులు పుస్తకాల విషయంలో చాలా ఆసక్తిని చూపిస్తాయి.... అక్కడి మనుషులకన్నా.

కారంత్ ఒక కర్ర తీసుకుని ఆవు వెంటపడి, ఎలాగైతేనేం చివరికి ఆవు నోట్లోంచి వ్రాతప్రతిని గుంజుకోగలిగాడు. ఆవు భోంచేసిన కాగితాలను తిరిగి ఓపిగ్గా రాసి పుస్తకాన్ని ప్రచురించాడు. అది బహుళ ప్రజాదరణ పొందడమేకాక కారంత్‌కు విశేష ఖ్యాతినందించింది.

విఖ్యాత రచయిత అలెగ్జాండర్ డ్యూమాస్ 'కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో', 'ది త్రీ మస్కిటీర్స్', 'ది బ్లాక్ తులిప్' నవలల ద్వారా ప్రపంచవ్యాప్తంగా పాఠకుల మన్ననలు పొందాడు. ఆయన ఎంత గొప్ప రచయితో, అంత తమాషా వ్యక్తి. ఎప్పుడూ స్నేహితులతో, అభిమానులతో సరదాగా ఉంటూ, వారిని నవ్విస్తూ తను

ఒక గదిలోకి వెళ్లాడు గంభీరంగా. గది తలుపులు మూశాడు. అందరూ ఆ గదిముందు గుమికూడారు. వారంతా గదిలోంచి వినవచ్చే రివాల్వర్ శబ్దం కోసం ఆతృతగా ఎదురు చూడసాగారు. కొద్దిక్షణాల్లో రచయిత జీవితం అంతం కానున్నందుకు వారు విషణ్ణ వదనాలతో నిలబడ్డారు.

అక్కడ గాఢమైన నిశ్శబ్దం నెలకొంది.




ఆనందిస్తూ ఉండేవాడు.

ఒక రోజున ఆ రచయితకు, పేరుపొందిన ఓ రాజకీయనాయకునికి మధ్య ఓ చిన్న వివాదం ఏర్పడింది. అది చినికి చినికి గాలివాన అయింది. చివరికి పెద్దల సమక్షంలో ఆ రచయిత, రాజకీయనాయకునికీ మధ్య పోటీ పెట్టబడింది.

పిస్టల్ షూటింగ్‌లో ఇద్దరూ ఘనాపాటీలే. కొంతసేపు షూటింగ్ కార్యక్రమం ఇద్దరి మధ్యా రసవత్తరంగా సాగింది. ఆ పోటీలో ఇద్దరూ సమానంగానే నిలిచారు.

కొంతసేపటి తర్వాత తిరిగి పోటీ కొనసాగింది. ఓడిపోయినవారు రివాల్వర్‌తో తమను తాము కాల్చుకుని మరణించాలి. అలా అని పెద్దలు షరతు విధించారు.

ఈసారి డ్యూమస్ పరాజయం పాలయ్యాడు. వెంటనే పిస్టల్ పట్టుకుని అతను

సస్పెన్స్ గడ్డకట్టింది. కాసేపటికి రివాల్వర్ శబ్దం బిగ్గరగా వినిపించింది గదిలోంచి. బయటున్నవారంతా ఆతృతగా తలుపులు తోసుకుని లోపలికి వెళ్లారు. చేతిలో పొగలు చిమ్ముతున్న రివాల్వర్‌తో డ్యూమస్ వారికి కనిపించాడు.

"అయ్యలారా! చాలా పెద్దపొరపాటు జరిగిపోయింది. రివాల్వర్ గురి తప్పింది." నవ్వుతూ చెప్పాడు డ్యూమస్.

ఆయన చేసిన తమాషాకు వారంతా నవ్వుకున్నారు. తమ మిత్రుడు, రచయిత బతికి ఉన్నందుకు వారి ఆనందం ఇబ్బడి ముబ్బడి అయింది.

**********************

# ఏరిన ముత్యాలు

★ తన మిత్రుల్ని కావాలని మోసగించేవాడు భగవంతుణ్ణి కూడా తేలిగ్గా మోసగిస్తాడు.

– పటేల్

★ విశ్రాంతి యొక్క ఆనందం కష్టపడి పని చేసేవాడు మాత్రమే పొందగలడు.

–లింకన్

★ మీ తప్పును లేదా ఓటమిని కప్పి పుచ్చుకోవడం రెండింతల అపరాధం అవుతుంది.

–షూరత్ఆళ్వార్

★ భావ వికాసం వల్లనే సంఘసంస్కరణ జరుగుతుంది.

– హెర్బర్ట్

★ పుస్తకం కన్నతల్లి వంటిది. ఎన్ని వినోదాల వెంట పడినా చిట్టచివరకు పుస్తకం నీడలోకి చేరుకోక తప్పదు.

–మధురాంతకం రాజారాం

★ సంతోషం ధర్మపరాయణత్వం నుండి పుట్టుకొస్తుంది. ప్రపంచసారం ధర్మ పరాయణత్వం పైన ఆధారపడి ఉంటుంది.

–వాల్మీకిమహర్షి

★ అంతా దేముడేనన్నది కాదు నా వాదన, దేముడు మాత్రమే నన్నది నా వాదన.

–స్వామీవివేకానంద

★ జీవిత పరమార్థాన్ని తెలియజేయలేని చదువు శ్మశానంలో నక్కల అరుపు లాంటిది.

–బైబిల్ సూక్తి

★ భయం ముందున్నప్పుడు తర్కం వెనక ఉంటుంది.

–విద్యాప్రకాశానందగిరి స్వామి

★ ఎలాంటి పోషణా లేకుండా పెరిగే ఏకైక వస్తువు 'అహం'.

–రాజాజీ

★ మనుషులు ఇహాన్నైనా వదులుతారు గానీ అహాన్ని మాత్రం వదలరు.

–వివేకానంద

★ స్వతహాగా ఉన్న మంచితనానికి ముసుగేసి దుర్మార్గం నటిస్తున్నాం. ముసుగు తొలగిస్తే అందరమూ మంచివారమే.

–జాన్ హేమంతకుమార్

సేకరణ: శివప్రసాద్ పండా

# 'మహావృక్షం' పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర' లో ప్రచురితమైన అత్తలూరి విజయలక్ష్మి నవల 'మహావృక్షం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## వివాహం అనివార్యం కాదు

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

నాటి 'మదర్‌థెరిస్సా' నుంచి నేటి 'అబ్దుల్ కలామ్' దాకా మనదేశంలో ఎంతోమంది మహానుభావులు తామనుకున్న లక్ష్యాన్ని సాధించేందుకు అవివాహితులుగా ఉండిపోయి తమ జీవితాలను దేశసేవకో, ప్రజా సేవకో అంకితం చేసినవారున్నారు. ఒక పురుషుని విజయం వెనుక ఒక స్త్రీ హస్తం తప్పక వుంటుందంటారు. కాని ఒక స్త్రీ విజయం వెనుక (ఎక్కడో అరుదుగా తప్ప) ఒక పురుషహస్తం వుంటుందని ఖచ్చితంగా చెప్పలేం. 'మహావృక్షం' నవలలో డా. అనూష వివాహానంతరం పడిన బాధలు తలుచుకుంటే గాంధీమహాత్ముడు అన్న ఒక వాక్యం గుర్తువస్తుంది. "స్త్రీకి వివాహం అనివార్యం కాదు". ఈ దేశంలో ఒక వివాహిత తన లక్ష్యాన్ని సాధించేందుకు పూనుకున్నా ఆ వివాహమే ఆమెకు ప్రతిబంధకమైపోతుందన్న విషయం ఆ 'మహాత్మునికి' తెలుసు. తరాలు మారినా ఈ విషయంలో అంతరం పెద్దగా రాలేదని ఈ నవల ఋజువు చేస్తుంది.

ఎంతోమంది అభాగ్య స్త్రీలకు ఆశ్రయమిస్తూ పేదలకు సేవచేయడమే తన వృత్తి, ప్రవృత్తిగా జీవిస్తూన్న అనూషకు వివాహం ఒక పెనుతుపానులా సంభవించి మనస్తాపాన్ని కలుగజేస్తుంది. అంకితభావంతో తన పర బేధం లేని సేవ చేస్తూన్న ఆ మహామనీషికి తన సహాయ సహకారాలందించవల్సిన భర్తే డబ్బు వ్యామోహంతో, స్వార్థంతో అమానుషంగా ప్రవర్తించి వేరుపురుగై ఆ మహావృక్షాన్ని కూల్చడానికి ప్రయత్నించిన తరుణంలో తననుతాను కాపాడుకుంటుంది. చివరికి కథ సుఖాంతమవుతుంది. "ఏ రంగంలోనైనాసరే అంకిత భావంతో సేవ చెయ్యాలనుకొనేవారు, తమ జీవిత భాగస్వామిని ఎంచుకొనేముందు బాగా ఆలోచించి తమతో పూర్తిగా సహకరించి, సహాయమందించగల వ్యక్తినే వివాహమాడాలి. లేదా అవివాహితగా వుండిపోవడమే మంచిది. ప్రగతిని సాధించాలనుకొనే స్త్రీకి వివాహం అనివార్యం కాదు" అన్న సందేశం ఇందులో వుంది.

ఇంత మంచి ఇతివృత్తం గల నవలనందించిన రచయిత్రి అత్తలూరి విజయలక్ష్మి గారు అభినందనీయులు. నవలాంతంలో లాయర్ వీణ- "ఎందరికో నీడనిస్తూ, ఫలాలనిస్తూ, ఆశ్రయాన్ని కల్పిస్తూ, కీర్తిప్రతిష్ఠలనే కొమ్మలతో శాఖోపశాఖలుగా విస్తరించే ఈ మహావృక్షాన్ని, సంసారం అనే కుండీలో పాతి 'బోన్సాయి'గా పెరగమని ఆదేశించాను. బోన్సాయి అందానికీ అలంకరణకే గాని పదిమందికీ ఉపయోగపడలేదు" అన్న వాక్యాలు మొత్తం నవలకే హైలైట్! ఇతివృత్తంలోని సారాంశం అంతా ఈ వాక్యాల్లో నిగూఢంగా దాగివుంది. ఇంతమంచి నవలను అందించిన 'చతుర'కు అభినందనలు!

– భాగవతుల లలితశర్మ
రాజమండ్రి - 533 104

## పరోపకారార్థం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఆగస్టు నెల చతుర మమ్మల్ని ఆసాంతం

ఆకట్టుకొందని చెప్పడానికి ఆనందిస్తున్నాం. అత్తలూరి విజయలక్ష్మిగారి 'మహావృక్షం' ఆపకుండా చదివించింది. ఉన్నతమైన వ్యక్తిత్వం, విశాలమైన మనసుతో పరోపకారార్థమిదం శరీరం అన్నట్లు జీవించే డాక్టర్ అనూషను 'మహావృక్షం'గా పేర్కొనడం చక్కని పోలిక. అలాంటి మనిషికి భరణి లాంటి భర్త దొరకడం, అతనికోసం ఆమె మామూలు మహిళలా బాధపడడం నిజంగా చాలా బాధేసింది. నిజజీవితంలో అది మామూలే అనుకోండి. కనీసం కాల్పనిక ప్రపంచంలోనైనా ఆదర్శమూర్తులు దొరుకుతారేమోనని ఆశ. నా ఆ ఆశను భరణి పాత్ర పటాపంచలు చేసింది. వృత్తిపరంగా మేధావికోవకు చెందినవాడైన భరణి అతిసామాన్య పురుషుడు. అందగాడు, ఆజానుబాహుడు కావచ్చుకానీ వ్యక్తిత్వపరంగా అతడు అనూష భుజాలుదాటి ఎదగలేని మరుగుజ్జు. అందనిదాని కోసం అర్రులు చాచిన అర్భకుడు. డా. అనూష లాంటి మహనీయురాలు తన భార్య కావడం గొప్ప అనుకున్నాడే కానీ ఆ గొప్పదనాన్ని తట్టుకునే సామర్థ్యం తనకు లేదని తెలుసుకోలేకపోయాడు. భరణి అసలు రూపం చూశాక స్త్రీ సహజమైన బేలతనంతో వడదెబ్బ సోకిన వటవృక్షంలా కాస్త వాడినా వీణ, వసుధల సహకారంతో తిరిగి చేతనత్వాన్ని తెచ్చుకున్న ఆ మహావృక్షం నేటి అనూషలెందరికో స్ఫూర్తి. నవలలో పాత్రలన్నీ కూడా వాస్తవ సామాజిక పరిస్థితులకు అద్దం పడుతున్నాయి. మంచి రచన చదివే అవకాశం కల్పించిన రచయిత్రికి, ప్రచురించిన మీకు అభినందనలు.

– బి. వరలక్ష్మి

హైదరాబాదు-500 004

## సమాజానికి సందేశం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

సమాజానికి చక్కని సందేశాన్ని ఇవ్వాలన్న సత్‌సంకల్పంతో రచయిత్రి ఒక ఉదాత్తమైన, ఉన్నతమైన, నిరాడంబరమైన పాత్ర సృష్టించి డా. అనూషగా మనముందుకి తెచ్చారు. ఆ పాత్ర ద్వారా ఎన్నో ప్రయోజనకరమైన సత్‌కార్యాలు, సంఘసేవ చేయించారు.

నానాటికీ దిగజారుతున్న స్త్రీల సమస్యలు, పరిస్థితులు కళ్లకి కట్టినట్లు చూపించారు. దగాపడ్డ స్త్రీల దీనత్వం, దయనీయ పరిస్థితులు, కష్టాలు, కన్నీళ్లు శ్యామల, సుశీల వగైరా పాత్రల ద్వారా చెప్పారు. వృత్తికి, ప్రవృత్తికి, మమకారానికి, అనురాగానికి, చదువుకి, మాతృప్రేమకి స్త్రీ మనసులో అరలుంటాయని డా. మణి పాత్ర ద్వారా చెప్పారు. ఇక నవలకి అసలు కథానాయకి అన్పించే వీణ కేరక్టర్ డా. శ్రీదేవి నవల కాలాతీతవ్యక్తులులో ఇందిర పాత్రలా ఎన్ని సంవత్సరాలైనా మర్చిపోలేనిది. జీవితాన్ని చాలా తేలిగ్గా తీసుకున్నట్లు నవ్వుతూ, తుళ్లుతూ తిరిగే వీణ మనస్సు దుఃఖమయం. మనిషి నడవడికవేరు. మనసు వేరు. సృష్టించే ముందు దేముడు అందరి మనసుల్లోనూ అమృతాన్నే నింపుతాడు కానీ పరిస్థితుల ప్రభావం మనుషుల జీవితాల్ని ఎంతయినా దిగజారుస్తుంది అని వీణ పాత్ర ద్వారా చెప్పారు.

ఇక భరణిలాంటి సోమరిపోతులు, అవకాశవాదులు కష్టపడకుండా ఓవర్‌నైట్ కుబేరులవుదామనే స్వార్థపరులు నిత్యజీవితంలో మనకి తారసపడుతూ వుంటారు. వివాహమనే పవిత్రమైన బంధాన్ని నేర్పుగా బిగించి ఆ బంధానికి మన సమాజంలో వున్న ప్రాముఖ్యతని, సెంటిమెంటుని అడ్డుపెట్టుకుని వాళ్ల పనులు చక్కపెట్టుకోవటం, అది గెలుపుగా భావించి గర్వించటం చూస్తూనే వున్నాం. స్త్రీ ఎంత విద్యావంతురాలయినా ఎంత మంచి పొజిషన్‌లో వున్నా సర్వస్వతంత్రురాలయినా పెళ్లి అనే సెంటిమెంటుకి తలవంచి కోరి నరకంలో కాలుపెట్టడం అనూష పాత్ర తెలియచేసింది.

నవలా నాయిక అనూష నిరాడంబరత, నిస్వార్థం, పరోపకారం, సమాజసేవ అనా

ధల దీనగాధలకి చలించి వార్ని అక్కున చేర్చుకోవటం లాంటి సుగుణాలున్న పరిపూర్ణ స్త్రీ. ఇట్లాంటి నూరు సుగుణాలు నిండిన స్త్రీలు ఈనాడు వుంటారా నవలల్లోనూ, సినిమాల్లోనూ తప్ప అనేస్తారు తేలిగ్గా. కానీ నూరు సుగుణాలూ ఒక్కరిలో వుండకపోవచ్చు. నూరు మందికి ఒక్కొక్కటిగా వుండే వుంటాయని రచయిత్రి అనూష పాత్ర ద్వారా మంచి సందేశాన్ని, పరిష్కారాన్ని సమాజానికి అందించారు. ఈ నవల డాక్టర్లు, ఏక్టర్లు, మామూలు మనుషులు ఎందరో చదువుతారు. ఏ వృత్తిలోవున్న వారయినా సమాజానికి సేవ చెయ్యచ్చు. తోటి మనిషిని ఆదుకోవచ్చు అనుకుని వెయ్యి కొక్కరు మారినా రచయిత్రి ఆశ ఫలించినట్లే.

– పి.సీతాలత
విశాఖపట్నం-7

## గొడ్డలిదెబ్బ

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఆగస్ట్ నవల'మహావృక్షం' లోని అనూష పాత్రను ఎంతో ఉదాత్తంగా తీర్చిదిద్దారు రచయిత్రి. దాంతోపాటు మానవ సహజమైన బలహీనతలు కూడా సమర్ధనీయమే. అయితే సమయానుకూలంగా ఆ బలహీనతలను అధిగమించగల స్థైర్యం ఆమెలో వుండటం ఆ పాత్రకు వన్నెతెచ్చింది.

ఒక జర్నలిస్టుగా ఆమెకు తన పేపర్‌లో చోటిచ్చి ఆమె హృదయంలో చోటు సంపాదించుకున్న భరణి భర్తగా మారాడు. ఈ మగవాడు అనూష ఊతంతో పైకి ఎదగాలని చేసిన ప్రయత్నంలో పూర్తిస్వార్థపరుడిగా మారాడు. వృత్తే దైవంగా భావించిన ఆమె అంకితభావాన్ని చెదరకొట్టగలిగాడు. ఆమెనుండి తనాశించిన సహాయం రాదని రూఢి అయిన క్షణంలో పక్కదారులు పట్టాడు. అనూష సంతానవతి కాలేదన్న విషయం తెలుసుకున్న వెంటనే నీరజతో సంబంధం పెట్టుకున్న భరణి మగవాడి నైజానికి ప్రతీక. అనూష మానసిక సంఘర్షణను, భరణిలో స్వార్ధపరత్వం పరాకాష్ఠకు చేరుకుని జుగుప్స కలిగే విధంగా ప్రవర్తించిన తీరును చెప్పటంలో రచయిత్రి ప్రతిభ ప్రస్ఫుటమైంది.

వీణ, మణి, నీరజ మొదలగు పాత్రలతోపాటు ముఖ్యపాత్ర అనూష విజయలక్ష్మి గారి స్త్రీ మనస్తత్వపు లోతైన అవగాహన నుండి ఊపిరి తీసుకున్న పాత్రలు. అందుకే సజీవంగా, సహజంగా ఉన్నాయి. చక్కని జిగిబిగితో సాగిన కథనం నవలను చదివిస్తుంది. ఆద్యంతం బావుంది.

భరణి అనూషను మహోన్నత వ్యక్తిగా, సమర్ధతకు ప్రతిరూపంగా భావించాడు. పొరపాటున భూలోకానికి వచ్చిన దేవతంటాడు. ఆమెతో మాట్లాడటమే అదృష్టమనుకున్నాడు. ఆమెతో వివాహం తన జన్మకు సార్థకత చేకూరుస్తుందని అనుకున్నాడు. అటువంటి భరణి వివాహం తరువాత మారటానికి కారణం సాధారణ మగవాడి స్వభావం. ఇపుడు అనూష తన భార్య. మామూలు స్త్రీ. వివాహం ఆమె మీద అధికారానికి ఒక లైసెన్సుగా పరిగణించాడు. స్త్రీని స్త్రీగాకాక ఒక మనిషిగా చూడగలిగే మానసిక స్థితికి మగవాడు చేరగలిగితే స్త్రీపురుష సంబంధాలు తద్వారా మానవ సంబంధాలు బావుంటాయి. అనూషలాంటి మనుషులు ఈ సమాజానికి ఎంతో అవసరం. భరణిలాంటి చీడపురుగుల నుండి, వారి గొడ్డలి దెబ్బల నుండి అనూషలాంటి మహావృక్షాలను కాపాడినపుడే అవి ఎంతో మందికి ఆశ్రయాన్ని, భద్రతని, ఆత్మీయతను ఇస్తాయి.

–కొత్తపల్లి లత
గుడివాడ

# ప్రేరణ

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

అత్తలూరి విజయలక్ష్మి నవల 'మహా వృక్షం' నాకెంతగానో నచ్చింది. చదువుతున్నంత సేపు ఎటువంటి ఇబ్బందులు లేకుండా చికాకులు కలుగకుండా సాఫీగా నవల సాగిపోతుంది.

రచయిత్రి నవలానాయిక అనూష పాత్రను మలిచిన తీరు చాలా బాగుంది. పరోపకార పరాయణత్వం, పట్టుదల, మంచితనం, నిరాడంబరత్వం, సేవాగుణం తదితర మంచి గుణాలతో అనూష పాత్రను మలిచారు. ఆశయాలుంటే సరిపోదు. ఆ ఆశయాలను సాధించాలంటే ఓర్పు, సహనం, ప్రలోభాలకు లొంగని దృఢమైన మనస్తత్వం, ఆత్మ సమర్పణ కావాలని చాటారు. అంతేకాదు, "పడిపోవడంలో లేదు గొప్పతనం. పడినప్పుడల్లా పైకి లేవడంలోనే ఉంది" అని పాఠకులకు అర్థమయ్యేలా అనూష పాత్రను కొనసాగించారు.

ఈ నవలలో మరో ముఖ్యపాత్ర 'వీణ'. ఆధునిక భావాలున్న స్త్రీమూర్తికి ప్రతిరూపం. స్త్రీవాద ధోరణులు కొంతవరకు ఆ పాత్రలో చోటుచేసుకున్నా ఎక్కడా అతి అనిపించకుండా ఆమె వ్యక్తిత్వాన్ని రూపుదిద్దడంలో రచయిత్రి తన కలానికున్న బలాన్ని చూపారు. జీవితాన్ని సరదాగా ఎంజాయ్ చేసే ఆమె వెనుక ఉన్న బాధామయ గాథను, స్నేహం కోసం స్నేహితురాలి కోసం ఆమె పడే తపనను చక్కగా చిత్రీకరించారు.

ఆదర్శాలు వల్లించడం సులభం. వాటిని పాటించడమంటే మాటలు చెప్పినంత ఈజీ కాదు. ముఖ్యంగా తన ఇల్లాలు, ఇంటిని సైతం పట్టించుకోకుండా దీనజనసేవకు నడుం బిగించి పనిచేస్తుంటే హర్షించే భర్తలు బహుకొద్దిమంది మాత్రమే ఉంటారు. అదే పరాయివాళ్లు చేస్తుంటే మాత్రం ఆదరిస్తుంటారు. అభిమానిస్తుంటారు. పురుషాధిక్యత, అహంకారం, ఆడది అణిగిమణిగి ఉండాలనే స్వభావం ఇందుకు కారణం. జర్నలిస్టుగా జీవితాన్ని గడుపుతూ తన పత్రికలో స్త్రీల సమస్యలకు ప్రత్యేకంగా పేజీలు కేటాయిస్తూ నిజజీవితంలో ఇందుకు వ్యతిరేకంగా ప్రవర్తించే మగవారికి ప్రతీక భరణి పాత్ర. నవలలో ఈ పాత్ర వచ్చినప్పుడల్లా ఇది మన జీవితంలో ఎక్కడో తారసపడిన వ్యక్తితాలూకు జ్ఞాపకాలుగా అనిపిస్తాయే తప్ప ఒక పాత్రగా అనిపించదు.

సరళమైన సంభాషణలు, సన్నివేశాలతో రచయిత్రి కథను ఆద్యంతం ఆసక్తిదాయకంగా తీర్చిదిద్దారు. ముందుముందు ఏం జరుగుతుందోననే ఆసక్తి, ఉత్కంఠ పాఠకులను పరుగులు పెట్టిస్తూ నవలను పూర్తిగా చదవడంలో సహకరిస్తుంది. డా. అనూషలోని సేవా నిరతి ప్రతీ ఒక్కరికి ప్రేరణగా నిలుస్తుంది. అందుకు రచయిత్రి అభినందనీయురాలు.

– సయ్యద్ ఖుర్షీద్

మహబూబాబాద్-506101


Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.

Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad.

Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

